శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# మృత్యుంజయోపాసన

రచయిత

విద్వాన్ నడాదూరి విజయరాఘవాచార్యులు
చెన్నై

ప్రచురణ కర్త :

నడాదూరి విజయరాఘవాచార్యులు
49, B (11) 27వ వీధి,
తిల్లైగంగానగర్,
నంగనల్లూరు, చెన్నై-600 061.

46/19



# అంజలి

శ్రీనివాస! దరిని జేరిచి నను దండ్రి
వోలె విద్యనేర్పి బుద్ధి గఱపి
బ్రతుకు తెరువు జూపి పాలించితివి భవ
చ్చరణసరసిజములె శరణు శరణుం

వ్రాయుతత్త్వమీవె వ్రాయించుకొనువాడ
వీవె వెల్వఱింప నెలమి నర్థ
దాతవగుచు మిగిలి దాసుని గరుణతో
నాదుకొనెదు లీల లద్భుతములు.
దైవ తత్త్వమెల్ల దలచి వ్రాయగ వ్యాస
వాల్మికాదిమునుల వశముగాక
పరుల కలవియగునె! వారి మాటలె కొన్ని
చిలుకపలుకులట్లు చెప్పుకొంటి.

తల్లి దండ్రి గురువు దాతయు దైవంబు
నీవనాకు దలప నెన్నిజన్మ
ములకునైన ననుచు మ్రొక్కెద సతతంబు
నేమిగతిమొనర్ప నెంచినావో!

తప్పు లెన్నొగలవు దలపశక్యముగాదు
శరణమనుచు జేరి చరణసీమ
బడినని బ్రోచు దొడ్డ ప్రభుడ వయ్యెదు తండ్రి!
చింతయేల? నాకు శ్రీనివాస!

హరియె కాదు హరుడు హరిహరుండగు గాదు
నంబికయె యటంచు నాడు చంద్రు
పరులు రూపులెల్ల భావింప నీవి నా
తండ్రివనియె నిన్ను దలచి గొలుతు గ్రంథకర్త

(ఈ గ్రంథకర్త చిఱుప్రాయముననె తన పితృపాదుల వద్ద సంస్కృతము, ఆయుర్వేదము, జ్యోతిషము నేర్చెను. 1938 నుండి 1945 వఱకు తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో విద్య నభ్యసించెను. 1945లో అప్పటి మదరాసు విశ్వవిద్యాలయమునకు జెందిన తెలుగు విద్వాన్ పరీక్షలో అప్ప మదరాసు రాజధానిలో సర్వప్రథముడుగ నుత్తీర్ణుడగునట్లు శ్రీ శ్రీనివాసు డనుగ్రహించెను. ఉచిత భోజనము వసతి ఏర్పఱచి తన సన్నిధిలో విద్య నేర్పననుగ్రహించిన శ్రీ శ్రీనివాసుని తన తండ్రిగా విశ్వసించి యహరహము మానసికముగ పూజించి గొలుచు చున్నాడు).

# మున్నుడి

మన ఉపాస్య దైవముల గురించి వేదోపనిషత్పు రాణేతి హాసాది గ్రంథములలో గల తత్త్వాంశములనెల్ల పరిశీలించి సులభముగ తెలిసికోదగినట్లు పుస్తకముల రచించి వెలయింపవలెనన్న కోరిక నాకు విద్యార్థి దశలోనే మనస్సున నెలకొన్నది. అప్పటి నుండి వైదిక వాఙ్మయమునకు జెందిన లభించిన గ్రంథములనెల్ల చదివి ముఖ్యాంశముల గుర్తించుకొను చుంటిని. ఈనా కోరిక నేటికి ఫలింప నారంభించనిది.

ఆకించన్య గ్లపితుడనగు నేను దీనినెట్లు ముద్రింపగలనని వ్రాత ప్రతిని మూలలో బడవేసి యుంటిని.

ఒంటిమిట్టలో మా కుటుంబము ఉండిన కాలమున ప్రకృతము వైకుంఠవాసియగు మా తండ్రిగారు పరమాప్త మిత్రులై యుండిన కీ.శే. శ్రీ కొమ్మినేని అయ్య వారప్ప శెట్టిగారి కుమారుడు ప్రకృతము పురప్రముఖులలో నొకరుగా వెలసియున్న శ్రీయుత కొమ్మినేని భాస్కర శ్రీరామమూర్తిగారి వలన మొగలిచెర్ల (ప్రకాశంజిల్లా) వాస్తవ్యులు, నిరంతర ధర్మ కార్యాచరణ తత్పరులగు మహనీయులు పవని శ్రీధరరావుగారు నన్ను గురించి తెలిసికొని పరమకృపతో తమ సతీమణి, పరమ సాధ్వి శ్రీమతి పవని నిర్మల ప్రభావతి యమ్మగారు రచించిన పుస్తకములను బంపిరి. అమ్మగారు శ్రీమద్రామాయణ, భాగవతాది గ్రంథముల దఱచి సారతమవిషయములను చక్కని తెలుగున పుస్తకములుగా రచించి యున్నారు. వానిని చదివి నామనస్సున గలిగిన పరమానందమును లేఖామూలమున వారికి దెలుపుకొంటిని. శ్రీమతిగారు నారాయణాష్టాక్షరీ మంత్రమును కోటి మారులు జపముచేసి, ప్రకృతము శివపంచాక్షరిని కోటి మారులు జపింప దీక్ష బూని కొనసాగించుచున్న తపస్విని, లలితా సహస్ర నామమునకు ఇటీవల చక్కని వ్యాఖ్య రచించి యున్నారు. లేఖా మూలమున ఈ నా

గ్రంథమును గుఱించి తెలిసికొని శ్రీధరరావుగారు గ్రంథ ముద్రణకై వలసిన ఆర్థిక సాహాయ్యమునకై శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారిని ఆశ్రయింప వచ్చునని సూచించిరి. వారి ప్రేరణతో వ్రాతిప్రతిని దేవస్థాన కార్యనిర్వాహకులకు బంపుకొంటిని. భగవంతుని కరుణ, భాగవత కృప కలిసివచ్చి దేవస్థానాధికారులు ఆర్థిక సాహాయ్యమొనర్ప అంగీకరించిరి. ఇట్టి పరమోపకృతి మొనర్చినపై దంపతులకు శతాధిక సమాయుస్సు, చక్కని ఆరోగ్యము, ఇతోధిక సంపత్సమృద్ధులు అనుగ్రహించి రక్షింపగలందులకు శ్రీశ్రీనివాసుని వేడుకొను చున్నాను.

ప్రకృత గ్రంథ రచనకు ఉపకరించిన గ్రంథములు శతాధికములు. వానినరచయితలకెల్ల నా కృతజ్ఞతాంజలిని సమర్పించు చున్నాను.

ఆర్థిక సాహాయ్యమొనర్ప అంగీకరించిన దేవస్థాన కార్యనిర్వాహకులకు నా నమస్సులు.

అజ్ఞాన వశమున విషయ ప్రతిపాదనమున నేర్పడిన దోషములను, ముదిమికి తోడు గ్లకోమా వ్యాధివలన కంటి చూపు చాలవఱకు తగ్గినందున ప్రూఫుల పులుదిద్దుటలో వదలిపోయిన అచ్చు తప్పులను మన్నించి యనుగ్రహింప విద్యద్వర్యులను వేడుకొనుచున్నాను. పుస్తకమును చక్కగా ముద్రించి యొసగిన **V.K.N. Enterprises** యజమాని శ్రీయుత **V.K. Narayana** గారికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పుస్తకమును చదువుటతో నిలుపక మంత్ర జపమో స్తోత్ర పారాయణమో నిత్యానుష్ఠానముగ జేసికొని ధన్యజీవనులై ఈ నా కృషిని సఫలమొనర్పవలెనని పాఠకులను వేడుకొను చున్నాను.

సర్వేభవంతు సుఖినః, సర్వే సన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యంతు, మాకశ్చిద్దుఃఖ భాగ్భవేత్ ॥

మదరాసు — సుధీవిధేయుడు
16.6.1997 — **న. విజయరాఘవాచార్యులు**

# విషయసూచిక

# మృత్యుంజయోపాసన

## మృత్యుంజయ నామ విశిష్టత

సదాశివునకు మృత్యుంజయు డను పే రున్నది. జనన మరణములు అను బంధములో చిక్కినవానికి కదా మృత్యు భయము! సత్-చిత్-ఆనందస్వరూపుడగు భగవంతునకు మృత్యుభయ మెక్కడిది? మరియు 'మృత్యుర్యస్యోపసేచనమ్' అని కదా శ్రుతి? (మృత్యువు ఎవనికి ఊరగాయవంటిదో అని ఈ మాటకు అర్థము. అనగా ఊరగాయను నంజుకొని మనం ఆహారమును భుజించినట్లు మృత్యువును ముందుంచుకొని లోకవ్యవహారమున శరీరవియోగము కలిగించుచు కడపట భోజనాంతమున ఊరగాయను గూడ మ్రింగివేసినట్లు ప్రళయకాలములో పరమశివుడు, మృత్యువును గూడ మ్రింగివేయును) అట్లుండగా మృత్యువును జయించినవా డనుటలో ఏమి సారస్యం ఉన్నది? అన్న సందేహము కలుగవచ్చును. తనకు సంభవింపనున్న ,మృత్యువును జయించినవా డనికాదు దీని భావము. మరేమన భగవంతుడు సత్యసంకల్పుడు. సృష్టిని ప్రారంభమున ఒక క్రమమును ఏర్పచుకొని దాని ననుసరించి సాగించుచున్నాడు. జీవులు తమ పుణ్యాపాపకర్మలకు పొందదగిన ఫలితము లేవో నిర్ణయించబడి యున్నవి. జీవిరాసుల కర్మసంతతి మూడు విధములుగా నుండును. పలు జన్మములలో చేసిన కర్మలవల్ల అనుభవింప వలసిన ఫలితములు కలది 'సంచితము' అగును. వానిలో ప్రకృత జన్మమున అనుభవమునకు వచ్చినవి 'ప్రారబ్ధములు' అనగా ఫలము ఇచ్చుటకు మొదలైన వనబడును. రానున్న జన్మమున అనుభవింపతగ్గవి 'ఆగామి'. అనబడును ప్రారబ్ధము ముగిసినంతనే మన ప్రాణములు

కరుణామయుడగు భగవంతుడు తన్ను ఉపాసించువారికి ఈ జన్మముతోనే కర్మసంచయము ఆగామితోకూడ తీరిపోవుటకు వలసిన విధానము లన్నింటిని చేతనునిలోనే యుండి తానే పూర్తియగునట్లు చేసి ఇక మృత్యువశము గాకుండ, జన్మసంతతి లేకుండు నిత్యానందస్థితిని అనుగ్రహించును. తన సృష్టి సంకల్పమునకు విరోధము లేకుండనే ఆ జీవిని రక్షింప ప్రయత్నించును. అతని ఈ దివ్య సంకల్పమును గుర్తింపలేక ప్రాకృతమానవునిగా తన యాశ్రితుని తలచి అతని ప్రాణములు తీయుటకు వచ్చిన మృత్యువును' హుం' కారముతో నివారించును. ఇట్లు ఆశ్రితులు మృత్యువును జయించునట్లు చేయువాడు అని మృత్యుంజయుడను పదమునకు అర్థము గ్రహింపవలెను. ఏ పనికైనను దైవము, పురుష ప్రయత్న మను ఈ రెండును ఆవశ్యకములు. 'రక్షాపేక్షామపేక్షతే' అన్నట్లు భగవంతుడు కరుణామయు డైనను మననుండి 'రక్షించవలె న'ను ప్రార్థనను ఎదురు చూచును. త్రికరణశుద్ధితో అట్లు ప్రార్థించినవారిని ఆదుకొన సర్వ సన్నద్ధుడైయున్నాడు.

## ఉపాసనావశ్యకత

భగవంతునితో ''నన్ను రక్షింపుమని'' వేడుకొనుటకును ఒక క్రమము కలదు. ఆ క్రమ పద్ధతియే ఉపాసన. ఉపాసనలో ధ్యానము, మంత్రజపము, ఆరాధన అను మూడు విభాగములున్నవి. హృదయమును, చంచలములేక భగవంతునందే నిలుపుట ధ్యానము. భగవన్నామమును విడువక స్మరించుట మంత్రజపము. విధ్యుక్తముగా హోమము చేయుట ఆరాధన, షోడశోపచారములతో గావించు పూజయు ఆరాధనయే. ఇది హోమ ఫలితము నిచ్చును. ఈ మూడును మనస్సుతో, వాక్కుతో, శరీరముతో భగవంతు నుపాసించుట అగును.

భగవంతుడే మనలో నుండి కర్తవ్య నిర్వాహమును, కర్మ సంచయ విచ్ఛేదమును, గావించు నని ముందు పేర్కొనబడినది. కదా! అట్టి దైవశక్తిని శరీరమున నిలుపుకొనగలుగుటకు ఈ ఉపాసనా విధానము ఆవశ్యకమై యున్నది.

మన శరీరము ఆరోగ్యముతో నుండుటకు శక్తి కావలెను. శక్తి మన కంటికి అగపడని తత్త్వము. అయినను భౌతికమయిన శరీరమును శక్తి వంతము గావించుకొనుటకు భౌతికములైన స్థావరజన్య పదార్థములను అనగా ధాన్యము, కాయగూరలు, పండ్లు మున్నగువానిని ఉపయోగించుకొనుచున్నాము. నిజమునకు ఆహార పదార్థములలో గుప్తమైయున్న సూర్యశక్తియే శక్తినిచ్చునని విజ్ఞాన శాస్త్రము తెలుపు చున్నది. అయినను సూర్య శక్తిని ప్రత్యక్షముగా మనము ఆహారముగా గ్రహింపలేకున్నాముకదా! ఇక మన ఇంద్రియములకు శక్తినిచ్చునది ప్రాణము. ఈ ప్రాణ శక్తియు సూర్యుని నుండియే లభించుచున్నది. శరీరము శ్వాసక్రియ ద్వారా వాయు రూపమున దానిని గ్రహించుచున్నది. అయినను క్రమ పద్ధతిలో శ్వాస క్రియను ఉపయోగించుకొనుటకు యోగవిధానము ఆవశ్యకమై యున్నది. ఆయా అవయవములకు పుష్టి నిచ్చుటకు పలు రకముల విటమినులు ఆవశ్యకములైనట్లు పలువిధ ప్రాణాయామ విధానములచేత ఇంద్రియములకు శక్తిని సమకూర్చు కొనుచున్నాము. ఇంద్రియములకు నెలవైయున్న మనస్సునకు శక్తి కావలెను కదా! శక్తి మాత్రము చాలదు. సేకరించుకొన్న శక్తిని సరియైన, హితకరమైన మార్గమున వినియోగించుకొన్న కదా సుఖ సంతోషములు కలుగును. కనుక మనస్సును సరియైన మార్గములో ఉంచుకొని, శక్తివంతము గావించుకొనుటకు 'ధ్యానము' ఆవశ్యకమై యున్నది. శరీర మనోబలములతో బాటు కర్మ క్షయము సాధించి నిత్యానంద సుఖము అనుభవించుటకు, దైవబలమునువలెను. మనలో అంతర్గుప్తమై,

నిద్రాణమైనయున్న ఆత్మశక్తియగు పరాశక్తిని ఉద్దీప్తము గావించుకొన్నప్పుడు ఆ దైవశక్తి క్రియారూపమును దాల్చి మనకు సర్వసిద్ధులను అనుగ్రహించును. మృత్యుంజయుడు మనలను ఆదుకొను విధానము ఇదే.

భౌతిక శరీరమును ఆశ్రయించుయున్న ఈ 'పరాశక్తి' ఉద్దీప్తమగుటకు అనుసరించవలసిన విధానమే ఆరాధన, ఉపాసన.

ధ్యానము,. మంత్ర జపము, ఆరాధన అను ఈ మూడింటితో కూడిన ఉపాసనా మార్గముననే మనము దైవానుగ్రహము పొందుటకు మూర్తి స్వరూపము, మంత్రార్థము, ఆరాధనా క్రమము అనువానిని గురించి తెలిసికొనుట ఆవశ్యకము. కాన మొదట శివ తత్త్వము వివరింపబడుచున్నది.

శివ తత్వము ఒక్కటే కాని లోకసృష్టిలో సృజన, రక్షణ, సంహార క్రమము లావశ్యకము లగుటచే ఆ పరతత్త్వము పలు రూపముల ధరించుచున్నది. 'శివ మద్వైతం చతుర్థమ్'' ఏకో రుద్రో అవతస్థే' ఇత్యాది శ్రుతులు శివపరతత్త్వ రూపమును పేర్కొనుచున్నవి. పరతత్త్వము యొక్క శుద్ధ స్వరూపము వాక్కునకు, మనస్సునకు అందనిది. కాన మనము దానిని ప్రత్యక్షముగ ఉపాసించలేము. అందువల్ల పురుష రూపముననే ఆపరతత్త్వమును ఉపాసించగలము., నిర్గుణము, నిరాకారమునగు శక్తిని పొందుటకు ఉపయుక్త వివిధ ఫలాదులను మనము భుజించునట్లు, మనస్సుతో, వాక్కుతో ఉపాసించుటకు తగినట్లు పరతత్త్వము పురుష రూపము ధరించుచున్నది.

## శివతత్త్వము

ఆనందము, విజ్ఞానము మనస్సు, ప్రాణము, వాక్ అనునవి ఆ అవ్యయ పురుషుని ఐదు కళలగును. ఈ ఐదు కళలకు

అధిష్ఠానముగా శంకరునకు ఐదు మూర్తులున్నట్లు శ్రుతులు పేర్కొను చున్నవి. ఆయైదు రూపముల ధ్యాన ఉపాసనా మార్గములు. వేలు వేలు తంత్రశాస్త్రములలో ప్రసిద్ధములై యున్నవి.

ఆనందమయరూపము మృత్యుంజయుడను పేర ఉపాస్య దైవముగా వెలసి యున్న శివుడు. ''రసంహ్యేవాయం లబ్ధ్వానందీభవతి'' అని శ్రుతి. బలము అనుదానికి మరొక పేరు మృత్యువు. అది ఆనందమును తిరోధానపరచుచున్నది. మృత్యువు (బలము)ను హృదయమునుండి తొలగించుటచేత ఆనందము ప్రకటితమగును. అందువల్ల ఆనందము మృత్యుంజయమగును.

విజ్ఞానమయకళ గల మూర్తి దక్షిణామూర్తి. విజ్ఞానము బుద్ధికి మారుపేరు. దాని ధనము సూర్య మండలము. సూర్య మండలమే సమస్త ప్రాణులకును విజ్ఞానము నిచ్చును. (గాయత్రీ మంత్రముతో సవితృదేవతను ఉపాసించి ధీ శక్తిని పెంపొందించుకొను చున్నాము.) సూర్యమండలము సౌరజగత్తునకు మధ్యనున్నది వృత్తకేంద్రం అన్నిటికన్న ఉత్తర దిశలో ఉన్నది. అందువల్ల విజ్ఞానము ఉత్తర ముఖము నుండి దక్షిణమునకు వ్యాపించుచున్నది. అందువల్ల విజ్ఞాన మూర్తి దక్షిణామూర్తిగా ప్రశంసింబడుచున్నాడు. ఈ మూర్తి వర్ణమాతృకమీద ప్రతిష్ఠితుడై యున్నాడు. వర్ణమాతృక (అక్షరమాల)యే విజ్ఞానమునకు ఆధారము. మృత్యుంజయ దక్షిణామూర్తులు రెండు స్వరూపములును ప్రకాశ ప్రధానములగుట వలన శ్వేతమూర్తులుగా ప్రసిద్ధులు.

అవ్యయపురుషుని తృతీయ కళ యగు మనస్సును ప్రధానముగాగల మూర్తి కామేశ్వరుడు. మనస్సు కామ (కోరికలు)ము ప్రధానముగా కలది.

*కామస్తదగ్రే సమవర్తతాధి*
*మనసోరేతః ప్రథమః యదాసీత్*

సతో బన్ధు మసతి నిరవిన్దన్
హృది ప్రతీష్యా కవయోమనీషా -ఋగ్వేద

ఈ కారణమున ఈ మూర్తి కామేశ్వరుడయ్యెను. మనోధర్మమగు అనురాగము రక్త వర్ణము కలది. కాన కామేశ్వర మూర్తియు ఎఱ్ఱని చాయగలవాడు. ఐదు ప్రేతములతోనైన పర్యంకమున శక్తితో ఇతడు కూడి యున్నట్లు తాంత్రికోపాసనా విధానము పేర్కొను చున్నది.

నాలుగవది ప్రాణమను కళ. దీనిని ప్రధానముగాగల మూర్తి పశుపతి. నీలలోహిత వర్ణుడని తాంత్రికమతము వర్ణించుచున్నది. ఇతడు ఐదు ముఖములు కలవాడు. ప్రాణ రూపమైన పాశముతో కట్టుపడియున్న పశువుల (జీవుల) నియమించువాడితడు. వైదిక సాహిత్యము ప్రాణశక్తిని ఆగ్నేయ, సౌమ్య రూపముల రెండు విధములుగా ఉన్నట్లు వివరించుచున్నది. అగ్ని వర్ణము ఎరుపు. సౌమ్య (జల) వర్ణము నీలము లేదా నలుపు. కాన ఈ మూర్తి నీలలోహితుడయ్యెను. 'యదగ్నేరోహితమ్ రూపమ్ తేజసస్తద్రూపమ్' సోమమే అన్న మగుచున్నది. కాన పశుపతి నీలలోహితుడయ్యెను. ఈ రెండు వర్ణములు వేఱు వేఱు పాళ్ళలో కలిసి ఐదురంగులుకల ఐదు ముఖములు ఏర్పడినవి.

ముక్తా పీత పయోద మౌక్తిక జపా
వర్ణైర్ముఖైః పఞ్చభిస్-
త్ర్యక్షైరఞ్చిత మీశ మిన్దుముకుటం
పూర్ణేన్దుకోటి ప్రభమ్
శూలం టఙ్కకృపాణ వజ్ర దహనాన్
నాగేన్ద్ర ఘణ్టాఙ్కుశాన్
పాశం భీతిహరం దధానమమితా

కృష్ణవర్ణముగల సోమము మీద లోహిత వర్ణముగల అగ్ని ఆరూఢమైనప్పుడు ధూమిల రక్త వర్ణము ఏర్పడును. అగ్నిమీద సోమము ఆరూఢమైనప్పుడు పసుపువన్నె కానబడును. సోమాగ్నులకలయికలతో వాని వాని పాళ్ళు వేఱయినప్పుడు ముక్త వర్ణము, వంగపూవులరంగు, ఆకుపచ్చ ఏర్పడును. ఇట్టి వర్ణములతో కూడిన ఐదు ముఖములు కలవాడు పశుపతి.

ఈ ముఖములలో ముధ్యనున్నది అన్నింటికన్న మీదను, తక్కిన నాలుగు ముఖములు నాలుగు దిక్కుల కభిముఖములుగను ఉండును. ఉర్ధ్వముఖమునకు ఈశానమనియు, తూర్పు దిక్కును చూచుచున్న ముఖమునకు తత్పురుషమనియు, దక్షిణమును చూచుచున్న ముఖమునకు అఘోరమనియు ఉత్తర దిశను చూచుచున్న ముఖమునకు వామదేవ మనియు పశ్చిమ దిశను చూచుచున్న ముఖమునకు సద్యో జాతమనియు పేరులగును.

ఐదవ కళ వాఙ్మయము, దీనిని ప్రధానముగాగల మూర్తి భూతేశుడు. వాక్, అన్నము, భూతము ఇవి మూడును ఒకదానినే తెలుపును. కాన ఈ మూర్తి భూతేశుడయ్యెను. ఇట్లు అవ్యయ పురుషుడు శివుడు వివిధ రూపములతో ఉపాసింపబడు చున్నాడు.

## అక్షరరూపమున శివోపాసన.

ఒక పరతత్త్వము యొక్క మూడు మూర్తులే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. మనుష్య శరీరమున హృదయ కమలమున బ్రహ్మ, నాభిప్రదేశమున విష్ణువు, శిరోభాగమున మహేశ్వరుడు నెలకొని యున్నారు. హృదయ కమలమున తిలమాత్ర ప్రదేశమున జ్యోతి రూపమున వెలయు బ్రహ్మజ్యోతియే శరీరమంతటికి చైతన్యము నిచ్చుచున్నది. సంధ్యోపాసనమున ఈ విధముగనే మూడు దేవతలు

పొందినవి. ''మూలతో బ్రహ్మరూపాయ, మధ్యతో విష్ణురూపిణే, అగ్రతః శివరూపాయ అశ్వత్థాయనమోనమః'' ఇందలి అశ్వత్థనామము తక్కిన స్థావరములకును ఉపలక్షణము.

అన్ని వృక్షములకును జీవనము వేరునందే కలదు. మూలమందలి రసము మధ్య భాగమును చేరి అక్కడ వాని రక్షణకు వలసిన ఆహారముగ మారును. అందువలన రక్షక కార్య ప్రధాన స్వరూపము మధ్యమున నెలకొన్నది. ఈ రసముపై భాగమునుండి అనగా ఆకులద్వారా వెలువడుచుండును. ఈ శిరోభాగమున శివుడు నెలకొనియున్నాడు. ఇంద్ర, అగ్ని, సోమ, తత్త్వముల సమన్వయ మూర్తియే శివుడు. కాన అతనికి ఈ మూడును నేత్రములైనవి. 'వన్దే వహ్నిశశాఙ్క సూర్యనయనమ్'' అని ప్రార్థన. ఇది అధి దైవిక రూపమున నొప్పు ఉపాసన యగును.

## క్షరరూప శివోపాసన

క్షరపురుషుని ప్రాణకళ ఋషి, పితృ, దేవ స్వరూపములుగా పరిణమించును. అంతరిక్షములోని వాయువు రుద్రుడనబడును. ఈ రుద్రుడు శివుని అవతారమే. అగ్ని రెండు విధములు. అగ్ని ప్రధానమైనది, సోమ ప్రధానమైనది అని. అగ్ని ప్రధానమైన వాయువు 'భువః' అనగా మన అంతరిక్షములో ఉన్నది. సోమ ప్రధానమైన వాయువు సూర్యమండలము దాటి దానిమీద పరమేష్ఠి మండలములోని జనోలోకము, తపోలోకములలో ఉన్నది. అంతరిక్షములోని వాయువు అగ్ని సంబంధము కలదే కావున రోగములు కలిగింపగలది. అది రౌద్రవాయువు అనబడును. పరమేష్ఠి మండములోని సోమ ప్రధానమైన వాయువు పూర్ణ శాంతిని కలిగించును. అందువలననిది ''సాంబ సదాశివ'' అనబడును. అందువలననే ఐతరేయ బ్రాహ్మణమున అగ్నియే రుద్రుడనబడెను. ''అగ్నిర్వారుద్రః, తస్యద్వే తనువౌ,

ఘోరాత్మాచ శివాత్మాచ'' ఈ అగ్నియును వాయువును భూమండలమున ఉన్నవికావు. ప్రాణ రూపములు. ఇవి ఒకదాని కొకటి జన్య జనకములు. అందువలన బ్రాహ్మణములందు ఒకచో అగ్ని వాయు జనకముగా పేర్కొనబడినది. మరొక్కచోట వాయువునకు అగ్ని ఉత్పాదకమని పేర్కొనబడి యున్నది. ఈ రెండు ప్రాణములు కలిసియే భౌతికమైన అగ్నికి కారణమగును. అందువలన రుద్రుడు 'కృశానురేతా' (అగ్నిని రేతస్సుగా కలవాడు) అని పేర్కొనబడెను. ఈ రుద్ర ప్రాణము మన మూడు లోకములందును వ్యాపించి యున్నది. శుభాశుభ ఫలములకు కారణమైనది. అందువలన రుద్రుడు ఘోర రూపము, శివరూపము కలవాడని శ్రుతులు వర్ణించుచున్నవి. సూర్య మండలమునకు పైనున్న జనోలోక, తపోలోకములలోని వాయువు ఎల్లప్పుడు శుభఫలమునే ఇచ్చుటవలన సదాశివుడనబడును. ఇది సోమ ప్రధాన రూపము. సోమము యొక్క స్థూల రూపము జలము. వైదిక భాషలో జలము 'అంబా' అనబడును. అందువలన అంబతో కూడిన వాయువు 'సాంబ' అనబడును. ఘోర రూపము గల శివుని గురించి స్తోత్రము చేయుచు వేదములు

''మానస్తోకే తనయే మాన ఆయుః మానోగోషు
మానో అశ్వేషు రిరీషః । మానోవీరాణ్ రుద్ర మామినో
వధీర్ హవిష్మన్తః సదూ మిత్వా హహామహే''

ఓ రుద్ర! మా మీద మా కుటుంబము మీద బాణము విడువకు. మమ్ము రక్షించు. ధనుస్సును దింపుము. ముంజవార్ పర్వతమును దాటి చరింపుము'' అని మున్నగు విధముల ప్రార్థించినవి.

రుద్రుడు పదునొకండుగురని ప్రసిద్ధి. ఒక రుద్రునకే ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక ఆధియజ్ఞ భేదముల వలన పదునొకండు రూపములు పేర్కొనబడినవి.

బృహదారణ్య కోపనిషత్తులో "దశేమే పురుషే ప్రాణాః, ఆత్మై కాదశః" పురుషుని పది ప్రాణములు, ఆత్మ కలిసి ఆధ్యాత్మిక రుద్రులు పదునొకండుగురు పేర్కొనబడిరి. శ్రుతులందు "సప్త శీర్షణ్యా ప్రాణాః, ద్వావ వాఞ్చా, నాభి ర్దశమీ "తలలోనున్న ఏడు ప్రాణములు రెండుకన్నులు, రెండు నాసారంధ్రములు, రెండు చెవులు, ఒక నోరు, వీనితో రెండు మల మూత్ర విసర్జక ద్వారములు ప్రాణము, వెరసిపది ప్రాణములు, నాభిలోనున్న రుద్ర శక్తులు ప్రాణ రూపమున ఆయా శరీర భాగములలో నుండి కార్యకరణ సామర్థ్యము నిచ్చు చున్నవి. పదునొకండవది ఆత్మ, (ప్రాణాత్మ) ఈ పదింటికి నాయకమైన ముఖ్య ప్రాణమగును. ఆధి భౌతిక రుద్రులు పృథివీ, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, యజమానుడు (విద్యుత్తు) పవమానుడు, పావకుడు, శుచి అని ప్రసిద్ధ రుద్రులు. వీటిలో మొదటి ఎనిమిది మూర్తులు అష్ట మూర్తులని ప్రసిద్ధి. తర్వాతి మూడు పవమాన - పావక- శుచి అనునవి, ఘోర రూపములు. ఇవి ఉపద్రవమును గలిగించే రుద్ర (వాయు) రూపములు. వినిలో శుచి సూర్యునందును, పవమానుడు అంతరిక్షమునను, పావకుడు పృథ్విలోను వ్యవహరించును. ఆధిదైవిక ఏకాదశ రుద్రులు నక్షత్రమండలమున వేలయుదురు. (1) అజైక పాత్ (2) అహిర్బుధ్న్య (3) విరూపాక్ష (4) త్వష్టా (అయోనిజ, గర్భ) 5) రైవత (భైరవి, కపర్ది, వీరభద్ర) (6) హర (నకుపీశ, పింగళ, స్థాణు) (7) బహురూప (సేనాని, గిరీశ) (8) త్ర్యంబక (భువనేశ్వర, విశ్వేశ్వర, సురేశ్వరు (9) సావిత్ర (భూతేశ, కృపాలీ) (10) జయన్త (వృషాక, విశముఖ, సంధ్య) (11) పినాకి (మృగ వ్యాధ, లుబ్దక, శర్వ) అను పేర్లతో ప్రసిద్ధులు. పురాణములలో అక్కడక్కడ వీరిని గురించిన విపుల వర్ణన లున్నవి.

వీనిలో రుద్ర ప్రాణము వ్యాప్తమై రశ్మి (కిరణ) రూపమున భూమికి వచ్చిచేరును. అందువలన 'రుద్ర' అనబడును. వీనిలోను 'ఘోర శివ, భేదము లున్నవి వీనివలన మంచి చెడు ఫలితములు కలుగుట శాస్త్రములలో పేర్కొనబడి ఉన్నది. సూర్యుడు ఆశ్లేషలో సంచరించునపుడు వర్షము కురిసినచో అది రోగములను కలుగ జేయును. మఘలో సంచరించునపుడు కురిసిన వర్షము రోగనాశక మగును.

రోమునగర ప్రాచీన శిల్పములలో నక్షత్ర రూపములు సర్పధారిగా, కపాలధారిగా, శూలధారిగా చిత్రింపబడియుండుట గానవచ్చును. ఆయా నక్షత్ర రూపములను చక్కగా గమనించి చూచిన వారికి రూప రేఖలు అట్లు కాన వచ్చుట గుర్తింపనగును. పురాణ సంబంధమైన కథలకు ఈతారా మండలమునకు దగ్గరి సంబంధము కలదు. నిదర్శనమునకు 'రుద్రుడు బ్రహ్మశిరమును ఖండించెను'' అను కథ 'లుబ్ధ కబన్ధు' అను నక్షత్రమునకు సంబంధించినది. బ్రాహ్మణములలో ఈ కథకు నక్షత్ర రూప వ్యాఖ్యానము ఒసగబడినది. దక్ష యజ్ఞమును ఇట్టిదే. దక్షుని తలనుగోసి దానికి బదులు మేకతలను సంబంధించినట్లు పురాణ కథ, పూర్వకాలమున కృత్తిక నుండి నక్షత్రములు పరగణింపబడెడివి. అయితే తర్వాతి కాలమున అవి అశ్విని (మేక) నుండి పరిగణింపబడుట నిది సూచించు చున్నది. ఇట్లు పలు కథలు ఆధిదైవిక తత్త్వమునకు చెందినవై యున్నవి.

యజ్ఞమునందు పదునొకండు అగ్నులు కలవు. మొదట గార్హపత్య, ఆహవనీయ, ధిష్ణ్య అని మూడు పేర్కొనబడినవి. వీనిలో గార్హపత్యము రెండు విధములు, ఇష్టిలోని గార్హపత్యము సోమ యాగమున పురాణగార్హపత్య మయ్యెను. ఇష్టిలో ఆహనీయము సోమ యాగము నూతన గార్హపత్యమగును. ధిష్ణ్యాగ్నిలో ఎనిమిది

భేదములున్నవి. వానికి శ్రుతిలో అగ్నిధ్రీయ, అచ్ఛావాకీయ, నేష్ట్రీయ, పోష్టత్రీయ, బ్రాహ్మణాచ్ఛసీయ, హోత్రీయ ప్రశస్త్రీయ, బార్జాలీయములనే పేర్లు పేర్కొనబడియున్నవి. ఆహవనీయమున ఒక్క భేదమే కలదు. ఈ పదకొండును అంతరిక్షములోని అగ్నికి అనుకృతులు. ఇవి శివరూపమున యజ్ఞమున గ్రహింపబడినవి. ఘోర రూపమునకు యజ్ఞమున ప్రయోజనము లేదు.

విశ్వచర శివమూర్తి విశ్వములను సృష్టించు అవ్యయ, అక్షర, క్షర రూప శివస్వరూపముల ఉపాసనా విధానము వివరింపబడినది. విశ్వము శివుని రూపమే. శివుడు తన శరీరముగా విశ్వముల సృజించి అందులోని అణువణువునను తాను ప్రవేశించి విశ్వవ్యాపారమును నడపును. అట్లు ప్రవేశించు రూపమే 'విశ్వచ' రూపము. ఈ విధముగా సమస్తమును నియమించు అనగా సకలలో కవ్యహారములను నడపువాడు ''ఈశ్వరుడ''న బడును. సమష్టి బ్రహ్మాండమున వ్యాపించినట్లే వ్యష్టి బ్రహ్మాండమునను వ్యాపించి యున్నాడు. బ్రహ్మాండము వెలుపలను వ్యాపించి యుండుట వలన సమస్త ప్రపంచములను తన కడుపున కలవాడని ప్రశంసింప బడుచున్నాడు.

*ఏకోదేవస్సర్వభూతేషుగూఢ:*
*సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా ।*
*కర్మాధ్యక్ష: సర్వభూతాధివాసః*
*సాక్షీ చేతా కేవలోనిర్గుణశ్చ ॥*

*యస్మాత్ వరం, నావరమస్తి కిఞ్చిత్*
*యస్మాన్నాణీయో నజ్యాయోస్తికశ్చిత్*
*వృక్ష ఇవస్తబ్ధో దివితిష్ఠ త్యేక*
*స్తేనేదం పూర్ణంపురుషేణ సర్వమ్ ॥*

యో యోనింయోనిమధితిష్ఠత్యేకో
యస్మిన్నిదం సంచవిచైతి సర్వమ్
తమీశానం వరదందేవమీడ్యం
నిచాయ్యేమాం శాన్తిమత్యన్తమేతి ॥

సర్వానన శిరోగ్రీవః సర్వభూతగుహాశయః
సర్వవ్యాపీసభగవాంస్తస్మాత్ సర్వగతః శివః ॥

శ్వేతాశ్వతర

మున్నగు ప్రమాణములు నిరూపించుచున్నవి.

ఈ వర్ణనలో శివ, ఈశాన రుద్రాదినామములు పేర్కొన బడుటగమనార్హము, ఈ విశ్వమంతయు శివశరీరము

అగ్నిర్మూర్ధా చక్షుషీచన్ద్రసూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చవేదాః ।
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీ హ్యేవ సర్వభూతాన్తరాత్మా

(ముండకోపనిషత్తు)

అగ్ని ఎవనికి మస్తకమో, చంద్ర సూర్యులు కన్నులో, దిక్కులు చెవులో, వేదము వాక్కో, విశ్వ వ్యాపియైన వాయువు ప్రాణరూప హృదయమో పృథ్వి పాదమో అట్టివాడు సర్వభూతములకు అంతరాత్మయై యున్నాడు.

ఈ విధముగా సంక్షిప్తముగా భగవత్స్వరూపము పేర్కొనబడి యున్నది. ఈ వర్ణన ననుసరించి ధ్యానమునకు శివమూర్తి

అగ్నివ్యాప్తి ఇరవైయొక్క స్తోమ (సూర్య) మండలములవరకు వ్యాపించి యున్నది. ఆ అగ్నిలో అతర్గత సూర్యచంద్రులు కన్నులుగా పేర్కొనబడిరి. పృథ్వి నుండి స్వయంభూ మండలము వరకు ఈశ్వర వ్యాప్తి కలదు. ఈ రెండు నేత్రములకును కొంచెము మీదుగా లలాటమున అగ్ని మూడవ నేత్రమైయున్నది. ''వన్దే సూర్యశశాఙ్క వహ్నినయనమ్' లలాటము వఱకు అగ్ని వ్యాపించి యున్నది. దానిపై భాగమున సోమమండలము కలదు. సోమమునకును అప్- వాయు - సోమములను మూడు అవస్థలు ఉన్నవి. వీనిలో సోమము చంద్ర రూపమున, అప్ గంగా రూపమున వాయు ప్రజా వాయువు జటామండల రూపమున శంకరుని శిరముపై వెలసి యున్నవి. సూర్య మండలము మీద పరమేష్ఠి మండలమున సోమము మండల రూపముగా గాక రేఖామాత్రముగ నుండును. పూర్ణ రూపమున ఉండదు. భాగములుగా విభక్తమై యుండును. మండల రూపమున పృథ్వికి చెందిన చంద్రుడు నేత్ర రూపమున ఉన్నాడు. పరమేష్ఠి మండలమందలి 'అప్' గంగా రూపమున పరిణమించును. (వీని వివరణము నాచే రచింపబడిన వేద విజ్ఞానమను గ్రంథమున చూడనగును). గంగ బటా మండలమున అనగా వాయుమండలమున వ్యాపించి యున్నది. శివునకు వ్యోమకేశుడని పేరున్నది. అనగా ఆకాశమే అతని జటా మండలము ఆకాశము వాయు వ్యాప్తమై వెలయును.

యథాకాశ స్థితోనిత్యం వాయుః సర్వత్రగోమహాన్ భూమికి ఎక్కువ సంబంధము వాయువుతో కలదు. సోమ మండలములో నేరుగా సంబంధము లేదు. (సూర్య) చంద్రుల వలన ఏర్పడును. అందువలన మన బ్రహ్మాండము సూర్యుని వరకే వ్యాప్తము. అందువలన ఈ విషయము శివుని శిరోవర్ణనము వలన సూచితము. అనగా శరీరము తలవరకే గదా కలదు. కేశము శరీరమునకు భాగముగాకాక శరీర భాగము అవస్థాంతరితమై కేశమగుచున్నది. (శరీర భాగమైనచో కేశఖండనమున శరీరము నష్టమగును. కేశములు పూర్తిగా తీసివేసినను

శరీరమునకు హాని కలుగకుండుట గమనింపదగును). అగ్నియే అవస్థాంతరము పొంది సోమ రూపమున పరిణమించు చున్నది. పద్మ పురాణమున భూమి పద్మ రూపమున నిరూపింపబడినది. శంకరుడును పద్మము మీద నధిష్ఠించి ధ్యాననిమగ్నుడైనట్లు వర్ణన కలదు. ''పద్మాసీనం సమన్తాత్ స్తుతమమరగణైః'' అందువలన పాదరూపమున భూమి ధ్యానింపబడును. ఈ బ్రహ్మాండ రూప శివశరీరము విషము, అమృతము గూడనగును. అయితే విషము ఈశ్వర శరీరము లోపల ఉన్నది. విషమును అతడు అంతర్లీనముగా నుంచుకొని అమృతమును వ్యాపింప జేయు చున్నాడు. విశ్వమంతయు భగవంతుని శరీరమైనవుకు విరుద్ధాంశములు మంచి చెడ్డలు రెండును అతనిలోనే యుండును.

*విభూషణోద్భాసి భుజఙ్గభోగివా*
*గజాజినాలమ్బి దుకూలధారివా ।*
*కపాలివా స్యాదథవేన్దు శేఖరం*
*నవిశ్వమూర్తేః రవధార్యతేవపుః ॥* కుమారసంభవమ్

పరమేశ్వరుడు సర్వాభరణ భూషితుడు, సర్పధారి కూడ. గజ చర్మమును కప్పుకొనును. అందముగు పట్టు వస్త్రములు ధరించును. కరతలమున కపాలమును ధరించును. శిరమున చంద్ర రేఖను గూడ, విశ్వమూర్తి యగుటవలన ఒక రూపమని నిశ్చయము లేదు.

పరమశివుని హస్తములలో పరశువు, మృగము, అభయముద్ర కలవు.

పరశు మృగధరాభీతి హస్తమ్ ప్రసన్నమ్ - ధ్యానమున పరమేశ్వరుని కార్యములు హస్తములుగా ధ్యానింపబడును. ఈ గుర్తుల ద్వారా అతని కృత్యములు నిరూపింపబడుచున్నవి. పరశు లేదా త్రిశూలము దుష్ట శిక్షణము పవమాన రుద్ర రూపములతో పరులకు

ఉపద్రవము కలిగించు చర్య సూచింపబడును. కాలము గడచినవారి ప్రాణముల దీయుట దీనివలన సూచింపబడును. మరొక చేతిలో మృగము ఉన్నది. శతపథ బ్రాహ్మణమునయజ్ఞ స్వరూపము కృష్ణ మృగముగా పేర్కొనబడినది. తైత్తిరీయమున నొక కథకలదు. ఒకప్పుడు అగ్ని వనస్పతులలో దాగుకొనెను. దేవతలు, ఆ అగ్నిని వెదకిరి. వెదకబడుటవలన (మృగ్యత్వాత్, 'మృగః'), అగ్ని మృగమయ్యెను. ఈ అగ్ని వేదరక్షకుడు. వేదరక్ష యజ్ఞ రక్ష ఈశ్వరకృత్యమనుట దీనివలన సూచింపబడినది. వరముద్రవలన ఆశ్రితుల కోరికలు తీర్చుట సూచితమగును. అగ్ని - వాయు ఇంద్ర రూపములతో ఈశ్వరుడే లోకముల రక్షించు చున్నాడు. యమ - నిర్‌ృతి - వరుణ - రుద్రులు ఈ లోకమునకు అరిష్టము కలిగించువారు. వీరిలో రుద్రుడు సమయము వచ్చినపుడు చంపును. ఇతర సమయములలో రక్షింపను జేయును. అతడు వ్యాఘ్ర చర్మము ధరించును. ఆసనముగను ఉపయోగించును. గజ చర్మమును కప్పుకొనును. వీనివలన ఉపద్రవము కలిగించుటయు, సంపదలు అనుగ్రహించుటయు సూచింపబడుచున్నవి. గళమున ముండమాల, సమస్త పదార్థమును తనలో అంతర్గతమై యుండుటను ఇది తెలుపుచున్నది.

మయిసర్వమిదం ప్రోతం సూత్రేమణి గణాఇవ దారములో గ్రుచ్చబడిన మణులవలె సమస్తము నాయందే యున్నవి' ఈశ్వర సంబంధము నుండి వేరుపడిన సర్వము అచేతనము లగును. అనే భావముముండములవలన సూచితమగును.

## సర్పభూషణము.

శివుడు సర్ప భూషణుడని ప్రసిద్ధి. శుభ అశుభములన్నియు అతనిలో ఉన్నవమనుటను ఇది సూచించుననుట స్థూల అభిప్రాయము. సంహారమూర్తి అగుటవలన తన కార్యమునకు ఉపకరించు వస్తువులను దగ్గర ఉంచు కొనుట యుక్తమగునను

అభిప్రాయమును కలదు. ఈ కార్యమున సర్పమును మించిన తమోగుణ జీవి లేదు. తన గ్రుడ్లను తానే మ్రింగివేయు గుణముగ్రలది సర్పము. రాజనాగము మరొక సర్పమునే ఆహారముగ మ్రింగివేయుచున్నది. శివునకునకల జీవరాసులు సంతాన ప్రాయుములే కదా! గూఢమైన అర్థము ఈ విషయమున వేఱొకటి కలదు. కుజుడు బృహస్పతి మున్నగు గ్రహము లన్నియు సూర్యునిచుట్టు తిరుగును. అట్లు తిరుగుటలో ఒకసారి ఏర్పడిన వలయాకార మార్గమున గాక ఇంచుక తలగి రెండవసారి తిరుగును. ఇట్లు ఒక్కొక్కసారి తిరుగునపుడు వేఱు వేఱువలయములు ఏర్పడును. కొన్ని చుట్టులైన తరువాత మరల మొదటి మార్గముననుసరించి తిరుగుటయు సంభవ మగును. ఇట్లు వేఱు వేఱు గ్రహములకు వేఱు వేఱు మార్గములు (వయములు) ఏర్పడును. ఈ వలయములు సర్పకుండలాకారమున నుండుటవలన ఇది సర్పములుగా ఉపమింపబడినవి. సూర్యుడు ఈ గ్రహములకు మధ్య నుండును. ఎనిమిది గ్రహవలయములు ఎనిమిది సర్పము లగును. అనేక నక్షత్రములును భ్రమించు చున్నవి. అవిలఘు సర్పములు. ఇవన్నియు ఈశ్వర శరీరమగు బ్రహ్మాండముననే కలవు. తారామండలమున అనేక రుద్రులు, అనేక గ్రహవలయములు కలవు.

శివుడు శ్వేతవర్ణుడు.

'రత్నాకల్పోజ్జ్వలాఙ్గమ్' అని శివుడు అభివర్ణింపబడెను. జ్ఞానరూపుడు శివుడు. జ్ఞానము ప్రకాశవంతము. కనుక మణివలె ప్రకాశించు శరీరము కలవాడని అభివర్ణింపబడెను. శ్వేతవర్ణము స్వాభావికము. వస్త్రమునకో, వేరొకదానికో ఎరుపు, పసుపు, మున్నగు రంగులు రూపొందించవలెనన్న ఆయారంగులిచ్చు ద్రవములో అద్దవలెను. తెలుపు అట్లు కాదు. వస్త్రములోని మలినమును తొలగించిన చాలును. తెల్లబడును. సూర్య కిరణములు తెల్లగా ప్రకాశించును. దానిని విశ్లేషణమొనర్చిన ఏడు రంగులు అందు కలిసి యుండుట తెలియవచ్చును. కాన అన్ని రంగుల సముదాయము తెలుపు. లోకములోని సమస్తమును తన శరీరముగా

కలవాడు. గనుక అన్ని రంగుల సమ్మేళనము కలవాడగును. కాన అపుడు రవి కిరణములవలె ప్రకాశించువాడయ్యెను. (నిజమునకు సూర్యుడే శివుడనుట గుర్తింపతగినది.)

ఏడు లోకములలో స్వయమంభూ మండలము నుండి భూమండలము వరకు ఐదు మండలములున్నవి. వానిలో సూర్యమండలములో అన్ని రంగులు ఉన్నవి. తరువాత పరమేష్ఠి మండలము నలుపు. దాని తర్వాతనున్న స్వయమంభూ మండలము తెల్లనిరంగు కలది. ఆగ్నేయమండల మగుట వలన శివమండలమనియు రుద్ర మండలమనియు పేర్కొనబడును.

## విభూతిలిప్తాంగుడు

పరమశివుడు తన శరీరమంతటా విభూతిని పూసికొనును. ఐదు మండలములలోని ప్రాణము పార్థివ పదార్థముతో కూడినది. వానినుండి సౌర జగత్తులో సూర్యప్రాణము గుప్తమై యుండును. ముందున్న అమృత మండలములోని ప్రాణము కప్పబడి ఉండును. ఈ భావమే శ్వేత విభూతిగా పేర్కొనబడినది. ప్రతి పదార్థాన్ని కడవరకు మండించిన కడపట మిగులోనది భస్మమే. అది పరమేష్ఠి మండలాంశము, దానివలన సమస్త విశ్వము ఉత్పత్తియగును. ఈ భావము విభూతివలన శివుడు లోకములను ఉత్పత్తి చేసెనని వర్ణించెను. ఇట్లు పరమ శివుని గురించి అనేక ధ్యాన పద్ధతులు, వానిలో ఎన్నో రహస్యార్థాలు ఇమిడి ఉన్నవి.

## శివుడు, శక్తి.

అగ్ని స్వర్లోకము అనగా సూర్య మండలము వఱకు వ్యాపించి యున్నది. దానికావల సోమమండలము ఉన్నది. అగ్ని ఊర్ధ్వగతి కలది. సోమము అధోమార్గమును. అనగా అది క్రిందివైపుగ వ్యాపించును. అగ్ని తనయెల్లను గడచి పైకి పోవునపుడు సోమ రూపము పొందును. అపుడు మరల పైనుండి క్రిందికి వచ్చును.

అగ్ని శివుడని, సోమము శక్తి యనివ్యవహరింపబడును. ''ఉమయా సహితః సోమః'' శక్తియే ఉమ. శక్తితో కూడిన వాడు సోముడు. బృహజ్జా బాలకోప నిషత్తులో

అగ్నీ షోమాత్మకం విశ్వ మిత్యగ్నిరాచక్షతే ।
రౌద్రీఘోరాయా తేజసీతనూ ।
సోమశక్త్య మృతమయః శక్తికరీతనుః
అమృతం యత్ప్రతిష్ఠా తేజోవిద్యాకలస్వయమ్ ।
స్థూల సూక్ష్మేషు భూతేషు స ఏవ రస తేజసీ ।
ద్వివిధా తేజసోవృత్తిః సూర్యాత్మాచానలాత్మికా ।
వైద్యుదాదిమయంతేజో మధురాదిమయోరసః ।
తేజోరసవిభేదస్తు వృత్తమేతచ్చరాచరమ్ ।
అగ్నేరమృతనిష్పత్తి రమృతేనాగ్ని రేదతే,
అతఏవహివిః క్లుప్త మగ్నీషోమాత్మకంజగత్ ।
ఉర్ధ్వశక్తిమయంసోమ అధోశక్తిమయోనలః ।
తాభ్యాంసముటితస్తస్మాచ్ఛివాద్వైతమిదం జగత్ ।
అగ్నేరూర్ధ్వం భవత్యేగా యావత్సౌమ్యం వరామృతమ్ ।
యావదగ్న్యాత్మకం సౌద్యమమృతం విసృజత్యధః ।
అతఏవహికాలాగ్ని రధస్తాచ్ఛక్తి రూర్ధ్వగా ।
యావదావశ్చోర్ధ్వ రధస్తా త్పవనం భవేత్ ।
ఆధారశక్త్యావధృతః కాలాగ్ని రథ మూర్ధ్వగః ।
తథైవ నిమ్నగస్సోమః శివశక్తి మదామ్పదః ।
శిశశ్చోర్ధ్వమయః శక్తి రూర్ధ్వశక్తిమయః శివః ।
తదిత్థం శివ శక్తిభ్యాం నావ్యాప్త విహకిఞ్చన ॥

దీనితాత్పర్యము :- ఈ సమస్త జగత్తునకు ఆత్మ అగ్నియు, సోమమును, ఈ రెండును సోమమనియు వ్యవహరింపబడుటకలదు. ఘోర తేజము (అగ్ని) రుద్ర శరీరము. అమృతమయమైన శక్తిని ఇచ్చునది సోమము, శక్తిరూపము. అమృతమయమైన సోమమే

్లటిని నిలువును. విద్యయు కలము మొదట తేజోవ్యాప్తము. అసూక్ష్మరూపములతో ఉన్న అన్ని భూతములలోను సూపసోమము, తేజోరూపమైన అగ్ని వ్యాపించి యున్నవి. స్సు సూర్య' అగ్ని రూపాలతో రెండు విధములుగా ఉండును. ముము రసము (అప్) వాయువని రెండు రూపాలలో ఉండును. స్సులో విద్యుత్తు మున్నగు విభేదాలు రసములో మధురాది ాలు ఉండును. తేజస్సు, రసము అను ఈ రెండింటివల్లనే వర రూపమైన జగత్తు వ్యాప్తమై ఉన్నది. అగ్ని నుండియే ుతము పుట్టును. సోమమువల్ల అగ్ని వృద్ధి పొందును. అందువల్లనే - సోమము అను ఈ రెండింటి హవిర్యజ్ఞమువల్ల లోకములో యు ఏర్పడును. అగ్ని ఊర్ధ్వముఖముగా వెళ్ళి సోమముగా ును. సోమము క్రింది వైపుగా వ్యాపించి అనగా క్రిందుగా చ్చి అగ్ని రూపము పొందును. ఈ రెండింటి కలయికవల్లనే ు నిలిచి యున్నది. ఎంతవఱకు సోమ రూపముగా పరిణామము ునో అంతవఱకు తేజస్సు 'అగ్ని' ఉర్ధ్వముఖముగా ుండును. ' సోమము అగ్ని రూపము పొందనంతవఱకు ముఖముగా వచ్చుచుండును. అందువలన కాలాగ్ని ురుద్రుడు క్రింద, శక్తి అతనిమీద ప్రకాశించుచు ఉండును. ము ఆహుతి అయిన తర్వాత అగ్నిమీదగా సోమరూపమైన ము క్రిందుగా ఉండును. పైకి పోవుచు ఉన్న అగ్నికి ఆధార సోమమే. ఈ ఘృతము అనగా సోమము లేక దానికి జీవనము క్రిందుగా వ్యాపించుచున్న సోమము శివశక్తి అనబడును. ు ఆధారముగా లేకున్న శక్తిలేదు. ఈ రెండును ఒకదానిమీద కటి ఆధారపడి ఉండును. శివుడు-శక్తి వ్యాపించని వస్తువు ్లోకములో ఏదియు లేదు. శివశక్తులకు అభేదము, సోమము ము, అగ్ని భోక్త. అందువల్ల సోమము స్త్రీగా, అగ్ని

పురుషుడుగా పేర్కొబడినది. లోకక్రమములో సోమము మీద ఉండును. అందువలన శివుని వక్షస్థలముమీద శక్తినిలబడి ఉన్నట్లు ఉపాసన చేయబడుచున్నది. శివుడు జ్ఞానము అనగా రసస్వరూపమైతే శక్తి క్రియ లేదా బీజస్వరూపిణి, క్రియ, బలం అనే విజ్ఞానము లేదా రసము మీద ఆధారపడి ఉండును. అందువల్ల భగవతి శివుని వక్షస్థలము మీద నిలువబడి ఉండునన్న భావన ఏర్పడినది. క్రియలేకున్న జ్ఞానమునకు స్ఫూర్తి లేదు. అది శవమువలె ఉండును. అందువలన క్రియలేనిచోట శివము, శవముగా భావింపబడును. విశ్వరూప శివునిమీద చిత్కళారూప జ్ఞానశక్తి నిలిచి ఉన్నది. ఆ శక్తి లేక విశ్వరూపము నిశ్చేష్టమగును.

## వైదిక వాఙ్మయములో రుద్రప్రశస్తి

వేదములలో మొదటిదిగా గణింపబడు ఋగ్వేదములో సదాశివుడు రుద్రుడను పేర వలుచోట్లలో పేర్కొనబడెను. ఈ పేరు ఏర్పడుటకుకారణములు పలురీతుల పలుగ్రంథములలో పేర్కొవబడియున్నది.

శతపథబ్రాహ్మణమున (6-1-3-8 మరియు 11-6-3-7-లో) క్రిందివిధమున గలదు ''కుమారః అజాయత, స అరోదీత్, తస్మాద్ రుద్రః''

ప్రజాపతి ఒక కుమారునిసృష్టించేను. పుట్టగానే అతడు ఏడువసాగెను. అందువలన (రుదిర్ - అశ్రు విమోచనే - అనుధాతువుననుసరించి) రుద్రుడు (పడ్చువాడు) అనిపేరయ్యోను

తైత్తిరీయసంహితలో క్రందివిధమున పేర్కొనబడినది

ఒకప్పుడు దేవతలకు అసురులతో యుద్ధము సంభవించెను. ఆసమయమున దేవతలు తమ ధనమును అగ్నివద్ద దాచియూచిరి.

యుద్ధానంతరము దేవతలు అగ్నివద్దనుంచి తమధనమును బలవంతముగా లాగు కొనబూనిరి. అందువలన అగ్ని ఏడువసాగేను అందువలన అగ్నికి రుద్రుడనిపేరయ్యేను.

శతపథబ్రాహ్మణములోనే మరోకచోట (రుద్ ధాతువునకు ణీ జర్థము గ్రహించి) ఏడ్పించువాడు రుద్రుడు అను వ్యుత్పత్తి పేర్కొనబడేను దశప్రాణములు ఆత్మకలిసి ఏకాదశరుద్రు లనబడు. ప్రాణవియోగసమయమున ఇవి శరీరమును వీడిపోవుటవలన బంధుమిత్రాదుల నడ్పించును. అందువలన రుద్రుడనుపేరు ఏర్పడేను.

'' పాపాత్ముంను ఏడ్పించువాడుగనుక పరమాత్ముడు రుద్రుడనబడును'' అని ఆధునికవ్యాఖ్యతలు దయానంద సరస్వతి మున్నునువారు అభిప్రాయపడిరి.

శతపథబ్రాహ్మణమున (9-1-1-6) మరోకచోట వేరోకవింత కథ పేర్కొనబడియున్నది ఒకప్పుడు సృష్టికార్యక్రమమున అలసిపోయిన ప్రజాపతిని దేవతలు ఒంటరిగానదలిపెట్టిపోయిరి. మన్యు (క్రోధ) ధేవత మాత్రము వదలిపోలేదు. అప్పుడు ప్రజాపతి దుఃఖింపగానతని కన్నులనుండి కన్నీటిబిందువులు రాలెను. ఆ బిందువులనుండి 'రుద్రులు' ఉద్భవించిరి మంటి మీద పడిన కన్నీటిచుక్కల నుండి శతముఖ, సహస్రాక్ష, శతతూణీరధారి రుద్రుడు ఉద్భవించేను.

మహా భారతమున ఆనుశాసనిక పర్వమున దక్షప్రజాపతి నదాశివుని స్తుతించుచు ''రు అనగా దుఃఖము కష్టము. దానిని తొలగించువాడు రుద్రుడు అనగా నుతించువారి దుఃఖములతొలగించువాడవుగాన రుద్రుడవు'' అని పేర్కొన్నట్లు కలదు.

వైదికవాఙ్మయమును పరిశీలించిన 'గ్రాస్‌మర్' అను

జర్మనీదేశీయుడు 'రుద్' ధాతువునకు 'ప్రకాశించు' అను అర్థమును గ్రహించి మిక్కిలి తేజస్సుతో ప్రకిశించువాడు రుద్రుడు అను అర్థమును సమర్థించెను. 'పరేల్' అను మరొక విద్వాంసుడు 'బభ్రు' అనగా రక్త వర్ణముగలవాడు రుద్రుడు అను అర్థమును అంగీకరించెను. ఋగ్వేదమునను రుద్రుడు బభ్రువర్ణముగలవాడని పేర్కొనుట స్మరింపదగును. రుద్రునిభౌతిక స్వరూపము 'అగ్ని' కనుక తేజస్వి అను అర్థము సంగతమే

దేవతల ధనపమును స్వీకరించినవాడు అగ్ని అని మునుపు తైత్తిరీయసంహితా వచనము పేర్కొనబడినది. దీనివలన అగ్నికి రుద్రుడన్నపేరుప్రసిద్ధమని తెలియనగును. ''రుద్రో వషయదగ్నిః'' అని తైత్తిరీయమున మరొక్కచోట పేర్కొనబడినది. శతపథబ్రాహ్మణమునను ''యోవైరుద్రః సో అగ్నిః'' అని కలదు. అగ్నికే 'శర్వ' 'భవ' అనునామములున్నట్లు శతపథబ్రాహ్మణమున పేర్కొనబడియున్నది.

అగ్నిర్వైసదేవః తస్యైతానినామాని శర్వఇతి తథాప్రాచ్యా ఆచక్షతే భవఇతి యథా బాహ్లీకాః పశూనాంపతీరుద్రః అగ్నిరిత్యేవ శాన్తతమమ్ తస్మాద్ అగ్నఇతి క్రియతే స్విష్టకృత్ ఇతి (శత. బ్రా)

అగ్ని, భవ అనుపేర్లు శివుని 'అశాన్త' నామములు అనగా రౌద్రస్వరూపమును గుర్తుచేయునవి, శర్వుడని ప్రాచ్యులు రుద్రుని పేర్కొందురు - బాహ్లికులు పడమటి దేశములవారు భవుడని రుద్రుని పేర్కొందురు - అనిపైవాక్యమువన ద్యోతకమగుచున్నది. అగ్ని రుద్రుని భయంకర రూపము. వమస్తమును దహించివేయును. అతని శాంత రూపమునకు స్విష్టకృత్ (స్తుతించువారి కోరికలు తీర్చువాడు) అని పేరగును.

అగ్నియే యజ్ఞ రూపము దాల్చి యజమానుని కోరికలను తీర్చును. మరియు ఆ అగ్ని వైశ్వానరుడను పేరితో ప్రాణుల

శరీరమున నుండి ఆహారమును జీర్ణమగునట్లుచేయును. మరొక రూపమున ప్రచండాగ్నిగా జ్వలించి వనములను, వన్యప్రాణులను, మానవులను భస్మము గావించును.

ఋగ్వేదము రుద్రుని భయంకర శివంకర రూపములుగల వానినిగా కీర్తించెను.

"త్వేషం రూపం తపసా సిహ్నావామహే (ఋగ్వేద 10-114-5) ఇతని రూపము తపస్సువలన అత్యంతము తేజస్వంతమైనది "యః శుక్ర ఇవసూర్యో హిరణ్మయమివ రోచతే (1-43-5) మిక్కిలి ప్రకావముగల సూర్యునివలె బంగారు వన్నెతో జ్వలించుచున్నాడు. స్వర్ణాభరణములు ఇతనికి ప్రియములైనవి. వానిని ధరించి ప్రకాశించు చున్నాడు (అర్హన్నిష్కం యజతం విశ్వరూపమ్ బిభర్షి" (2-33-10) ఇతడు యువకుడు పరిపుష్ట శరీరముతో విల్లమ్ములు ధరించి సంచరించుండును

రుద్రునివాహనము రథము, ధనుర్బాణములు ఆయుధములు (తముష్టుహి యః స్విరుషుః సుధన్వా అహంరుద్రాయ ధను రాతనోమి) అతని ధనుస్సునకు పినాకమనిపేరు (అవతతధన్వాపినాకావసః)

భీమ (భయంకర) ఉగ్ర, ఉపహత్ను (ఘాతక) విశేషణములతో ఋగ్వేదము శివుని కర్తంచినది. ఋషులు ఋగ్వేద మంత్రములతో రుద్రుని స్తోత్రము చేయుటలో వారిలో అతని యెడగల భయమువ్యక్తమగుచున్నది.

"మానోవధీః పితరం మోతమాతరం మానః ప్రియాన్తన్వో రుద్రరీరిషః, మమ్ముచంపకుము, మా తల్లిదండ్రులను ప్రియజనులను చంపకుము (మానస్తోకే తనయే మాన ఆయోమానోగోఝ మానో అశ్వేఝ రీరిషః -)

మాసంతతిని, గోవులను అశ్వములను చంపకుము

''పరిణోహేతి రుద్రుస్య వృజ్యాః పరిత్వేషస్య దుర్మతిః మగాత్'' రుద్రునిశక్తిలేదాశూలము మమ్ము వదలివేట్టునుగాక గాక. నాశముచే యవలెనన్న అతని దుర్బుద్ధి మావిషయమునతోచకుండు

''మాత్వారుద్ర చుక్రుధామ'' ఋగ్వే (2-33-4) రుద్రా!నామీద కోపముచూపకుము.

''అహింసర్ణనః శివః పరోమూజవతః అతీహి'' మమ్ము హింసింపక మూజవార్ తర్వతిములదాటి పొమ్ము'' అన్నప్రార్థన అథర్వవేదమున కానబడుచున్నది.

జ్వరము, విషము, దగ్గు (క్షయ), దివ్యాగ్ని విద్యుత్తు లేదాపిడుగు ఈ నాలుగును రుద్రుని ఆయుధములుగా అథర్వవేదము పేర్కొనుచున్నది. శివుడు అగ్నిస్వరూపుడుగనుక అంతరిక్షాన్ని విద్యుత్తు లేదా పిడుగు స్వర్గలోకాగ్నియగు సూర్యుడు భూలోకమునగల అగ్ని ఈమూడును రుద్రరూపములే. తమమీద, తమపశువులమీద విద్యుదగ్నిని, పిడుగును ప్రయోగింపవలదను ప్రార్థన వేదమున గానవచ్చుచున్నది.

వాయుపురాణము అగ్నిని కాలరుద్రుడని పేర్కొన్నది. ప్రతిదినము ప్రాణుల ఆయువును క్షీణింపజేయు సూర్యుడు కాలరుద్రుడని ఆపురాణము పేర్కొన్నది.

ప్రళయకాలమున సర్వమును భస్మముచేయు కాలాగ్ని రుద్రుడని విష్ణుపురాణము ''కాలాగ్ని రుద్రోసౌభూత్వా సర్వభూతహరోహరిః''

యాస్కుడు తన నిరుక్తమున రుద్రశబ్దమునకు అర్థము పేర్కొనుచు ''రుద్రో రోతీతి సతః రోఖ్యమాణో ద్రవతీతివా రోదయ తేర్వా'' (నిరుక్త 10-5) అగ్నిరపి రుద్ర ఉచ్యతే (10-7) గొప్పధ్వనిచేయుచు ఇటునటు విస్తరించి సంచరించునుగాన రుద్రుడు, గట్టి శబ్దము చేయును గాన రుద్రుడు, పిడుగుపాటు చేత ప్రజల ఏడ్పించును గనుక రుద్రుడు. పెనువానగురియునపుడు ఆకాశమున

గర్జించును గనుక విద్యుత్తు రుద్ర స్వరూపమని 'బృహద్దేవతా' గ్రంథమన

అరోదీదన్తరిక్షేయ ద్విద్యుద్‌వృష్టిం దదన్నృణామ్ । చతుర్భిర్ ఋషి భిస్తేన రుద్ర ఇత్యభిసంజ్ఞితః । (బృహద్దేవతా) 2-34 కలదు.

ఋగ్వేదవ్యాఖ్యలో సాయణాచార్యుడు

"రుణద్ధి ఆవృణోతి ఇతిరుద్ (క్విప్) అన్ధకారాదిః। తద్ వృణాతివిదారయతి ఇతిరుద్రః"

అంధకారమును ఆవరించి పోగొట్టుట వలన రుద్రుడనబడెను. అని అగ్ని స్వరూపునిగా వివరణ మొనగెను.

అయితే, పెనుగాలివానలో ఝంఝూవాతముగా గర్జించునదే రుద్రరూపమని జర్మను దేశయుడు వివరించెను.

ఇట్లు అగ్ని విద్యుత్, ఝంఝూవాత స్వరూపుడుగ ధనుర్ధారిగా, హింసకుడుగా రుద్రుడు అభివర్ణింపబడినను వేదములు మరొకవంక అతని శివంకరస్వరూపమును కీర్తించెనవి.

ఋగ్వేదము రుద్రుని రయామయునిగా, కల్యాణమయునిగా, శ్రేష్ఠవైద్యునిగా ప్రశంసించినది. తన వద్దనున్న దివ్యౌషధముల వలన భయంకర రోగములను దీర్చువాడని పేర్కొన్నది.

రుద్రుని హస్తము మూలయాకు (మంగళమయము) (2-33-7) మోఢూవాక్ (ఉదారదాత) స్తుతించువానికి విపులధనము ననుగ్రహించును. (10-92-2) ఆశుతోషుడు, భక్తజనుల యెడశీఘ్రముగా అనుగ్రహము చూపువాడు.

'ఆరే అస్మద్ దైవ్యః హాలో అస్యతు (1-114-4) రుద్రుడు తనకోపము వలన ఏర్పడగలసంకటములను తీర్చును 'శమ్' కల్యాణము, మయస్-సుఖము దీనికి అతడుకర్త (1-43-6) అందువలన వాజసనేయీసంహిత అతనిని మయస్కరుడు (సుఖమును

అనుగ్రహించువాడు) అని స్తుతించెను.

(యద్వై శివం తద్మయః)

'యో విశ్వస్య క్షయతిభేషజస్య' - ఋగ్వేద - (5-42-11) విశ్వములోని సమస్త ఓషధులమీద అతనిప్రభావము, అధికారము కలదు. 'సహస్రతే స్వపివాత భేషజా' (7-43-1) అతనివద్ద వేలకొలది మూలికలు కలవు. ''త్వదత్తేభీరుద్ర శతమేభిః శతుహిమా అశీయభేషబేభిః'' ఆ ఓషధులను ఉపయోగించి మనుష్యులను నూరేండ్లకాలము జీవించియుండునట్లు చేయును. అందువలన రుద్రుడు భిషక్ తమంత్వాం భిషజాం శృణోమి (2-33-4) భిషగ్వరులలో శ్రేష్ఠుడని కీర్తింపబడినాడు, సూర్యుడే రుద్రుడుగనుక ఓషధువకు జీవనప్రదాత రుద్రు డయ్యెను.

రుద్రోత్పత్తిని గుఱించివింతవింతవృత్తాంతములు వైదిక వాఙ్మయమున కానవచ్చుచున్నవి.

బ్రహ్మకుమారుడని ఒకచోట పేర్కొనబడినది.

ఐతరేయబ్రాహ్మణము (3-3-9)లోని వృత్తాంతము ''ప్రజాపతిర్వై స్వాం దుహితర మభ్యధావద్ తందేవా అపశ్యర్, 'అకృతం వైప్రజాపతిః కరోతి' ఇతితమ్ ఇచ్ఛర్ య పనమ్ అరిష్యతి । ఏతమ్ అన్యోన్యం న అవిన్దర్, తేషాం యాఏద ఘోరతమాః తన్వః ఆసర్ ఏకధా సమభరర్, తాసంభృతి ఏద దేవః అభవత్ యస్యైతత్ భూతవద్ నామ తం దేవా అబ్రువర్ ప్రజాపతిః అకృతమ్ అకః విధ్యపనమ్

బ్రహ్మ తన కూతురైన ఉషస్సును కామించి నందుకు దేవతలు మిక్కిలి కోపించిరి. ఉషస్సు భయపడి జింకరూపమున పరునిడగా బ్రహ్మతానునొక జింకరూపమున వెంటబడెను. వారు తమలో తాము సంప్రదించుకొని ప్రజాపతి అకృత్యమునకు పూనుకొన్నాడు. అతనికిదగిన దండనము ఈయవలెను, అని పలుకుకొనిరి. అయినను వారిలో అందుకు తగిన క్రూరదరస్వభావము కలవాడొక్కడును

లేకపోయెను. వారు తమలో ఉన్న క్రోధము అనే భయాన
అంశములను అందరు కలిపి యొకఘోర మూర్తిగా రూపొందించిరి
అతడే రుద్రుడు, ఘోరతమరూపముగల రుద్రుడు విల్లమ్ముసదాల్చి
బ్రహ్మ మీద బాణమును ప్రయోగించెను. ఆ బాణము తగిలి
ప్రజాపతి నేలపై మూర్ఛిల్లి పడెను. అంత దేవతలు ప్రజాప
యజ్ఞస్వరూపుడు గనుక అతని మీద పశ్చాత్తాపముతో బాణమున
తీసివైచి, అది తగిలిన భాగమును ఖండించి అతనికి చికిత్స చేసిరి
రుద్రుడు పశుపతిగనుక పశురూపమున పశువృత్తికి పూనిన బ్రహ్మన
శాసించెను.

## రుద్రుని అష్టమూర్తులు

శతపథబ్రాహ్మణమున (6-1-3-8-18) ఇట్లు కలదు. సంవత్స
రూపియగు ప్రజాపతి తన పత్నియను ఉషయందు తన వీర్యమ
నుంచెను. అపు డొక కుమారుడు పుట్టి ఏడువసాగెను. ప్రజాపతినిజూ
ఆకుమారుడు 'నా పేరేదో చెప్పు, మనెను. ప్రజాపతి నీపే
'రుద్రుడ'నెను, అగ్ని రుద్ర రూపము. అపు డా కుమారు
'నేను అగ్నికన్న శక్తిమంతుడను వేఱొక పేరు చెప్పు మనెన
వరుసగా ప్రజాపతి శర్వ (జలము) పశుపతి (వనస్పతి) ఉ
(వాయు) అశని (విద్యుత్తు) భవ (పర్జన్యుడు) మహాదేవ (చంద్రమా
ఈశానుడు (సూర్యుడు) అనుపేర్లను పేర్కొనెను. (సంవత్స
ఉషసి రేతః అసిఞ్చత్ స సంవత్సరే కుమారః అజాయత।
అరోదీత్ తిం ప్రజాపతిరబ్రవీత్, కుమార, కింరోదిషి అబ్రవీ
అనపహతపా ప్మావా అస్మి, అహితనామమా। నామమేధే హీ
తమబ్రవీత్ రుద్ర అసి, తద్ యదస్సనామ అకారీత్ అగ్నిస్తద్రూ
మభవత్, అగ్నిర్వైరుద్రః, సః అబ్రవీత్ జ్యాయాన్వా అతః అస్మి
దేహిపవమె నామ ఇతి తమబ్రవీత్ శర్వః అసి, ఆపస్తద్రూప మభవత్
పశుపతి రసి - జషధయస్త ద్రూపమభవత్। ఉగ్రః అసి వాయు

స్రూపమభవత్। అశనిరసి విద్యుద్వా అశనిః భవ అసి పర్జన్యో వైభవః। మహాదేవః అసి చన్ద్రమాస్తద్రూపమభవత్। ఈశానః అసి ఆదిత్యోవా ఈశనః, సః అబ్రవీత్ ఏతావార్ అస్మి - మామా ఇతః వరో నామధాః'' - శతపథబాల - (6-3-8-17) కౌషీతకీ బ్రాహ్మణమునందును కొంతవ్యత్యస్తముగా ఈవృత్తాంతము పేర్కొనబడియున్నది. ప్రజాకాముడై ప్రజాపతి తీవస్సుచేయగా అతని శరీరమునుండి అగ్ని, ఆదిత్యుడు, వాయువు, చంద్రమా అను నాలుగును జ్యోతిరూపమున ఉద్భవిచినవి, తర్వాత ఉష జనించినది. ప్రజాపతి తన కుమారిని తపస్సుచెయ ఆజ్ఞాపించేను. అయితే అప్సరసరూపమున వచ్చిన తనపుతినిచూడగానే ప్రజాపతికి రేతస్ఖలనవమయ్యెను. దానిని హిరణ్మయచమనమున ప్రజాపతి ఉంచెను. అందుండి సహస్రాక్షుడు, సహస్రపాదుడు నగుపుత్రు డుజనిచను. ఆపుత్రుడు ప్రజాపతిని పట్టుకొని తనకు పేరు పేట్టవలసిన దని కోరేను.

'ప్రజాపతిః ప్రజాకామస్తపః అతప్యత, తస్మాత్ తప్తాత్ పఞ్చ అజాయత । అగ్నిర్వాయు రాదిత్యశ్చన్ద్రమా ఉషా పఞ్చమీ। ఉషా ప్రాజాపత్యాయం అప్సరోరూపం కృత్వా పురస్తాత్ ప్రత్యు వైత్। తస్యాం ఏషాంమనః సమపతత్ తే రేతః అసిఞ్చన్త। తే ప్రజాపతిం పితరం ప్రత్యబువర్ రేతోవై అసిబామహా ఇదం నోమా అరుమాభూదితి। సప్రజాపతిః హిరణ్మయం చమన మకరోద్ ఇషుమాత్ర మూర్ధ్వ మేవం తిర్యఞ్చ। తస్మిర్ రేతః సమసిచత్। తత ఉదతిష్ఠత్ సహస్రాక్షః సహస్రపాత్ సహస్రేణ ప్రతిహితాభిః।

కథా నామాన్యచ్ఛతీతి। నామతేకుర్వీత ఇత్యాబ్రదీత్ నవై ఇదమవిహితెన నామ్నా అన్నం అత్స్యా మీతి (కౌషీతకి - 6-1)

భవః, ఆపః, శర్వో అగ్నిః, పశుపతిర్వాయుః, ఉగ్రోదేవ ఓషధయః, మహార్ దేవ ఆదిత్యః, యద్ రుద్రశ్చన్ద్రమాః, యదశనిరిన్ద్రః

కాషీతకీ బ్రాహ్మణము ననుసరించి -

1) అగ్నిః (శర్వః) 2) ఆపః (భవః) 3) ఓషధయ (ఉగ్రః) 4) వాయుః (పశుపతిః) 5) అన్నమ్ (ఈశానః) 6 అశనిః 7) చంద్రమాః (రుద్రః) 8) ఆదిత్యః (మహాదేవః అనిపేర్లయ్యెను (ఇంద్రః) శతపథ బ్రాహ్మణముననుసరించి -

1) అగ్నిః (రుద్రః) 2) ఆపః (శర్వః) 3) ఓషధయః (పశుపతిః 4) వాయుః (ఉగ్రః) 5) పర్జన్యః (భవః) 6) అశనిః - (విద్యుత్ 7) చన్ద్రమాః (మహాదేవః) 8) ఆదిత్యః (ఈశానః) అనున రుద్రుని అష్టమూర్తులయ్యెను.

పుష్పదంతుడు తన శివమహిమ్న స్తోత్రమున,

భవః శర్వోరుద్రః పశుపతి రథోగ్రః సహమహాన్
తథా భీమేశానావితి యదభిధానాష్ట కమిదమ్। అముష్మిన్ ప్రత్యేక
ప్రవిచరతి దేవ శ్రుతిరపి ప్రియాయాస్మై ప్రవిహిత నమస్యో ऽసి
భవతే ॥
అని ప్రశంసించెను

పురాణకాలమున ఇంచుక భిన్నముగా రుద్రుని అష్టమూర్తు ప్రశంస కలదు. కాళిదాసుడు తన అభిజ్ఞాన శాకుంతల నాటకము నాందీశ్లోకమునమ్మ శివుని అష్టమూరులను క్రింది విధమున స్తుతించెను

యా సృష్టిః స్రష్టురాద్యా, వహతివిధిహుతం యాహవిర్యాచహోత్రీ
యే ద్వే కాలంవిధత్తః, శ్రుతిశియగుణా యాస్థితాన్యావ్య విశ్వమ్।
యామాహుః సర్వబీజ ప్రకృతిరితి యయాప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతు వ స్తాభిదష్టాభిరీశః।
విష్ణుపురాణమున రుద్రస్వరూపములు,

భీమముగ్రం మహాదేవ మువాచ సపితామనహః।
చక్రే వామాన్యవైతాని స్థానాన్యేషాంచకార సః॥
సూర్యో, జలం, మహీ, వాయుః వహ్నిరాకాశమేవచ।
దీక్షితో బ్రాహ్మణః, సోమ ఇత్యేతాస్తనవః క్రమాత్ - అ

పేర్కొనబడినవి.

క్రమముగా ఈ అష్టమూర్తులకు ఉష, వికేశీ, అపరా, శవా, స్వాహా, విశా, దీక్షా, రోహిణి అను పత్నులును, శని, శుక్రుడు లోహితాగుడు, మనోజవుడు, స్కందుడు సర్గుడు, బుధుడు అను పుత్రులు ఉన్నట్లును పేర్కొనబడినది.

## త్ర్యంబకుడు

యజుర్వేదమున రుద్రుడు త్ర్యంబకుడుగా కీర్తింపబడెను.

కృష్ణయజుర్వేద - శుక్లయజుర్వేదములలో త్ర్యంబకహోమము పేర్కొనబడినది. వానిలో నిది రాజసూయయాగమున ఒక ముఖ్యాంగముగా పేర్కొనబడినది. ఈ యాగమున గృహమందలి వ్యక్తు లందరిని రక్షించుటకు, క్రొత్తగా జన్మింపబోయే శిశువుల రక్షించుటకు పరమశివుని ప్రార్థించుచు పురోడాశ మొసగబడు. ఈ పురోడాశము ఒక చిన్న మూటగా కట్టి ఇంటికి దూరముగ ఉత్తరదిశలోనున్న ఒక వృక్షశాఖలో బంధించి యుంచబడును. లేదా నాలుగు వీథులు కలియుచోట దాక్షిణాత్య అగ్నిలో హోమము చేయబడును.

ఆ సందర్భమున ఉచ్చరింపబడు మంత్రములు గుర్తింపదగినవి.

1 ) ఏక ఏవరుద్రో నద్వితీయాయతస్య, ఆఖుస్తే రుద్ర పశుస్తంజుషస్వ,

2 ) ఏష తేరుద్ర భాగః సహస్వస్రా అంబికయా తంజుస్వ, భేషజం గవే అశ్వాయ పురుషాయ అథో అస్మభ్యం భేషజం సుభేజం యథా అసతి, అవం అంబ రుద్ర మదిమహ్యా వదేవం త్ర్యమకమ్, యథా నః శ్రేయసః కరద్ యథా నోవస్యసః కరద్ యథానః పశుమతః కరద్యథానోవ్యవ సాయాత్ ।

3 ) ఏష తే భాగస్తం జుషావ తేనావసేన పరోముజవతః అతీ।

[illegible]

అవతతధన్వా పినాకహస్తః కృత్తివాసా అహింసన్ నః శివః అతీహి ॥ (తైసం)

ఈ ఉదాహరణములవలన యాగభాగము సమర్పింపబడిన తర్వాత తమ పశువులను, మనుష్యులను ఓషధుల మూలమున రోగ విముక్తులనుగా జేసి కల్యాణము చేకూర్పవలెనని, ధనము ఒసగవలెనని, పశువులతోని కూడినవానిగా, బలవంతులనుగా చేయవలెనన్న ప్రార్థన కలదు.

ఇక్కడ రుద్రుని పశువు మూషికమని పేర్కొనబడినది. మనుష్యులకందరికి మాతయైన అంబిక రుద్రుని (స్వసా) సహోదరిగా పేర్కొనబడినది. రుద్రుడు కృత్తివాసుడు అనగా చర్మధారిగా పేర్కొనబడెను. అంతేగాక యజ్ఞ భాగమును, స్వీకరించిన తర్వాత మూజవత్పర్వతములకా వలకు వెడలి పోవలసినదిగా ప్రార్థన కలదు. సమీపముననున్న యజ్ఞమునకు విఘ్నము కలిగించునేమో, తమ్ము హింసించునేమో అనుభయమున దూరముగ పర్వత ప్రాంతమున కావలెవడలి పోవలసినదని ప్రార్థన, అతనికి ఈయవలసిన భాగమును గూడ దూర ప్రదేశమునకుగొని పోయి సమర్పించుట విధించబడినది.

అన్యపశువులను వాహనమని పేర్కొన్న వానిని నాశము చేయనేమో అన్నభయమే మూషిక వాహనునిగా పేర్కొనుటకు కారణమట. ఈ విషయము సాయన భాష్యమున పేర్కొనబడినది.

''తదస్యా ఆఖుమేవ పశూనాముపదిరేతి! తేనో ఇతరాన్ నహినస్తి. (పశూనాం మధ్యే ఆఖుమేవ పశుత్వేన ఉపదిశతి! తేన కారణేన ఇతరాన్ నృగవాశ్వాదీన్ పశూన్ నహినస్తి (సాయణ)

పురాణ కాలము నాటికి మూషికము వినాయకుని వాహనమయ్యెను. వేదకాలమునన రుద్ర-గణేశులకు అభేదము కావవచ్చును. గణేశుడే రుద్రుడు. యాగముని రుద్రునకు అర్పింపబడు పురోడాశమున నేయి కలుపరాదు. ఏలన, ఆరుచికి

అతడూ పశువులను హింసింపవచ్చునను భయము కారణము.

''అభిమానకో హరుద్ర: పశూ౯ త్స్యాద్ యదశ్చ్యైత్ తస్మాదనక్తా ఏవస్య:'' శత-బ్రా- (2-6)లో విషయము సూచింపబడినది.

*ఉత్తరదిశలోని మూజవత్పర్వతమతని ప్రియునివాసము*
*అత్రహవా అస్యవరో మూజవద్భ్యశ్చరణమ్*
*తస్మాదాహ వరోమూజవతః అతీహ ॥ శతబ్రా*

కృత్తి వాసుడైనాడు. కూర్మ పురాణమున గజాసురుని వధించి అతని చర్మమును ధరించినందున గజచర్మాంబరుడయ్యెగని కలదు. లింగపురాణము వ్యాఘ్రచర్మాంబరురని ప్రశంసించినది.

## త్రిపురాసుర సంహారము

శివుని గుఱించిన పురాణ కథలలో త్రిపురాసురసంహారము ముఖ్యమైనది. ఐతరేయ శతపథ బ్రాహ్మణములలో ఈ వృత్తాంతము కలదు. అసురులు ఒకప్పుడు భూమి, అంతరిక్షము, స్వర్గము అను ప్రదేశములలో క్రమముగాలోహ - రజత సువర్ణ పురములు నిర్మించుకొని ఆయాలోకవాసు అను హింసిచుచుండగా సదాశివుడు వారల పురములతో కాల్చివేసినట్లు పేర్కొనబడియున్నది. ఈ వృత్తాంతమును గుఱించిన విశేషాంశములు ఇట అప్రస్తుతములుగాన వివరింపబడ లేదు.

### త్రిశూలము

వేదములో వినాక మను విల్లే రుద్రుని ముఖ్యాయుధముగా పేర్కొనబడినది. పురాణకాలమున రుద్రుడు త్రిశూలాయుధధారిగా వర్ణింపబడేను. తైత్తిరీయసంహిత (5-5-6)లో దీని తత్త్వము పేర్కొనబడియున్నది. అగ్నియే రుద్రుడు. అతనికి మూడు శూలాలు

కలవు. ఒకటి ఆకాశము నుండి మనుష్యులమీద పడు విద్యుత్తు. రెండవది ఆకాశమున అడ్డముగా సంచరించునది, సూర్యబింబము. మూడవది భూమిలో పై కెగసి మండునది అగ్ని.

''రుద్రోవా ఏష య దగ్నిః, తస్య తిస్రః, శరవ్యాః, ప్రతీచీ, తిరశ్చీ, అనూచీ, తాభ్యోవా ఏష ఆవృశ్చ్యతే.

రుద్రసంబంధమైన మరి కొన్ని పురాణకథలున్నవి. దున్మథ దాహము, జటామండలమున గంగను ధరించుట, అంధ కాసురవధ, మున్నగునవి. వీనిని గుఱించిన విశేషములు వైదికసారాత్యమున కానరావు.

## లింగ మూర్తి

సదాశివుడు లింగరూపధరుడు. పురాణములలో ఈ రూప ప్రశస్తి కానబడుచున్నది. ఈ స్వరూపతత్త్వమును గుఱించి పలువిధములైన అభిప్రాయములు కలవు. జ్యోతి స్వరూపుడు (అగ్ని), కనుక దానిప్రతీకగా లింగము భావింపబడుచున్నది. శివుని పురుషావయవమని, దేవతలు బ్రహ్మ ఆదేశమున దానిని పూజింపసాగిరని యొక కథ బ్రహ్మాండ పురాణాదులలో పేర్కొనబడియున్నది.

నేటికి దాదాపు ఐదువే లేండ్లకు మునుపు భారతదేశవు పశ్చిమ దిగ్భాగమున ఇరాణ్, ఇరాక్, టర్కీ, పిరియా మున్నగుదేశప్రాంతములలోవెలసియుండిన సభ్యతకు సంబంధించినది అంగపూజయని, ప్రత్యేకముగ ఒక దేవతకు చేందినదిగాగాక సృష్టినిర్మాణమును సూచించుతత్త్వమునకు ప్రతీకిగా ఏర్పడిన దను అభిప్రాయమును కలదు. పంచభూతములకు చేందిన వృథ్వీలింగము, అబ్లింగము, తేజోలింగము, వాయులింగము, ఆకాశలింగములని శివుడు పూజింపబడుట గుర్తింపదగినది. శివునకు సూక్ష్మ, స్థూలరూపములుగ రేండు విధములైన ఆకారము కలదని, ప్రణవము

సూక్ష్మలింగమని, బ్రహ్మాండము స్థూలలింగమని ప్రకృతము ఆలయములలో పూజింపబడలింగము సదాశివుని బ్రహ్మాండ రూపమునకు ప్రతీక యని విజ్ఞుల తలంపు. ఇదేసముచితమైన తత్త్వముగా గ్రహింప దగును.

'త్వయ్యేవ గచ్ఛతిలయం జగదేతదీశ।
లింగాత్మకం హర చరాచర విశ్వమేతత్ ॥'
తదేవ లింగు ప్రణవం ప్రథమం సార్వకాలికమ్।
సూక్ష్మ ప్రణవరూపంహి సూక్ష్మరూపంహి నిష్కలమ్॥
స్థూలలింగంతు సకలం తత్పంచాక్షరముచ్యతే।
పురుష ప్రకృతిభూతాని లింగాని సుబహూనిచ॥

మున్నగు ప్రమాణములు ఈ తత్త్వమును బలపఱుచుచున్నవి.

## శివగణము

సదాశివునకుగల పరివారములు గురించి పురాణములలో పలు వివరణము లున్నవి. శివగణములకెల అధినాయకుడు నందిగా ప్రసిద్ధి. శ్రీమద్రామాయణమున ఉత్తరకాండలో నంది,

ఇతి వాక్యాన్తరేతస్య కరాలః కృష్ణపింగలః।
వామనో వికటీముణ్డీ నన్దీ హ్రస్వభుజోబలీ॥ అని

భయంకరాకారుడు, నలుపు, పింగళవర్ణముకలిసిన రంగు కలవాడు, వామనుడు, పొట్టి భుజములకలవాడు, మిక్కిలిబలశాలి, ముండిత శిరస్కుడు అని వర్ణింపబడినాడు.

మహాభారతము శివుని వాహనము వృషభమని పేర్కొనుచున్నది. భాగవతమున ''వృషేంద్రో నందీ'' అని నంది శివుని వాహనముగ పేర్కొనబడేను. శ్రీ మద్భాగవ తమున పృథుమహారాజు గోవుగారూపుదాల్చిన పృథివినుండి శంకరుని దూడగాజేసి యక్షరాక్షసాది భూతగణముల పుట్టించినట్లు కలదు.

యక్షరక్షాంసిభూతాని పిశాచాః పిశితాశనాః।

భూతేశ వత్సా దుదుహుః కపాలే క్షతజాసవమ్॥ (భాగ 4-18-21)

పురాణములు విష్ణువునకు పరమవిరోధులైన రావణాది రాక్షసులు శివభక్తులుగా వర్ణింపబడిరి. శ్రీ కృష్ణునకు విరోధియగు బాణాసురుడు శివ భక్తుడై ఆదేవుని తనపురమునకు కాపుగా జేసికొన్నాడు. భాణాసురునితోడి యుద్ధమున శ్రీకృష్ణుడు శంకరునితో పోరాడ నలసివచ్చినది. అసురగురువగు శుక్రాచార్యుడు శివోపాసన చేసి 'మృతసంజీవినీ' మున్నగు సిద్ధులను పొందెను. రాక్షసులలో ప్రహ్లాద - విభీషణాదులు విష్ణు భక్తులు కొందరు, లేక పోలేదు. రాక్షసులకు శల్పియగుమయుడు ప్రసిద్ధ శివభక్తుడు.

పురాణవాఙ్మయమున పరమశివుడు సకల విద్యలకు, కళలకు ప్రవర్తకుడుగా రూపుదాల్చెను. అంతేకాదు, సకల జాలవిద్యలకు ఇంద్రజాలిక విద్యలకు మూలపురుషు డాతడు. ఆభిచారిక కృత్యములు చేయువారు రక్తవర్ణ గోవుమీదనున్న రుద్రుని ఉపాసింపవలెని ప్రమాణము కలదు. నృత్యకళకు ఆది పురుషుడు శివుడు.

సామాన్య వ్రతమైనను, విశేష వ్రతములైనను శివ పార్వతీ సంభాషణరూపమున ఆచరణలోనికి వచ్చినట్లు ప్రమాణములు పేర్కొనబడుచున్నవి. ప్రతి వ్రత విధాన ప్రారంభముననను,

కైలాస శిఖరే రమ్యే గౌరీ ఎచ్ఛతి శంకరమ్।
గుహ్యాత్ గుహ్యతరం కించిత్ కథయస్వ మహేశ్వర॥ అని
పేర్కొనబడియున్నది.

సాంఖ్య, యోగ శాస్త్రములతోను శివునకు గాఢమైన నంబంధము కలదు.

## అంబిక

వేదవాఙ్మయమున సృష్టికి అధిష్ఠాత్రియన దగిన ప్రభావశాలిని యగు దేవిని గుఱించిన ప్రశంస మృగ్యము. ఋగ్వేదమున ఒక సూత్రమునందు మాత్రమే సరస్వతిని గుఱించిన ప్రశంస గలదు. (10-125)

శాక్త తంత్రములో, ఆగమ శాస్త్రములో దేవీ ఉపాసనకు సంబంధించిన వేద ప్రమాణములు రాత్రి, పృథివి, వాక్ సూత్రక్తములకు సంబంధించినవి. కాగా, దేవీ పరమైన మంత్రము వేదమున లేదనదగును.

కేనోపనిషత్తులో ఉమా హైమవతి ప్రత్యక్షమై ఇంద్రవాయ్వగ్ని ప్రముఖ దేవతలకు బ్రహ్మశక్తిచేతనే లోక కార్యములెల్ల జరుగుచున్నట్లు ఉపదేశించెనని పేర్కొనబడినది.

శంకరాచార్యుల ఉపనిషద్భాష్యములో ఈ ఉమ విద్యకు - ప్రజ్ఞకు ప్రతీకగా పేర్కొనబడినది.

పురాణకాలమున సర్వవిద్యలకు అధిష్ఠాత్రియగు ఈ హైమవతి ఉమ శివపత్నిగా పేర్కొనబడెను. స్వర్ణమయశరీరము గల హైమవతి హిమాలయ పుత్రిగా, పర్వతములలో సంచరించు శివునిపత్నిగా పురాణములు పేర్కొన్నవి.

తైత్తిరీయ ఆరణ్యకమున

1. తద్ గాంగౌచ్యాయ విద్మహే, గిరిసుతాయ ధీమహి, తన్నోగౌరీ పచోదయాత్,

2. కాత్యాయన్యాయ విద్మహే, కన్యాకుమారిధీమహి, తన్నోదుర్గిః పుచోదయాత్,

అను మంత్రములు అవిపేర్కొనబడియున్న సంర్భమునుబట్టి పరిశీలింపగా ప్రక్షిప్తములుగా దోచుచున్నవని విమర్శకుల తీలింపు శ్రౌత సూత్రము లేర్పడిన కాలమునకు కాత్యాయని దుర్గ, గౌరి, గిరిసుతా, కన్యాకుమారి, భవాని, శర్వాణీ, రుద్రాణీ, ఈశాని అను పేర్లతో రుద్రపత్నిగా పేర్కొనబడినది. ఈ దేవిని గుఱించిన తర్పణాది విధానములు బోధాయన సూత్రాద గ్రంథములో పేర్కొనబడినవి.

దేవీమాహాత్మ్యమును అభివర్ణించు గ్రంథములతో తొలిది మార్కండేయ పురాణములోని దుర్గాసప్తశతి. ఇందు దేవి విష్ణుమాయగా, యోగనిద్రగా అభివర్ణింపబడినది. మధు కైటభ

దైత్యులచేత పీడింపబడిన బ్రహ్మ

తుష్టావ, నిద్రాం భగవతీం విష్ణో రతులాం తేజసః ప్రభు'' ఆగ్రంథమందే దేవి ''నారాయణి' అనియు పేర్కొనబడినది. శ్రీమద్రామాయణమున బాల, ఉత్తరకాండములలో పార్వతీ ప్రశంస కలదు. అందు ప్రభావశాలినిగా, తేజోమయ దేవిగా వర్ణింపబడినది. మహాభారతమున విరాట పర్వమున యుధిష్ఠిరుడు దేవిని వింధ్యవాసినిగా పేర్కొనెను,

వింధ్యేచైవనగ శ్రేష్ఠే తవస్థానంహి శాశ్వతమ్।
కాళి కాళి మహాకాళి సీధుమాంస పశుప్రియే॥

అని సదా వింధ్యపర్వతమున వసించుదేవిగా, మద్యమాంస పశువులందు ఆసక్తి కలదిగా వర్ణింపబడినది. మహాభారతమున దేవి,
''అట్టశూల ప్రహరణే, ఖడ్గ ఖేటకదారిణి'।
గోపేన్ద్రానుజే జ్యేష్ఠే నన్దగోపకులో ద్భవే॥'' అని నందగోపకులమున శ్రీకృష్ణుని సహోదరిగా జన్మించినట్లు వర్ణింపబడినది.

ఈ దేవిని పరబ్రహ్మ శక్తిగా అభివర్ణించు గ్రంథము మార్కండేయ పురాణము. అందు మహాజ్ఞానుల హృదయములను గూడ భ్రమింపజేయు శక్తికలదిగా, చరాచర జగత్తునకు ఉత్పత్తి స్థానముగా ప్రశంసింపబడినది. అవిద్యారూపమున సంసార బంధమును కల్పించుచున్నది. విద్యారూపమున మోక్షము నను గ్రహింపగలది అని ఆ దేవి ప్రభావము అభివర్ణింపబడినది.

## గణపతి

గణానాంత్వాగణపతిం హవామహే
ప్రియాణాంత్వా ప్రియపతిం హవామహే।
నిధీనాంత్వా నిధిపతిం హవామహే॥

అని ఋగ్వేదమున (2-23-1) మంత్రము కలదు.
తైత్తిరీయ ఆరణ్యకమున

తత్పురుషాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి, తన్నోదన్తీః ప్రచోదయాత్ అనియు,

మైత్రేయ సంహితలో

"తత్ కరాటాయ విద్మహే, హస్తిముఖాయ ధీమహి, తన్నో దన్తీః పచోదయాత్" అనియు గణపతి గాయత్రీమంత్రము రెండు విధములుగా పేర్కొనబడియున్నది. బోధాయన సూత్రములో గణేశ శబ్దము కానరాదు. వినాయక, వక్రతుండ, ఏకదంత, హస్తిముఖ, లంబోదర, స్థూల, విఘ్నవినాయక అను విశేషణములు కానవచ్చుచున్నవి. మానవ గృహ్యసూత్రమున.

అథాతో వినాయకాన్ వ్యాఖ్యాస్యామః శాలకటం కటశ్చ, కూష్మాండ రాజ పుత్రశ్చో స్మితశ్చ దేవయజనశ్చేతి, ఏతై రధిగతానాం ఇమాని రూపాణి భవన్తి, లోష్ఠంమృద్నాతి। తృణానా ఛినత్తి। అంగేషు లేఖాన్ లిఖతి। అపస్వప్నం పశ్యతి। ఉష్ట్రాన్, శూకరాన్, గర్దభాన్ స్వప్నాన్ పశ్యతి। అధ్వానం వ్రజన్ మన్యతే పృష్ఠతోమే కశ్చిత్ వ్రజతి। ఏతైఃఖలు వినాయకై రావిష్టా రాజపుత్రా లక్షణవన్తో రాజ్యం న లభన్తే। స్త్రియః ప్రజాకామా లక్షణవత్యః ప్రజా నలభన్తే। స్త్రీణాం ఆచారవతీనాం అపత్యాని మ్రియన్తే। శ్రోత్రియోధ్యాపక ఆచార్యత్వం నప్రాప్నోతి। అధ్యే తౄణాం అధ్యయనే మహావిఘ్నాని భవన్తి।

వినాయకునకు నాలుగు రూపములున్నవి. అవి శాలకటంకట రాజ పుత్ర కూష్మాండ, ఉస్మిత, దేవయజన - అనబడును. ఇవి మానవుని ఆవహించును. అట్లు ఈ స్వరూపములచే ఆవహితుడైనవాడు మట్టిబెడ్డలను నలుపుచుండును గడ్డిపోచలను. గిల్లివేయుచుండును అంగములలో ఏవో వ్రాతలు వ్రాసికొనుచుండును. అతనికి కలలో దుష్టసూచనలు, ఒంటె - పంది - గాడిదె మున్నగునవి కానవచ్చుచుండును. దారిలో నడచునపుడు తన్ను ఎవరో వెంబడించుచున్నట్లు భ్రాంతి పొందును. ఈ గ్రహ విష్టుడైన

పొందజాలడు. అధ్యయనము చేయబూనినవానికి పలువిదముల ఆటంకములు కలుగును).

అని ఇత్యాది చేడు ఫలితములు కలుగుననియు, తగిన పరిహారముగ 'శాంతి విధానములు ఆచరింపవలెననియు పేర్కొనబడియున్నది. దీని ప్రకారము వినాయకుడు ఒక దుష్ట శక్తిగా రూపొందింపబడినాడు. గణేశుని ముఖ్యదైవముగా ఉపాసించు గాణాపత్యమును కలదు. ఈ మతమున త్రిమూర్తులకును మించిన వాడుగ గణపతి భావింపబడుచున్నాడు.

వైదికయుగమున శివుడే గణాధిపతిగ పేర్కొనబడెను. పురాణకాలమున గణపతి శివపార్వతుల కుమారుడుగ పేర్కొనబడెను.

గణేశ పూర్వతా పనీయోపనిషత్తు శివునితో గణపతికి తాదాత్మ్యమును. అభివర్ణించుచున్నది -

అథాపశ్యాన్ మహాదేవం శ్రియాజుష్టం మదోత్కటం లసత్కర్ణం మహాదేవం గజరూపధరం శివమ్।
స సంస్తుతో దేవతదేవసూనుః
సుతం భృగోర్వాక్యము వాచతుష్టః।
అవేహిమాం భార్గవ వక్రతుణ్డ
మనాథనథం త్రిగుణాత్మకం శివమ్॥

బ్రహ్మవర్త పురాణము గణపతిని సిద్ధప్రదుడని, యోగులకు పరమధ్యేయుడని పేర్కొన్నది. యోగశాస్త్ర ప్రకారము గణపతి మూలాధార చక్రాధిష్ఠాన దైవముకాన యోగసిద్ధు లను గ్రహించువాడయ్యెను.

గణపతి ఆవిర్భావమును గురించి పలు విధములుగ పురాణములు అభివర్ణించుచున్నవి.

పద్మ పురాణమున

తతోబహు తిథేకాలే సుతకామా గిరేఃసుతా।
సఖీభిః సహితా క్రీడాం చక్రీ కృత్రిమ పుత్రకైః॥
కదాచిత్ తైలగంధేన గాత్ర మభ్యంజ్య శైలజా।
చూర్ణై రుద్వర్తమాస మలినాంతరితాం తనుమ్॥

తదుద్వర్తనకం గృహ్యా నరం చక్రీ గజాననమ్।
పుత్రకం క్రీడతో దేవీ తం చాక్షిపయదమ్భసి॥
జాహ్నవ్యాస్తు శివాసఖ్యాజా తతః సోకభూద్మహద్వపుః।
పుత్రేత్యువాచ తందేవీ పుత్రేత్యూచే చజాహ్నవీ॥

సంతానకాంక్షకల పార్వతి పుత్రునివలె బోమ్మలుచేసి సఖులతో ఆడుకొనుచుండెడిది. ఒకనాడు తైలాభ్యంగము గావించుకొని సుగంధద్రవ్యములతోనైన పాడిని శరీరమునకు బూసికొని ఆ నలుగు పిండితోనే ఏనుగు ముఖముగల బొమ్మనుచేసి కొంత సేపటికి దానిని గంగలోవేసినది. ఆ బొమ్మ మహాకాయముగల కుమారుడుగా రూపు దాల్చెను. అతనిని పార్వతియు గంగయు పుత్రా! అనిపిలిచి సంభావించిరి.

గణాధిపతి మహిమల దెలుపు వృత్తాంతములెన్నో అభివర్ణింప బడియున్నవి.

ఒకప్పుడు దేవతలు యజ్ఞము చేయుబూని దానికి పలువిఘ్నములు ఏర్పడగా బ్రహ్మతోమొరబెట్టుకొనిరి. ఆ దేవుడును

వినాయక కృతైర్విఘ్నైఃనైతత్ సత్రం సమాప్యతే।
తస్మాత్ స్తువన్తు తం సర్వే ఆదిదేవం వినాయకమ్॥

'వినాయకువలన కలిగిన ఈ విఘ్నములు అతని దయలేక నివారింపబడవు. కాన మీరు ఆ దేవుని స్తుతింపు డ'ని ఉపదేశించేను. దేవతలు అట్లే స్తుతింపగా వారియజ్ఞము నిర్విఘ్నముగ పూర్తి యయ్యెను.

వేదవ్యాసుడు రచించిన బృహద్ గ్రంథమగు మహాభారతమునకు వినాయకుడే లేఖకు డయ్యెనన్న వృత్తాంత మొకటి కలదు.

సర్వసంపద లనుగ్రహించు దైవముగా విఘ్ననివారకుడుగా గణపతి మన దేశమందేగాక ఆఫ్ఘనిస్తాన్, నేపాళము, చీనా, తుర్కిస్తాన్, టిబేట్, బర్మా, సయా, వియత్నామ్, జపాన్ జావా, బాలీ, బోర్నియో అను దేశాలలోను ఉపాసింపబడుచుండె వనుటకు ఆధారములున్నవి.

## స్కందుడు

కార్తికేయుడు సుబ్రహ్మణ్యుడు, షణ్ముఖుడు, కుమారస్వామి మహాసేనుడు దేవసేనాపతి అనుబహునామములతో పేర్కొనబడు స్కందుడు శివపార్వతుల రెండవకుమారుడుగ పురాణప్రసిద్ధి పొందియున్నాడు.

తైత్తిరీయారణ్యకమున

'తత్పురుషాయ విద్మహే, మహాసేనాయధీమహి, తన్నోషణ్ముఖః ప్రచోదయాత్' అని మైత్రేయ సంహితలో తత్ కుమారాయ విద్మహే, కార్తికేయాయధీమహి, తన్నః స్కన్దః ప్రచోదయాత్ అనియు కుమారస్వామిని గురించిన గాయత్రీ మంత్రిములు కానవచ్చుచున్నవి.

కుమారస్వామిని ఉపాసించు విధానము బోధాయన గృహ్య సూత్రములలో వివరింపబడియున్నది. అందు ఈ దేవుడు సుబ్రహ్మణ్య షణ్ముఖ, విశాఖ, జయంత, మహాసేననామములతో పేర్కొనబడియున్నాడు.

మహాభారతమున కుమార స్వామి జనన వృత్తాంతమును గురించిన రెండు విధములైన ఉపాఖ్యానములుకాన వచ్చుచున్నవి. అగ్ని దేవునకు స్వాహా దేవియందు జన్మించినవాడని (ఆరణ్య పర్వము) పేర్కొనబడినది. అగ్నియే శివస్వరూపుడు గనుక శివకుమారుడనదగును. రెండవ కథ ననుసరించి (ఆనుశాసనిక పర్వము) అగ్నిలో నిక్షిప్తమైన శివ వీర్యము వలన ఉద్భవించినవాడగును. శ్రీమద్రామాయణము బాలకాండమునందును కుమారస్వామి జన్మవృత్తాంతము కలదు. శివుడు పార్వతిని వివాహమా అడిన తర్వాత ఆదేవితో క్రీడించుచుండగా శివవీర్యము వలన కుమారుడు జన్మించినచో అతడు సర్వలోకభయంకరుడగునని దేవతలు భయపడి రట.

యదిహోత్పద్యతేభూతం కస్తత్ ప్రతిసహిష్యతే।
అభిగమ్యసంరాస్సర్వే ప్రణిపత్యైవ మబ్రువర్।
దేవ దేవ మహాదేవ లోకస్యాస్యహితే రతం।
సురాణాం ప్రణి పాతేన ప్రసావంకర్తుమర్హసి।

నలోకావార యిష్యన్తి తవ దేజసి సురోత్తమ।
త్రైలోక్యహిత కామార్థం తేజస్తేజసి ధారయ।

''మీ తేజమును ఎదుర్కొన మూడులోకములలో నెవ్వరును చాలరు కాన మీ వీర్యమును వెలుపల'' జారవిడువక మీ తేజములోనే ఉపసంహరించుకోదగునని ప్రార్థించిరట.

అంతసదాశివుడు తన వీర్యమును నేలపై జాఱవిడిచెను. దేవత లావీర్యములో ప్రవేశింపవలెనని అగ్ని దేవుని ప్రార్థించిరి. అగ్ని అందు ప్రవేశింపగానే అది శరవణ రూపము దాల్చెను. అందుంరిడి కుమారస్వామి జన్మించెను.

మహాభారతము ఆరణ్యపర్వమున మఱొక విధమున పేర్కొనబడినదాది ఒకప్పుడు అగ్ని దేవుడు సప్తర్షుల పత్నులను కామించెను అపుడు స్వాహా దేవి వసిష్ఠపత్నియగు అరుంధతి యొక్క రూపము తప్ప తక్కిన అఱుగురు బొషపత్నుల రూపము దాల్చి భర్తతో క్రీడించెను. ప్రతిసారియు ఆమె అగ్ని వీర్యమును గరుడ రూపముదాల్చి శ్వేత పర్వతమున రెలుపొదల మధ్యనున్నకాంచన కుండమున నుంచుచుండెను, ఆ పర్వత ప్రాంతమున కృత్తికా దేవతలు రక్షించుచుండిరి. కొంతకాలమునకు అగ్ని వీర్యమునుండి ఆఱుగురు కుమారులు దోచిరి వారిని నొకటిగ. జేర్చి కృత్తికలు రక్షించి. స్ఖలిత వీర్యమున దోచినందున 'స్కందుడను' పేరయ్యెను.

స్కందుని దుర్భర తేజమునకు దేవతలు భయపడిరి. దేవేంద్రుడు కుమార స్వామితో పోరాడి పరాజితుడై తుదకు దేవసేనాధిపత్యము నొసగి సంభావించెను. శతపథ బ్రాహ్మణమున భద్ర, ఉగ్ర, శర్వ, మున్నగు ద్రనామములు ఎనిమిది పేర్కొనబడి ఇవి అగ్నికి పర్యాయనామములనియు, అగ్ని దేవుని తొమ్మిదవ రూపము కుమారు డనియు పేర్కొనబడినది.

కార్తికేయునిపత్ని షష్ఠీదేవియని పూర్వగ్రంథములందు పేర్కొనబడియున్నది. ఈ దేవి చిన్నబిడ్డలకు కీడు కలిగించుట యేకాదు, వారిని భక్షించు ననియు, అందువలన శిశువు జన్మించిన ఆఱవదినమున విశేష బలివిధానములలో పూజించి అదేవిని సంతృప్తి పఱచిన మేలుకలుగునని పేర్కొనబడియున్నది.

భారతము 'ఆనుశాసనిక పర్వమున శివుని వీర్యమును అగ్ని భరింపజాలక గంగ పాలు చేసెననియు గంగయు దానిని శరవణమున విసరివేయగా కృత్తికలు ఆతేజమున ఒక్కొక్క అంశమును తను గర్భమున ధరించిరనియు కొన్నాళ్ళకు శిశు శరీర భాగములు వారి గర్భమున జనించివేటనే అన్నియు సరీగా అదుకుకొని శిశురూప ముదాల్చెననియు పేర్కొనబడియున్నది.

మత్స్యపురాణమున తారకాసురవధకై కుమారస్వామి జన్మించె నను వృత్తాంతము కలదు. బ్రహ్మ పురాణమున కుమారోత్పత్తికథ చాలవఱకు కాళిదాసుని కుమారసంభవమున అభివర్ణింపబడినట్లు కలదు.

'కుమార' శబ్దమునకు అర్థము మత్స్యపురాణమున ఇట్లు కలదు,

దీప్తోవారయితుం దైత్యాన్ కుత్సితాన్ కనకచ్ఛవిః।
ఏతస్మాత్ కారణాదేవ కుమారశ్చాపి సోభవత్ ॥

కుత్సితులగు రాక్షసులను సంహరించుటవలన ఇతడు కుమారు డనబడెనని పేర్కొనబడినది. ఆపురాణమందే,

కృత్తికామేళనాదేవ శాఖాభిః సవిశేషతః।
శాఖాభిధాన మాఖ్యాతు షడ్వక్త్రేషు విస్తృతాః ॥

కృత్తికలచేత తమకు జనించిన వివిధ శరీర భాగములు కలిపినందున శిశువైన కారణమున ఆ కుమారునకు విశాఖుడని పేరయ్యె నని పేర్కొనబడినది.

శ్వేతా, శకునికా, వామనికా, సంతానికా, సుప్రతిష్ఠా, సుకుసుమా, సమేడీ, శోభనా, మున్నగుగు విచిత్ర నామములుగల అసంఖ్యాక పరిచారికలు ఆ దేవికి గలరు. (మహాభారత అరణ్యపర్వమున ఈ వివరములున్నవి) వీరు మాతృకలనబడుదురు. పదహారేండ్లకు లోబడిన బాలబాలికలను వివిధ రోగాలతో బాధపెట్టుటకు వీరికి స్కందుడు అనుమతి యొసగి యున్నాడట, సువక్త్ర సంచారక, సుచక్ర, సిత, సహస్రబాహు లనబడు అనేక గణములు స్కందుని అనుయాయులు గలరట. (రుద్ర గణములవలె ఇవియు పలువిధ రోగక్రిములు గావచ్చును. మునువు రుద్రగణముల వివరిచు సందర్భమున వేదమంత్రములకు మహీధరుడు వ్యాఖ్యరచించునా నీలగ్రీవాడి అసురగణములను రోగక్రిములుగా వివరించుట సూచింపబడినది.) ఈ మాతృకలు, గణములు కలిసి స్కంద గ్రహము అనబడును. (ఆయుర్వేద గ్రంథములలో ఈ బాలగ్రహబాధలు, వానికి ప్రతిక్రియలు వివరింపబడియున్నవి.)

మృచ్ఛకటిక నాలుగవ అంకములో శర్విలకుడు చారుదత్తుని ఇంటకన్నమువేయుచు కార్తికేయనకు నమస్కరించుచు అతనిని చౌర్యకళకు ఆదిగురువని, చోరులు స్కందపుత్రులని ఈ గురువు కార్తికేయడను పేరుగల వ్యక్తికోనోపును కొందరు విమర్శకులు ఈ స్కందుని శివకుమారునిగా తలంచుట పేర్కొనెను. ప్రమాదపతితము గావచ్చునని తోచుచున్నది) లేదా, భిల్లులు మున్నగు కొండ జాతులవారు కాళిని ఇష్టదైవముగా కొలిచినట్లు చోరులు స్కందుని తమ ఇష్టదైవముగా చేసికొని రేమో? తమిళవాఙ్మయమున కుమార స్వామి భిల్ల జాతికి చెందిన 'వళ్ళిని' వివాహ మాడెనని పేర్కొనబడియుండుది ఇందులకు నిర్శన మన వచ్చును.

స్కందునివాహనము మయూరము (నమోమయూరోజ్జ్వల వాహనాయ - మత్స్యపురాణము) ఆయుధము శక్తియనబడు శూలము. కార్తికేయుడే మహిషాసురుని చంపెనని మహాభారత -

శల్యపర్వమున గలదు. కాని తర్వాత పురాణములు దుర్గాదేవిని మహిషాసురమర్దినిగా ప్రశంసించినవి.

## నాద - బిందు - కళాతత్త్వము

'నాదబిందు కళానిధేనమోనమః, అని శంకరుదు ప్రశంసింపబడినాడు. శంకురుని త్యాగరాజు 'నాదతనుమణితం' అని నాదశరీరుడని ప్రశంసించెను. కాగా, నాద - బిందు - కళలతత్త్వమును గుర్తించినచో శివతత్త్వాలు కొంత తెలిసికొనవచ్చును.

### (నాదము)

అక్షర పరబ్రహ్మము కెవలము చిన్మాత్రము అనగా జ్ఞానమేస్వరూపముగ గలవాడు భగవంతుడు. సృష్టిని తలపెంట్టినపుడు అతనిలోనుండి శబ్దము వెలువడెను. ఆ శబ్దము వేదమంత్రములుగా రూపొందెను. దానినాధారముగ గొని లోక సృష్టి ఏర్పడినది. మొదట బ్రహ్మమునుండి వెలువడిన శబ్దము ఓంకారము.

వాగ్దేవత్యోథవా ప్యైన్ద్రో యదివా పరమేష్ఠినః।
ఓంకారోవైశ్వదేవోవా బాలహ్మోదేవః క ఏవవా॥ బృహద్దేవతా

ఒంకారమునకు అధి దేవత వాక్

లేదా ఇది ఇంద్రుని పేరుకావచ్చును. పరమేష్ఠి, విశ్వేదేవతలు, బ్రహ్మ లేదా దేవతలందఱు ఈ శబ్దముతో పేర్కొనబడ వచ్చును. సర్వదేవతా స్వరూపుడు భగవంతుడే, కాన ఓంకారము దేవత లందఱకు సామాన్యనామమయ్యెను.

సమస్త విశ్వములు, విశ్వములలోని సమస్త వదార్థములు తానేయ్యై విలసిల్లు పరమాత్మ సమస్తవిశ్వమున ఓంకారరూపమున వ్యాపించియున్నాడు. 'ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ' అనిశ్రుతి.

మన శరీరమున మూలాధారమున వెలసి యున్న 'పరా'శక్తి భగవ దంశమే. ఈ 'పరా' అను దానినుండెయే మన వాక్కునకు,

క్రియలకుకై వలసిన శక్తి వెలువడుచున్నది. ఇంతయేల? ఈ 'పరా' శక్తియే ప్రాణశక్తి. శ్వాసరూపమున మనలో ప్రవేశించుటకు ఆధారమైయున్నది.

మనము పీల్చు శ్వాసను లోనికి ఆకర్షించుకొని, మన శరీరమున శక్తి వ్యయమగుట వలనన ఏర్పడు అశుద్ధములను మనము విడుచు శ్వాసద్వారా వెలుపలికి పోవునట్లు చేయునది ఈ పరాశక్తియే. ఇది శరీరమును వీడిన క్షణముననే మరణము సంభవించును. మరణించిన వానిచుట్టు ప్రాణవాయువు ఉన్నను, యంత్ర రూపమున ప్రాణ శక్తిని (ఆక్సిజనును)లోనికి ప్రవేశ పెట్టినను ప్రయోజనము లేక పోవుటకు కారణము లోన 'పరాశక్తి' లేకుండుటయే.

ఆకాశము సర్వత్ర వ్యాపించి యున్నట. బ్రహ్మాండ మంతటను, దానిని దాటియు వ్యాపించియున్నది. ఆకాశము యొక్క గుణము శబ్దము. కనుక శబ్దమును సర్వత్ర వ్యాపించియున్నది. కాననే ప్రపంచమున ఏ మూల ఎవరు ఏ మాట పలికినను, ఏ చోటనుండియైన దూరశ్రవణ మంత్రము వలన వినగలుగుచున్నాము. ఇందుకు కారణము మనము మాటలాడు శబ్దము సూక్ష్మరూపమున విశ్వమంతట వ్యాపించుటయే.

పరతత్త్వమునుండి నిరంతరము వాక్ - దివ్యవాణి బ్రహ్మాండ మంతట వ్యాపించుచునే యున్నది. నాదయోగసిద్ధులు వాగర్థములను తెలిసి కోగలునదురు. ప్రపంచమున ఏయేతత్త్వములు వ్యాపించియున్నవో అవన్నియు వ్యష్టి శరీరమున అనగా మన శరీరమున సూక్ష్మరూపమున నెలకొనయున్నవి.

ఓం భూః పాదయోః, ఓంభువః జంఘ, యోః, ఓంసువః జాన్వోః, ఓం మహః ఉదరే, ఓంజనః హృదయే, ఓంతపః ముఖే, ఓం సత్యంమస్తకే, అని, సకల భువనములు సూక్ష్మ రూపమున మనలో నుండుటను మంత్ర జపకాలమున తలంపునకు తెచ్చుకొనుచున్నాము.

పరతత్త్వము నుండి నిరంతరము శబ్దము వెలువడుచున్నట్లే చునలోనున్న పరాశక్తినుండియు నిరంతరము సూక్ష్మ రూపమున శబ్దము వెలువరుచునేయున్నది. దీనినే అభిజ్ఞులు అనాహత నాదమందురు. రెండు చెవులను మూసికొన్నచో సముద్రఘోషవలె నాదము వెలువరుచుండుటను గుర్తింపవచ్చును. అదే విధముగ పరా శక్తి నుండియు ఈ అనాహత నాదము పది విధములుగ వినబడునని యోగ శాస్త్రము తెలుపుచున్నది.

1. ఝుంకారము 2. సముద్రఘోష 3. మృదంగధ్వని 4. శంఖధ్వని 5. మురళీనాదము 6. వీణానాదము 7. సింహగర్జనము 8. ఢంకాధ్వని 9. తాళవాద్యధ్వని 10. కోకిలధ్వని.

నాదయోగ సాధన వలన పరాశక్తి నుద్దీపింపజేసి సహస్రారమునుండి నిరంతరము వెలువడుచున్న బ్రహ్మ వాక్కుతో కలిపినచో దివ్యవాణిని గుర్తించుటకు వీలగును. పరతత్త్వము తెలియజేయు అర్థ విశేషముల గుర్తింపవచ్చును. అట్టి యోగసిద్ధులకు భూత, భవిష్య, ద్వర్తమాన విశేషములెల్ల సులభముగా తెలియవచ్చును.

పూర్వకాలమున నహర్షులు ఈ విధముననే మంత్రములను గుర్తిచిరి. కాన వారు మంత్ర ద్రష్ట లనబడిరి. వాల్మీకి బ్రహ్మవరమువలన పూర్వము ఎన్నడో, జరిగిన శ్రీ రామ వృత్తాంతమున ఎవరెవరేయే విధమున సంభాషించిరో, ఎట్లు ప్రవర్తించిరో వారిచరిత్ర, నణవడులు, సంభాషనాలు మొదలగు వానినెల్ల యథాతథముగ గుర్తింపగలగెను.

నేటికిని ఇట్టి మహనీయులు అరుదుగ నున్నారు.

తిరువణ్ణామలైలోని రమణ మహర్షి ఆశ్రమమున మహర్షి అంతేవాసులై వెలసి యుండిన మహనీయులు శ్రీ కావ్యకంఠం

గణపతిముని. వీరు అచంచలతపస్సాధన వలన సిద్ధులై స్వర్ణక్రియ (ఇతరలోహములను బంగారముగా మార్చు విధము) సాధించిన వారట. (కాని దానిని లౌకికవ్యవహారములకై ప్రయోగింపమి వారి మహత్వమునకు వన్నెచేకూర్చినది.) ముని గారు మదరాసునకు సమీపమున గల 'పడవీడు' అను గ్రామమునగల రేణుకాంబ ఆలయమున తీవ్ర తపస్సమాధిలోనుండగా వారికి వేద మంత్ర మొకటి సాక్షాత్కరించెను. అది: రాయస్కామో వజ్రహస్తం సుదక్షిణమ్ పుత్రోవపి తరంహువే (ఇంద్రాణీసప్తశతి - పుట 189) దీనికి విరాణ్మంత్రమని పేరిడబడినది.

దీని అర్థము:- రాయస్కామ:- సకలార్థములను, సర్వవిధ పురషార్థములను పొందగోరుచున్నవాడనై, వజ్రహస్తం - వజ్రాయుధమును చేతధరించిన ఇంద్రుని, సుదక్షిణం - అర్థుకెల్ల దాన మొనగుటలో ప్రసిద్ధనగు కుడిచేయికలవానిని, పుతోపితరంహువే - తండ్రిని పుత్రుడు దానవేడుకొన్నట్లు కోరుచున్నాను. (ఆధ్యాత్మక వరముగా మోక్షార్థినై సుషుమ్నా శక్తిని విజృంభింపజేయుటలోన సమర్థుడైన, నా హృదయమున సూక్ష్మమునన్న దక్షిణ భాగమునెలుగుగాగల పరమాత్మను కుమారుడు తండ్రిని వేడుకొనునట్లు , కోరుచున్నాను. అనిభావము) ఈ ముని మంత్రద్రష్టయేగాక దశమహావిద్యలనబడు కిలీ, తారా, త్రిపురసుందరి, భువనేశ్వరి, భైరవి, ప్రచండచండిక, ధూమావతి, బగళాముఖా, మాతంగి, కమలాత్మిక అను పదిమహామంత్రములకు తపస్సమాధిలో నుండి రహస్యార్థములను గుర్తించి వానిని 'మహావ్యాది సూత్రావళి' అను గ్రంథముగ రూపొందించెను. (ఈ తెలుగు గ్రంథకర్త పై దశమహావిద్యల వివరణమును ''దేవీమహిమ - ఉపాసన'' అను గ్రంథమున పేర్కొనెను. దైవానుగ్రహమున్న ఆగ్రంథము ముద్రణ భాగ్యమును నోచుకోగలదు).

మన శరీరమున మూలాధారమున నెలకొనియున్న పరాశక్తిలో పరా - పశ్యంతి - మధ్యమా - వైఖరి అని నాలుగు దశలున్నవి.

పర్తా అణువు మొదలు బ్రహ్మాండము వఱకు సమస్త వస్తువులలో వ్యాపించిన ఈశ్వరశక్తియే పరాశక్తి. రాళ్ళలో, ధాతువులలో, నవరత్నాదులలో, ఈ శక్తికలదు. సమాధిస్థితిలో నున్నప్పుడును ఇది శరీరమును రక్షించుచుండును. విత్తనములో జీవచైతన్యము నిద్రాణమైయున్నప్పటి దశ ఇది.

పశ్యంతి - విత్తనమును నాటి నీళ్ళు పోసినంతనే అది మొలకెత్తి చైతన్యవంతమ గునట్లు ప్రాణులలో ఉన్న పరాశక్తి క్రియా శీలమై మేలుకొను దశ ఇది. ఇంద్రియములు ఈ దశలో తమవ్యాపారములను చేయ నారంభించును. కాన నిది 'పశ్యంతి' అనబడెను. ఈ దశ మనస్సునకు గోచరము కాగలదు. మన జ్ఞానమునకు వికాసమేర్పడు దశ ఇది. వృక్షములలోను, నదులలోను ఈ దశ కలదు. కావుననే వృక్షములు సుఖదుఃఖానుభవమును చెందగలునుచున్నవి. జలచరములు జీవింప గలుగుచున్నవి. కాననే నీళ్ళకు 'జీవనము' (చైతన్య మును ప్రదీప్తము చేయగలది) అను పేరయ్యెను. మనశ్వాసతో లోన ప్రవేశించు ప్రాణ (సూర్య) శక్తి దీనితో ఘర్షణపొందునపుడు 'శబ్దము' ప్రకాశస్థితిని పొందును. ఆచమన - ప్రాణాయామములతో (అగ్నీ షోమములతో) పరాశక్తికి ప్రకాశము చేకూర్చుటతో యోగసాధన ప్రారంభమగును. అనగా అనాహత శబ్దము ఆహతమై (ప్రాణవాయువుచే కొట్టబడి) ధ్వనిగ పరిణమించును. మధ్యమా, పశ్యంతికిని వైఖరికిని మధ్యనున్న దశ. ఈ దశలో మన మనోగతభావములు స్పష్టమన శబ్దములతో ప్రకాశమగుదిటకు సిద్ధపడును.

వైఖరి:- మనో గతభావములును, వ్యాపారములును సంపూర్ణముగా క్రియాశీల మగు దశ. సంగీతము, సాహిత్యము పరులకు శ్రవణానందమొ నర్చునట్లు వ్యక్తము చేయుదశ.

'సేతుబంధమున' ఈ విషయమే క్రింది విధమున పేర్కొనబడియున్నది.

''మొట్టమొదట నాదము 'పరా' స్వరూపముతో మూలాధారమున ఉద్బుద్ధమై, మణిపురమందలి అనాహత చక్రము చేరుకొనును. అక్కడ ప్రాణముతోను మనస్సుతోను చేరి పశ్యంతి, మధ్యమా రూపముల పొందును తర్వాత కంఠ ప్రదేశము చేరి వైఖరీ రూపము పొందును.''

ఈ తత్త్వమును గుర్తించి మనస్సును నాదయోగాభ్యాసముతో పరాశక్తియందు కేంద్రీకరింపజేసినచో దివ్యసందేశమును గుర్తింపగలుగుదుము. నిరంతరము సర్వత్ర వ్యాపించుచున్న ఈశ్వరీయ సంకేతములను అర్థము చేసికోగలము.

ఈ నాదయోగ సాధన యోగశాస్త్రాధ్యయనము వలన గుర్తింప దగును.

## నాదోపాసనా విధాములు

అనాహత నాదములు అఱువది నాలుగు పఱకు సిద్ధులచే లెక్కింపబడి యున్నవి. ఎంతో శ్రమతో సిద్ధి పొందిన గాని ఆనాదముల గుర్తించుట అసంభవము. ఎంతకెంతకు సూక్ష్మములై యున్నవో అంతకంతకు ఆత్మశక్తిప్రదములైనవి అవి. సాధారణ దశలో సిద్ధి పొందినవారు మునుపు పేర్కొన్న పది విధముల నాదమును గుర్తింప గలుగుదురు.

విరాణ్మండలములు ముప్పటి యాఱు కలవు ఒక్కొక్క మండల మును ప్రత్యేకముగ నోక శబ్దమును కలిగియుండును. నాదయోగసిద్ధుని కామక్రోధాదులు ఎంతమాత్రము ఆక్రమించుకొన జాలవు. అతని ఆత్మశక్తి నానాటికి పెంపొందుచు చరమసీమను నిరాటంకముగ అందుకోగలదు.

నాదయోగ సాధన:-

ప్రకాశము మిక్కిలి తక్కువగా దాదాపు చీకటిగ ఉన్న గది, వెలుపలినుండి ఏ శబ్దమును వినరాకుండ ఏకాంతముగ నున్నది సాధనకు తగిన స్థలమగును. సూర్యోదయమునకు ముందున్న వేకువజాము తగిన సమయము. అప్పటినుండి దాదాపు ఎనిమిదవ గంట (ఉదయము) అగువఱకు అనగా పగలు మొదటి జామువఱకు సాధన చేయ వచ్చును. గదిలో బకగోడకు ఆనుకొని లేదా వీపునకు బకదిండు ఆనించుకొని నిటారుగ నిశ్చలముగ ఆసనమున కూర్చుండవలెను. శరీరము భారరహితస్థితిలో ఉంచవలెను. అట్లు దూది మూటవలె తేలికగా ఉన్నట్లు భావించవలెను. రెండు చెవులలోను బాహ్యశబ్దము ఏ మాత్రము వినరాకుండ దూదిని పెట్టుకోవలెను. తర్వాత మూర్ధమున అనగా నోటి పై భాగము మీది తల భాగము లోపలిప్రదేశమున ధ్యానమును నిలిపి సూక్ష్మనాదమును వినుటకు ప్రయత్నించవలెను. ప్రారంభమున ఎట్టి నాదమును వినరాకున్నను నాలుగైదు దినములు విడువక ప్రయత్నించినచో చేవిలో భాగము నిర్మలమై సూక్ష్మనాదమును ఆలకింపగలుగును. శరీరమున ఏర్పడుచున్న రక్త ప్రవాహము రైలు పరుగిడుచున్నట్లు థక థక అని సూక్ష్మముగ వినబడును. శ్వాసము మేఘగర్జనవలె వినబడును. అన్నరసము పక్వమగుచున్న శబ్దమును వినబడును. శరీర క్రియల వలన ఏర్పడు ఈ మూడు శబ్దములును తర్వాత మానసిక క్రియలకు సంబంధించిన రెండు విధముల శబ్దములు

విననగును. మనస్సున భావపరంపరలు చంచలత్వమును కలిగించునపుడు వాన నీటి బిందువులు పడుచున్నట్లు టప్ టప్ అను శబ్దము విననగును. మనస్సు బాహ్యా విషయముల గురించి స్మరించుట సమీపమున ఏదో ఒక ప్రాణి శ్వాసము విడుచుచున్నట్లు శబ్దము వినవచ్చును. ఈ ఐదు నాదములు శరీర మనః క్రియల వలన ఏర్పడును. ఈ నాదశ్రవణ సాధన ఒకటి రెండు నెలలకాలము అభ్యసించిన యెడల మన జ్ఞానేంద్రియములు నిర్మలములై విశేష శక్తి సంపన్నములు కాగలవు. తర్వాత వేణుగానమువలె నాదము వినచ్చును. ఇది సూక్ష్మలోకములలో ఏర్పడు నాదమగును. ఆ నాదము వినుకొలది సాధకుడు తన్మయ భావము పొందును. పరమాత్మానుభవము ఏర్పడును. సిద్ధిపొందుకొలది ఘంటా నాదమువలె 'ఓం కారము విననగును. ఇది శబ్ద బ్రహ్మాను భవ మగును.

ఈ నాదాను సంధానము వలన సాధకుడు త్రికాలజ్ఞాన సంపన్నుడగును.

## బిందువు

సృష్టియ యొక్క ప్రారంభావస్థ బిన్దుస్థితి. ఈ దశలో శక్తి చిద్రూపిణియై అవ్యక్తమైయున్న 'ఇదం' తత్త్వముతో చేరి 'చిద్ బందు' వగును. వైష్ణవ సంప్రదాయమున మనలో అంతర్గతమైయున్న 'విశుద్ధ తత్త్వము' ఏదికలదో అదే బిందు వగుచున్నది. ప్రారంభ దశలలో సమస్తము అణురూపమున బిందువలె ఉండును. సృష్టిక్రియ ప్రారంభమగుటయే బిందు వనబడును. మానవ శరీర నిర్మాణమునకును బిందువు (విర్యము) ఆధారమగుచున్నది. కాన తాంత్రికులు ''బిందు ధారణ'' (వీర్యస్ఖలనముగాకుండ శరీరమందే 'ఓజస్సు' అనే శక్తిగా నిలుపుకొనుట, చిరజీవిత్వమునకు మూల మందురు.

'మరణంబిందు పాతేన జీవనం బిన్దుధారణాత్' అని శివసంహిత మహామహోపాధ్యాయగోపీనాథకవిరాజ్ అనువారు తమ 'భారతీయ సంస్కృతి - సాధన' అను గ్రంథమున క్రింది విధమున పేర్కొనుచునారు.

తత్వాతీతమైన అవస్థలో శివశక్తులకు సామంజస్యముకలదు. ఆ సమయమున శివుడు శక్తి గర్భమున, అనగా శక్తితో అభిన్న రూపమున ఉండును. శక్తి స్వేచ్ఛగా తన స్ఫురణను తాను చూచుసమయమున ''విశ్వమును దర్శించును. ఈ విశ్వదర్శనమే సృష్టి అభిన్నమైయున్న దశలో సృష్టి లేదు. విశ్వము కానరాదు. సృష్టి వ్యాపారమున శివుడు తటస్థుడై యుండును. శివుడు ప్రళయానలస్వరూపుడు. శక్తి సౌమ్య స్వరూప, ఈ యిరువురి సామ్యమే తాంత్రిక భాషలో బిందువనబడును.''

శ్రీ వీరమణి ప్రసాద ఉపాధ్యాయ గారి వివరణ:-

పరా శివ స్వరూప, ప్రకాశము ప్రపంచమును ఉన్మీలనముగావింప దలంచినపుడు తన యిచ్ఛమెయి విశ్రాంత పరా. ప్రకృతి, మాయా, అవిద్యా, మున్నగుపనములతో పేర్కొనబడును. ప్రపంచమును వెలుపలకు విసర్జించుటవలన 'విసర్గ' (విసృజ్యతే - వెలుపలకు విడుచుచున్నది అనువ్యుత్పత్తివలన) అనబడును. అదే శివరూప ప్రకాశము మరల ప్రపంచమును తనలో చేర్చుకోదలచునప్పుడు

వింద్యతే అవిచ్ఛిద్యతే (వేఱుపఱుపక తనలో ఇముడ్చుకనుచున్నది) బిందు వినబడుచున్నది.

సృష్టి చక్రమునకు మూలము బిందువన్నమాట. కార్యావస్థ పశ్యంతి (ప్రారంభ దశ) పరిపక్వము పొందుచున్న మధ్యస్థితి

మధ్య. నాదము (వ్యక్తమగు దశ) నాదము ప్రపంచము అంకురించుటకు కారణము. కాన కారణ బిందువనియు దీనికి పేరయ్యెను.

విచికీర్షుర్ఘనీ భూతాసాచిమ్యేతి బిన్దుతామ్ (ప్రపంచసారతంత్రము)

విశేష రూపముతో కల్పింపవలెనన్న కోరికగల పురుషుని ఘనీభూతమైన జ్ఞానమే బిందువనబడును.

బిందువునకు స్థానము ఆజ్ఞా చక్రము (భ్రూమధ్యము) యోగ శాస్త్రమున నిది జ్ఞాన నేత్ర మనబడును. బిందు సాధనవల్ల ఈ స్థానమున ఈశ్వరసాక్షాత్కారము పొందవచ్చును.

అర్నెట్ జేవిపిక్ అను విశ్వవిఖ్యాత ఖగోళ శాస్త్రజ్ఞాడు తనపుస్తకమున ఒకచోట,

''పాలపుంతతో కూడిన సమస్త బ్రహ్మాండము సూర్యాది గ్రహములతో మృతావస్థలో సూక్ష్మ ఆకాశము లేదా ఒక బిందు రూపమున లయమై పోవును''

సరళరేఖలో గతి శీలత లేదు. కాన గ్రహములు, ఉపగ్రహములు అన్నియు బిందు రూపమున గతిశీలములైయున్నవి. అనగా చక్రాకారవస్తువే తిరుగుచుండ గలదు. సరళలేఖ కదలదు.

వైజ్ఞానిక సిద్ధాంతము బిందు తత్త్వమును స్థిరపరచుచున్నది. ఎట్లన అణువు సౌరమండమును పోలిన ఒక సూక్ష్మ బ్రహ్మాండము. అణు కేంద్రమున ధనాత్మక ఆవేశము పొందిన ప్రోటీ ఉన్నది. దీని చుట్టు ఋణాత్మక ఆ వేశముగల ఎలెక్ట్రార్ విభిన్న కక్షలలో పరిభ్రమిచుచుండును. గ్రహము అన్నియు సూర్యుని చుట్టు తిరుగుచుండుట కిది ఉపమాన మగును. సూర్యునితో గూడ

సమస్త సౌరమండలము ఏదో ఒక సాపేక్ష కేంద్రము చుట్టు తిరుగుచున్న దగును. నిరపేక్షమైన స్థిర కేంద్రమే బ్రహ్మబిందు వగును

బిందు సాధన ప్రక్రియ యోగ శాస్త్రము వలన తెలియదగును.

అస్ఖలిత బ్రహ్మచర్యమే బిందుసాధన. సాత్త్వికాహారము భుజించుచు, మనస్సును ఇంద్రియముల వశము గానీయక భగవచ్చింతనముననే నెలకొన జేయుట, ప్రాణాయామసిద్ధి, సత్సంగము మున్నగువాని వలన సాధంపదగిన దిది. తెక్కిన సిద్ధులకెల్ల ఇది ఆధారమన్ననది అతిశయోక్తికాదు. గృహస్థుడైనప్పుడు భార్యతో మాత్రము మితముగ సంగమించుట కీడు కాదు. అవివాహితులు మాత్రము ఈ విషయమున మనోవికారములకు తావీయక మెలకువతో ప్రవర్తింప వలెను.

## కళ

'కళ' అనగా కిరణము, సూక్ష్మమైన కిరణముల సముహము. మన కండ్లకు కానవచ్చినపురు 'కళ' అనబడును. రూపమును ప్రకాశింపజేసి దృష్టి గోచరము గావించునది 'కళ' ఆప్తి, వ్యాప్తి కళ రెండు విధములగును. ప్రకృతి అణువుల వలన ప్రస్ఫురితమగునది ఆప్తి పురుషుని అంత కాళమునుండి ఆ విర్భవించునది వ్యాప్తి కళ దీనినే 'తేజస్సు'. అందుము అన్ని వస్తువులును పంచభూతసమ్మిశ్రణములే కాన వస్తురూపమును బట్టి అందు ఏ భూతతత్త్వము ఎక్కువగా కలిగి యున్నదో గుర్తింపవచ్చును. వ్యక్తి ముఖమున తేజస్సు లేదా కళ చుట్టు పట్టుననున్న ప్రదేశమును ప్రకాశింపజేయును. మహాత్ముల శిరము చుట్టు తేజః పుంజము

ఆంగ్లేమున ఈ తేజోమండలము 'ఓరా' అనబడును. 'ఓరా'లో ఏర్పడు మార్పులను పరికించి ఆయావ్యక్తులలోని రోగములను గూడ నిర్ణయింపవచ్చునని నవీనవై జ్ఞానికులు పేర్కొనుచున్నారు.

అవతార పురుషంలోను ఈ కళల సంఖ్యను బట్టి వారివారి మహత్వము నిర్ణయింపవచ్చును. పరశురాము నందు మూడు కళలు, శ్రీరామునందు పండ్రెండు కళలు, శ్రీ కృష్ణునందు పదునాలుగుకళ లుండినట్లు పేర్కొనబడుచున్నది. ఈ కళల వల్ల వారలలోని ఆత్మ శక్తి ఆధక్యము తేక్కింపబడును ఈ కళా విద్యలోని నిపుణులగు వారు భూ ప్రదేశమును పరికించి అందులో ఉన్న ధాతువు మున్నగువానిని వాని గుణప్రభావాదులను గుర్తింపగలుగుదురు ఏ వ్యక్తిలో ఏ యే కళలున్నవో వారి శారీరక, మానసిక విశేషములేవో, గుర్తింపగలుగుదురు. అందువల్ల ఎవరితో ఎట్టి నంబంధము ఏర్పఱచుకోవచ్చునో తెలిసికో గలరు. కళావిజ్ఞానమును గుర్తించినవాడు తనలో ఉన్న కళలను గుర్తించి వానిని చక్కగా పెంపొందించుకొన గలడు. లోపించియున్న కళలను వృద్ధి పరుచుకోగలడు.

ఇతర విషయములనుంచి చిత్తమును మరలించి కన్నులు మూసికొని కనుబొమ్మల మధ్య అనగా ఆజ్ఞాచక్రమున ధ్యానమును ఏకాగ్ర మొనర్చినచో మస్తిష్కమున, దాని పరినరములలో రంగురంగుల రేఖలు, మిణుగురులవంటివి కానవచ్చును. ఈ రంగులు పృథివ్యాది తత్త్వము మీద ఆధారపడి ఉండును.

పృధ్వీతత్త్వము పసుపు రంగు గలది. జలతత్త్వము తెలుపు. అగ్నితత్త్వము ఎరుపు. వాముతత్త్వము ఆకుపచ్చ, ఆకాశతత్త్వము నీలము. ఈ రంగులను బట్టి సాధనా కాలమున మనలో ఏతత్త్వము ఎక్కువగా ఉన్నదో తెలిసికోవచ్చును.

పసుపు రంగులో క్షమ గాంభీర్యము, స్థిరత, ఉత్పాదన, భారత్వము, వైభవము, ఉండును. తెల్లని రంగులో రసికత, కోమలత్వము, త్వరగా ప్రభావితమగు గుణము, తృప్తి శీతలత, సౌందర్యము, వృద్ధి, ప్రేమ మున్నగువి ఉండును. ఎఱ్ఱని రంగులో ఉష్ణము, క్రోధము, అసూయ, ద్వేషము, శూరత, అనిష్టత, ఉత్తేజితుడగుట, కాముకత, తేజము, ప్రభావము, కాంతి, స్ఫూర్తి ఉండును. ఆకుపచ్చలో చంచలత, గతిశీలత, వినోద ప్రగతిశీలత, ప్రాణ పోషణము, కల్పన, స్వప్న శీలత, లాఘవము, గర్వము, ధూర్తత, పరివర్తనము మున్నగునవి ఉండును. నీలి రంగులో విచారశీలత, బుద్ధి సూక్ష్మము, సాత్త్వికత, ప్రేరణ, వ్యాపకత, పరిశీలన స్వభావము, ఆకర్షణము మున్నగు గుణములు. డుందును.

జడపదార్థములలోనుండి వెలువడు రంగుల వల్ల సూక్ష్మముగ దోచు ప్రకాశము వల్ల వానితత్త్వము గుర్తింప వచ్చును. ఆత్మిక కళలు మూడు. అవి సత్త్వము, రజస్సు, తమస్సు అనబడును. తమోగుణములకు మధ్య కేంద్రము శివుడు, హిరణ్యాక్షుడు, హిరణ్యాక శిపు రావణుడు మున్నగు రాక్షసులు ఈ తామస కళలను పెంపొందించుకొనిరి. రజోగుణ కళలు విష్ణునందుండి వెలువడును. ఇంద్రుడు, కుబేరుడు, వరుణుడు, బృహస్పతి, అర్జునుడు, భీముడు, కర్ణుడు మున్నగువారలు రజోగుణ కళలను పెంపొందించుకొనిరి, సత్త్వగుణ కళలు బ్రహ్మనుండి ఆవిర్భవించును. వ్యాస, వసిష్ఠ, అత్రిమున్నగు ఋషులు ఈ కళలను పెంపొందించుకొనిరి.

యోగ మార్గమున గ్రంథి భేధనము గావించుకొనుట వలన ఆత్మిక కళలు పెంపపొందును. రుద్ర గ్రంథి బ్రహ్మగ్రంథి వీడినవుడు ఈ గుణములు వృద్ధిపొందగలవు.

సిద్ధ పురుషులలో ఆకాశతత్త్వ కళలు పెంపొందుట వలన వారు ఆశ్చర్యము గొలువు అసాధారణ కార్యములు చేయుటలో నేర్పరులై వెలసిరి. నేడు ప్రజలలో పృథ్వీతత్త్వము ప్రధానమై యున్నది.

ఈ కళలను గుఱించి కులార్ణవతంత్రము

అగ్ని సూర్యేన్దు బ్రహ్మేంద్ర విష్ణు రుద్రు సదాశివైః।
చతుర్వింశతి మంత్రైః స్యాన్మద్య ఇచ్ఛవ పరాకృతమ్॥
అమృతా మానదా పూషా తుష్టిః పుష్టిరతిర్ ధృతిః।
శశినీ చన్ద్రికా కాన్తిర్ జ్యోత్స్నా శ్రీ ప్రీతి రఙ్గదా॥
పూర్ణా పూర్ణామృతా చేతి కథితాః కులనాయికే।
సౌమ్యాః కామప్రదాయిన్యః షోడశ స్వరజాః కలాః॥
తపనీ తాపినీ ధూమా మరీచిర్ జ్వాలినీ రుచిః।
సుషుమ్నా భోగదా విశ్వా రోధినీ ధారిణీ క్షమా।
కమాద్యా వసుదా సౌరాష్ట్రా డాన్తా ద్వాదశీరితాః॥
ధూమాలర్చిరుష్మా జ్వలినీ జ్వాలినీ విస్ఫులింగినీ।
సుశ్రీః సురూపా కపిలా హవ్యకవ్యవహే అపి॥
ఆగ్నేయా యాదివర్ణాద్యా దశ ధర్మ ప్రదాః కలాః।
సృష్టి మేధా స్మృతిర్ బుద్ధిః కాన్తి ర్లక్ష్మీర్ద్యుతిస్ స్థితా।
స్థితిః సిద్ధిరితి ప్రోక్తాః కచవర్గ కలాః దశ।
అకార ప్రభవా బ్రహ్మజాతాః స్యుః సృష్టయే కలాః॥
జరాచ పాలినీ శాన్తి రీశ్వరీ రతికామికే।
వరదా హ్లాదినీ ప్రతి దీర్ఘాః స్యుష్టత వర్గజాః॥
ఉదార ప్రభవా విష్ణుజాతాః స్యుః స్థితయే కలాః।
తీక్ష్ణా రౌద్రీ భయానిద్రా తన్ద్రాక్షుత్ క్రోధినీ క్రియా॥
ఉత్కారో మృత్యు రిత్యుక్తా పయవర్గ కలా దశ।
మకార ప్రభవా సద్రాజాతాః సుహతయే కలాః॥

తాత్పర్యము:- అగ్ని, సూర్యుడు, ఇందు, బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు, రుద్రుడు మున్నగువారలకు చెందిన ఇరువది నాలుగు మంత్రములవల్ల మద్యము పరామృతమగును. అమృతా, మానదా, పూషా, తుష్టి పుష్టి రతి, ధృతి, శశిని, చంద్రికా, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగదా, పూర్ణా, అమృతా అనునవా

మిక్కిలి సౌమ్యములు, కోరికల నెల్ల తీర్పగల స్వరజములు (స్వరాక్షరములవల్ల పుట్టినవి) పదునాఱు, కళలు కలవు. తపినీ, తాపినీ, ధూమా, మరీచీ, జ్వాలినీ, రుచి, సుషుమ్నా, భోగదా, విశ్వా, రోధినీ ధారిణీ క్షమా అనునవికాదిన ధనప్రదములగు కళలు పండ్రెండు పేర్కొనబడినవి. ధూమా, అర్చి, ఉష్మా, జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగినీ, సుశ్రీ, సురూపా, కపిలా, హవ్యకవ్యవహా అనబడు అగ్ని తత్త్వ ప్రధానములగు కళలు పది యకారాది వర్ణముల వలన కలిగినవి. సృష్టి మేధా, స్మృతి, బుద్ధి, కాంతి, లక్ష్మి, ద్యుతి, స్థిరా, స్థితి, సిద్ధి అనునవి పది కళలు క, చ వర్గములవల్ల కలిగినవి. అకారము వలన బ్రహ్మనుండి పుట్టిన కళలు సృష్టికి కారణములైనవి, ఇవి. జరా, పాలినీ, శాంతి, ఈ శ్వరీ, రతి, కామికా, వరదా, ఆహ్లాదినీ, ప్రీతి, దీర్ఘార అనునవి టత వర్గజములు, గ కారప్రభవములు విష్ణువువలన పుట్టినవి పదియు లోకస్థితికై ఏర్పడి యున్నవి. తీక్ష్ణా, రౌద్రీ, భయా, నిద్రా, తంద్రా, క్షుత్, క్రోధినీ క్రియా, ఉత్కారీ, మృత్యు అనునవి ఏ, య వర్గముల వల్లతోచినవి. మకార ప్రభవములగు ఇవి సంహార క్రియకై ఏర్పడినవి.

(స్వయంభువు నుండి సృష్టి ప్రారంభమున వాక్కుతోచి అందుండి సమస్త తత్త్వములు తోచినవి సృష్టి స్థితి, సంహారక్రియలకు అనుకూలముగతోచినవి. ఈ కళలు. ఇవి అక్షర రూపమున బ్రహ్మమునందుండి ప్రకాశస్థితిలో క్రియా శీరములగును) యంత్రములలో దేవతలకు ప్రాణ ప్రతిష్ఠ చేయునపుడు ఈ కళలు బీజాక్షరములతో న్యాసముచేయబడుచున్నవి.

ఈ కళలను బీజాక్షరములతో మన శరీరమున న్యాసము చేసి కొని ఆయాశక్తులను పెంపొందించుకొను విధానము తాంత్రిక మతమున ఆచరణలో ఉన్నది. ఆవిధము సంగ్రహముగ నిది పేర్కొనబడుచున్నది.

1. పృథ్వీతత్త్వము:- దీనికి మూలాధారము స్థానము. ఇక్కడ సుషుమ్నానాడి ప్రారంభమగును. భూలోకమునకు ఇది ప్రతినిధి తామరవంటి ఆకారము కలది. చతుష్కోణాకృతి కలది. పసుపు వన్నె కలది. దీని గుణము గంధము. జ్ఞానేంద్రయమునాసిక. కర్మేంద్రియము గుదము. మూలాధార చక్రమున పృథివీ తత్త్వధ్యానము వలన రోగము శాంతించును.

ఉషః కాలమున శరీరమును శుద్ధము చేసికొని ఏకాంత ప్రదేశమున పద్మాసనమున కూర్చుండవలయును. నాసికాగ్రమున దృష్టినిలిపి మూలాధారచక్రమున పసుపు వన్నెకల పృథ్వీ తత్త్వమున మనస్సును కేంద్రీకరింప జేసి ధ్యానము చేయవలెను. లకారబీజాక్షరమును స్మరింపవలెను. ఇట్లు ధ్యానము చేయుకొలది ముక్కునకు ఒక విధమైన సుగంధము అనుభవగోచరమగును పృథివీ తత్త్వము యొక్క గుణములను ధ్యానసమయమున జ్ఞాపకము చేసి కోవలెను. దీని వలన శరీరము మిక్కిలి కాంతి కల దగను.

జలతత్త్వము:- మూత్రాశయము అడుగు భాగము స్వాధిష్ఠాన మను చక్రమునకు నెలవు. ఇది జలతత్త్వము కలది. ఇది భువర్లోకమునకు ప్రతినిధి. అర్ధచంద్రాకృతి, తెలుపు రంగు కలది. రసములు దీని గుణమగును. తీపు, కారము, పులుపు, చేదు మున్నగురుచులు ఈ తత్త్వము వలననే ఏర్పడును. నాలుక దీనికి జ్ఞానేంద్రియము. కర్మేంద్రియము లింగము ఆసనమున కూర్చుండి వకారబీజాక్షరమును స్మరించుచు మనస్సును ఈ చక్రమున కేంద్రీకరింప చేసి ధ్యానము చేయవలెను దీనివలన సహస శక్తి వృద్ధి పొందును. ఆకలిదప్పులు బాధింపవు.

అగ్ని తత్త్వము:- నాభిస్థానమున గల మణీ పూరకము అగ్ని తత్త్వమునకు నెలవు. ఇది స్వర్లోకమునకు ప్రతినిధి, ఎఱుపురంగు త్రికోణా కృతి కలది. రూపము దీని గుణము. దీనికి క్రోధము మున్నగు మానసిక వికారములును కామవికారమును దీని వికృతి వలన కలుగును మనస్సును దీని పై కేంద్ర కరించి

'ర' బీజాక్షరమును జపింప వలెను. అందువలన అజీర్ణము మున్నగు ఉదర వికారములు తొలగును కుండలినీ శక్తిని మేలుకొలుపుటకు ఈ సాధమ ఉపకరించును.

వాయు తత్త్వము:- హృదయ స్థానమున గల అనాహత చక్రము దీనికి నెలవు. మహర్లోకమునకు ఇది ప్రతినిధి. రంగు ఆకుపచ్చ షట్కోణాకారము కలది. గోళాకారమునను ఉండును. స్పర్శము దీని గుణము. జ్ఞానేంద్రియము శరీరము మీది చర్మము. చేయి కర్మేంద్రియము.

'య' అను బీజాక్షరమును జపించుచు మనస్సును ఈ చక్రమున కేంద్రీకరింపజేసి ధ్యానింపవలెను. దీనివలన శరీరము మనస్సు తేలికయగును.

ఆకాశ తత్త్వము:- విశుద్ధ చక్రము దీని నెలవు. కంఠస్థానమున కల ఈ చక్రము జనోలోకమునకు ప్రతినిధి. కోడి గ్రుడ్డు ఆకారమున లేలిరంగుకలది. 'హ' బీజాక్షరము, నియమ ప్రకారము మనస్సును ఇందు కేంద్రీకరించి సాధన చేసిన యెడల పలు సిద్ధులు పొందవచ్చును. సాధకుడు మూడు కాలములను గుఱించిన జ్ఞానము కలవా డగును. విడువక ఆఱు నెలల కాలము ఈ పంచతత్త్వ సాధన నభ్యాసము చేసిన తర్వాత మార్గము సుగడుమగును. కొంత కాలమునకు శరీరమున కళలు చక్కగా పెంపొంది దైవ శక్తి సంపన్నమై శరీరము తేజస్సుతో ప్రకాశించువి యేగాక సాధకుడు దైవికాంశము కలవాడై సర్వ సిద్ధులను సులభముగా హస్తగతము చేసికొనును.

యంత్రములలో దేవతా ప్రాణ ప్రతిష్ఠ చేయుటలో ఈ కళల న్యాసము ముఖ్యత్వము వహించు చున్నది. కళలను పంపొందించుకొని తన శరీరమందు యంత్రస్థ దేవతా కళలను న్యాసము చేసి కొని యంత్ర దైవమునకు చెందిన మంత్రమును జపించులువలన సాధకుడు పరిపూర్ణమున ఆ యంత్ర దేవతానుగ్రహమునకు పాత్రుడగును.

జ్ఞానము, శక్తి మున్నగువానికి ప్రత్యేకమగు రూపము లేదు. ్యలోకములో. అవి రూపము లేకయే సంకల్పమాత్రమున ూకరణ సామర్థ్యము పొంది యుండును. దీనికి ఒక నిదర్శనము ొ్కొనదగును. నీటిలో విద్యుత్తు ఉన్నది. అయినను దానిని ాశపఱచి దీపముగానో, యంత్రము నడపుటకు తగిన గానో చేయ 'పరికరములు ఆవశ్యకములై యున్నవి. కాని ుమండలమున జనించు విద్యుత్తు కృత్రిమ సాధనమేదియు లేకయే ఎసి కాంతినిచ్చుట, పిడుగుగా గొప్పశక్తిని వెలిబుచ్చుట ాచుచున్నాము. అట్లే భగవంతుడు తానై క్రియా శీలుడయినప్పుడు ని సంకల్పమే చాలును. అయితే మనము అతని అనుగ్రహమును ందవలయునన్న దానికి భౌతిక పరికరములు కావలసియున్నవి. ్టి పరకరములలో భగవంతునకు మూర్తికల్పనము మొదటిది. ాగా భగవంతుడు తనయనుగ్రహమును సాధించుటకు మనకై ను పలు రూపముల ధరించుచున్నాడు.

మంత్రద్రష్టలగు మహర్షులు తాము యోగశక్తివలన కనుగొన్న ంత్రములను త్రికరణముల నైక్యపరచి తన్మయులై ధ్యానించునపుడు రికి మంత్రోద్దిష్ట దైవతత్త్వము ఏ రూపముతో సాక్షాత్కారమయ్యెనో ివ్య స్వరూపమునే ధ్యాన శ్లోకముల రూపమున వారు వర్ణించి ున్నారు. అనగా మంత్రమే దివ్యరూపము దాల్చినదన్నమాట. ున ప్రతి మంత్రజపమునకు ప్రారంభమున ఆ మంత్ర మూర్తిని ్యనించి, మంత్ర జపము ముగియు వఱకు మనస్సున ఆ మూర్తిని ుపుకొను విధానమును పూర్వులు ఏర్పరచి ఉన్నారు. ఈ ుయమును ధ్రువ పరచుటకై ఒకటి రెండు నిదర్శనము లిచ్చుట ర్కొనుట యుక్తము.

ఉత్తర ప్రదేశమున సుప్రసిద్ధ తాంత్రిక ప్రవీణులు చమన్‌లాల్ ౌతమ్ గారు తమ 'తంత్రమహా విజ్ఞాన్' అను పుస్తకమున నీ ంది విషయమును పేర్కొని యున్నారు.

''వైవట్స్ హ్యూజ్'' అను విదేశీయ పరిశోధకురాలు ధ్వని తరంగములను గురించి తీవ్ర పరిశోధనలు సలిపి 'వాయిస్ ఫిగర్స్' అను పుస్తకమును రచించి యున్నది. అందు 'ఇడోఫోర్' అనబడు సంగీత వాద్యమును క్రమ పద్ధతిలో వాయించినచో పుష్పముల, వివిధ జంతువుల ఆకృతులను చిత్రింపవచ్చునని ప్రయోగాత్మకముగా ధ్రువపరచినది. సన్నని తీగకు చాక్‌పీసువంటి దానిని బంధించి ధ్వని తరంగములు దానిమీద ప్రసరించునట్లు చేసిన అది వివిధ చిత్రములను బల్లమీద రూపొందించును.

మేడమ్ ఫిక్‌లాంగ్ అనునామె ఒకవిధమైన వీణను తయారుచేసినదట. ఆ వీణకు క్రింది భాగమున సన్నని తీగను బంధించి దాని మరొక కొనకు చాక్‌పీసును బంధించి వీణను వాయించిన ఆ ధ్వని తరంగములకు సుద్దముక్క కదలి రూపచిత్రణము గావింపగలదని ధ్రువపరచినదట. ఒకప్పుడు ఆమె ఒక రోమన్ కాథలిక్ గాయకునివలన భక్తిగీతము పాడింపగా ఆ ధ్వనికి బల్లమీదనొక స్త్రీయు ఆమెయొడిలో ఒక బాలుడును చిత్రమున గానవచ్చిరట. ఆ ప్రాంతమున చదువుకొనుచున్న వంగదేశపు విద్యార్థిని బిలిచి ఏదైన దైవస్తోత్రము చదువుమనగా ఆతడు ''కాలభైరవాష్టకము'ను బిగ్గరగా చదివెను. ఆ ధ్వనితరంగములకు నల్లబల్లమీద ఒక భయంకర స్వరూపము దాల్చిన మూర్తి, అతనివెంటనొక కుక్క చిత్రము ఏర్పడినవట''.

ముక్తానంద స్వామివారు తమ 'చిచ్ఛక్తి విలాసము'ను★ గ్రంథమున మంత్రమును తన్మయముతో జపించునపుడు మనస్సున సాక్షాత్కరించు దృశ్యములను, భగవద్రూపమును గురించి వివరించి యున్నారు.

---

1. ఈ గ్రంథకర్త సుమారు ఇరువదైదేండ్లకు మునుపు ఒక మిత్రుని కోరికపై హిందీ భాషలోని ఈ గ్రంథమును తెలుగున ననువాదమొనర్చి యిచ్చెను. తరువాత అదియేమయ్యెనో తెలియరాదు.

కాన ధ్యాన శ్లోకముల అర్థమును అవగతమొనర్చుకొని మంత్ర జపము చేయునపుడు ఆ మూర్తివిధ్యానమొనర్చుట ఫలసిద్ధికి ఆవశ్యకము కాగలదు.

పలు ఆమ్నాయములలో పలువిధముల మృత్యుంజయ స్వరూప ధ్యానము ఆయా యుపాసనా విధానములకు అనుగుణముగా నిర్ణయింపబడి యున్నది.

తంత్ర శాస్త్రములలో పదిదిశల ననుసరించి పది ఆమ్నాయములున్నవి. వానిలో పరమశివుని ఆఱు ముఖముల ననుసరించి ఆఱు ఆమ్నాయములు కలిగినవి. వీనిలో పూర్వ, పశ్చిమ, ఉత్తర, దక్షిణ, ఊర్ధ్వ ఆమ్నాయములైదింటిని వైదిక మతావలంబకులు అంగీకరించిరి. ఆఱవదైన అధరామ్నాయాన్ని వైదికమతమును అనుసరించువారు అంగీకరింపరు. తక్కిన నాలుగులో పూర్వోత్తరములు చేరి ఈశానామ్నాయము, పూర్వదక్షిణములుచేరి ఆగ్నేయామ్నాయము, దక్షిణ పశ్చిమములు చేరి నైరృతి ఆమ్నాయము, పశ్చిమోత్తరములు చేరి వాయవ్యామ్నాయము అగును. వీనిలోని ధ్యాన శ్లోకములు :-

**శారదాతిలక మందలి శ్లోకము :-**

*చంద్రార్కాగ్ని విలోచనం స్మితముఖం పద్మద్వయాన్తః స్థితం*
*ముద్రాపాశ మృగాక్షసూత్ర విలసత్పాణిం హిమాంశుప్రభమ్ ।*
*కోటీరేన్దుగళత్సుధాప్లుతతనుం హారాదిభూషోజ్జ్వలం*
*కాన్త్యావిశ్వ విమోహనం పశుపతిం మృత్యుఞ్జయంభావయే ॥*

చంద్రుడు, అగ్ని, సూర్యుడును తన మూడు కన్నులుగ గలవాడు, ప్రసన్న ముఖము కలవాడు, తామలరమీద వెలసినవాడు, ముద్ర పాశము - మృగము - అక్షమాల అనువానిని నాలుగు చేతులలో ధరించినవాడు, చంద్రునివంటి వన్నెకలవాడు, మస్తకమున

ఒప్పు శరీరము కలవాడు, హారాది ఆభరణములతో దేదీవ్య మానముగా ప్రకాశించుచున్నవాడు, తన కాంతిచేత విశ్వములనెల్ల మోహింపజేయు చున్నవాడునైన మృత్యుంజయుని పశుపతిని మనస్సున ధ్యానించుచున్నాను.

ఇందులో కమలాసనము ఆనందాత్మక శక్తికిని, అభయముద్ర ప్రాణశక్తికిని, పాశము దండించుటలోగల సామర్థ్యమునకును, మృగము వేదవిద్యను మాల శబ్దాత్మక స్ఫోటకమునకు ప్రతీకలు

అచ్ఛస్వచ్ఛారవిన్ద స్థితిరుభయ కరాజ్యస్థితం పూర్ణకుమ్భం
ద్వాభ్యాం వేదాక్షమాలే నిజకరకమలాభ్యాం ఘటేనిత్యపూర్ణో ।
ద్వాభ్యాంతాచస్రవన్తౌ శిరసి శశికలాబన్ధురే ప్లావయన్తౌ
దేహం దేవోదధానం ప్రదిశతు వివదాకల్పజాలః క్రియంనః ॥

హస్తాభ్యాం కలశద్వయామృతరసై రాప్లావయన్తం శిరో
ద్వాబ్యాం తాదధతం మృగాక్షీవలయే ద్వాభ్యాంవహన్తం వరమ్
అఙ్కన్యస్త కరామృతద్వయఘటం కైలాసకాన్తం శివం
స్వచ్ఛామ్భోజ గతం నవేన్దు మకుటం దేవం త్రినేత్రం భజే॥

ఈ శ్లోకములలో రెండు చేతులలో అమృత ఘటములను శిరస్సున అమృతధారలు కురియుచున్న వానిని ధరించి మరిరెండు చేతులలో మృగమును అక్షమాలను ధరించి స్వచ్ఛమైన కైలాస పర్వతమువలె మెరయు శరీరముతో నొప్పు మృత్యుంజయుడు ఆఱుభుజములు గలవాడుగ వర్ణింపబడినాడు.

అమృతరుద్ర ధ్యానము :-

స్ఫటికనలిక సంస్థం మౌళిబద్ధేన్దురేఖా
గళదమృతసార్ద్రం చన్ద్రవహ్న్యర్క నేత్రమ్
స్వకరకలితముద్రావేద పాశాక్షమాలం
స్ఫటికరజతముక్తాగౌరమీశం నమామి ॥

మృత్యుంజయ శతాక్షరీ మంత్రములో బ్రహ్మ విష్ణు శివ మంత్రములు మూడును సమ్మిళితములై యున్నవి. ఈ మంత్రము ఆయుస్సును పెంచుటలో మిక్కిలి శక్తివంతమైనది. ఆ మంత్రమునకు ఉపయుక్తమగు ధ్యాన శ్లోకము:-

*హేమామ్భోజే నిషణ్ణం స్రవదమృతఘటౌ చక్రశఙ్ఖౌ కరాబ్జైః*
*రక్షస్రక్కుణ్డికే కాఞ్చీ శశికలధరం ధారయుక్తం సుభూషమ్,*
*హేమాభం పీతవస్త్రం రవిశశి దహన త్రీక్షణం చిత్స్వరూపం*
*సర్వజ్ఞఆ సర్వగం తం విధిహరిహరజం విశ్వరూపం నమామి॥*

మంత్రమయ మృత్యుంజయ స్వరూప ధ్యానశ్లోకము :-

*ప్రణవ రచితనాళం మన్త్ర మధ్యార్ణ పత్రం*
*భృగువిలసితమధ్యం పత్రయుగ్మం తదన్తః ।*
*కృతవసతిముమేశం వర్ణనిర్యత్ సుధార్ద్రం*
*కలయతుహృది నిత్యం సర్వదుఃఖ ప్రశాన్త్యమ్ ॥*

ఇందులో ఓంకారము నాళము మధ్య పత్రము మధ్య భాగము 'సః' అను బీజాక్షరముతో కూడినది, ఇట్లు మరి రెండు దళములలో లఘుమృత్యుంజయ బీజాక్షరములు, మరొక పత్రముమీద మహేశ్వరుడు నెలకొని యున్నట్లు ధ్యానింపబడుచున్నాడు.

## మృత్యుంజయ మన్త్రార్థము

అర్థము తెలియక పోయినను వేదమంత్రములు జపము చేసిన మాత్రమున ఫలము నిచ్చునని కొందరందురు. అయితే మంత్రోచ్చారణలో స్వరము తప్పరాదు. స్వరము తప్పినచో మంత్రార్థములు విపరీతములై మంచికి మాఱు కీడు కలిగించును.

అర్థము తెలిసిననే ఉచ్చారణలో తప్పులు దొరలకుండ పలుకుట సాధ్యమగునని కొందరందురు.

శౌనకమహర్షి తన 'బృహద్దేవతా' అను గ్రంథములో

*నహికశ్చిదవిజ్ఞాయ యాథాతథ్యేన దైవతమ్ ।*
*లౌక్యానాంవైదికానాంవా కర్మణాం ఫలమశ్నుతే ॥*

''మంత్రమునకు సంబంధించిన దైవతమును గురించిన జ్ఞానములేక చేసిన లౌకిక వైదిక సంస్కారములు ఫలము నీయవు అని పేర్కొనెను.''

మంత్రార్థమును తెలుసుకున్ననే ఉద్దిష్ట దేవతను గుఱించిన జ్ఞానము కలుగును. కాన మృత్యుంజయ మంత్రార్థమును పరికింతము యజుర్వేద సంహితలోని మృత్యుంజయ మన్త్రము.

*త్ర్యంబకం యజామహే, సుగన్ధింపుష్టి వర్ధనమ్ ।*
*ఉర్వారుకమివబన్ధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥*

వైదిక మంత్రము లన్నింటికి స్థూలము, సూక్ష్మము, పరము అని మూడు విధములుగ అర్థము గ్రహింపవలెను. పదముల చేరిక వలన ఏర్పడు అర్థము స్థూలము, ఆ అర్థమును పర్యాలోచించినపుడు ఏర్పడు అర్థము సూక్ష్మము. ప్రత్యేక అక్షరముల వల్ల తెలియదగిన అర్థము పరార్థము. స్థూలార్థమును ఆధిభౌతికమని, సూక్ష్మార్థమును ఆధ్యాత్మికమని, పరార్థమును ఆధిదైవికమని పేర్కొనుట కలదు. (వీనిని గుఱించిన వివరములు తెలియగోరువారు ''వేద విజ్ఞానము'' అను గ్రంథమును పరికింపదగును.)

అహిర్బుధ్న్య సంప్రదాయ ప్రకారము 'త్ర్యంబక' శబ్దమునకు తిస్రః అమ్బికాః (మాతరః) యస్య సః ఎవనికి ముగ్గురు మాతలు కలరో అతడు, త్ర్యంబకుడు. అనగా ఇచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తి అనే మూడు శక్తులు విశ్వసృష్టికి ఉపయోగపడునవి కనుక మాతలనబడినవి. ఈ మూడు శక్తులును ఎవనికి వశపడియున్నవో అతడు త్ర్యంబకుడు.

వరుసగా గాయత్రీచ్ఛందము, త్రిష్టుప్ ఛందము, జగతీచ్ఛందము అను నీ మూడును ఈ మూడు శక్తులకు చెందును. పురాణములు ఈ క్రియాశక్తినే అర్థశక్తిగా అభివర్ణించినవి. కణాద మహర్షి వీటిని జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము అని పేర్కొనెను.

పురాణములు త్ర్యంబక శబ్దమునకు సూర్య చంద్రాగ్నులను మూడు నేత్రములను అర్థమును అభివర్ణించినవి.

సాంఖ్యమత స్థాపకుడగు, కపిలుడు సత్త్వ, రజస్తమస్సులు అను ఈ మూడింటిని కన్నులుగా పేర్కొనెను.

యాజ్ఞికులు (యజ్ఞములుచేయువారు) పృథ్వి, అంతరిక్షము, ద్యులోకము అనునవి మూడు కన్ను లనిరి.

కుమారిలభట్టు తన తంత్ర వార్తికమున

*విశుద్ధ జ్ఞాన దేహాయ త్రివేదీ దివ్య చక్షుషే ।*
*శ్రేయః ప్రాప్తి నిమిత్తాయ నమః సోమార్ధధారిణే ॥*

అని మూడు వేదములు కన్నులనెను.

జ్యోతిషశాస్త్రమున భూత భవిష్యద్వర్త మానములు మహాకాలుని నేత్రము లగును.

వేదాంతులు చిత్, అహంకారము, బుద్ధి అనువానిని మూడు కన్ను లందురు. యోగులు అ-ఉ-మ అను ప్రణవాక్షరములు మూడింటిని మూడు కన్ను లందురు.

**'సుగంధిమ్'** - ఎవడు తనతేజముచేత అన్ని తత్త్వములను ఆయా వస్తువుల స్వస్వరూపమున నెలకొనజేయునో అతడు అనగా అన్నిటిలోను ప్రవేశించి సుగంధమయము అనగా ఆకారము పొందునట్లు చేయునో అతడు (సుగంధ వస్తువు పుష్టి నిచ్చునని, పుష్పధారణవల్ల ఆరోగ్యము, శరీరపుష్టి కలుగునని శాస్త్ర వచనము కలదు).

**'పుష్టివర్ధనమ్'** లక్ష్మీ ప్రదుడని ఆనందార్ణవ తంత్రమున కలదు. 'పుష్టి లక్ష్మీ స్వరూపిణీ' అని ప్రమాణము. సూక్ష్మావస్థలో ఉన్న దానిని పెంపొందజేసి వివిధ రూపముల పరిణమింప జేయువాడు అనుట-

**'యజామహే'** త్ర్యంబకుడైన పరమాత్మకు తమ్ము తామే సమర్పించుకొను చున్నా మనుట. అతనితో విడదీయరాని సంబంధము కల్పించుకొను చున్నా మనుట. 'యజ్' అను ధాతువునకు ఏదైన నొక దేవతనుద్దేశించి ద్రవ్యమును (వస్తువును) త్యాగము చేయుట అని అర్థము.

'యజ్' దేవ పూజా సఙ్గతి ''కరణదానేషు'' అని ప్రమాణము. స్థూల ద్రవ్యము మూలమున అధ్యాత్మ శక్తులకు ఆధిదైవిక శక్తులతో సంబంధమును నెలకొల్పుట' అని మీమాంసకులు 'యజ్' అనుదానికి అర్థము నిర్వచింతురు.

ఉర్వారుక మివమృత్యోర్బన్ధనాత్ ముక్షీయ దోసపండు తన తీగనుండి ఎట్లు ఏ శ్రమయులేక సులభముగ వేఱుగా విడిపోవుచున్నదో అదే విధముగ మృత్యుబంధము నుండి (మృత్యుంజయ స్వామీ!) నన్ను విడిపింపుము. అని మంత్రార్థము.

వేదములందు పేర్కొనబడిన నూఱు విధముల రోగములనుండి, అష్టవిధ అజ్ఞాన భూమికలనుండి నన్ను విడిపింపుమని భావము.

ఇక్కడ మృత్యువు అను శబ్దము అజ్ఞానము, శరీరము నుండి ప్రాణముల విడదీయు శక్తి, బంధనమగు సంసారము అను మూడు విధములగు అర్థములందు ప్రయోగింపబడినది.

మతిం-జ్ఞానం త్యజతి అనేక ఇతి-మృత్యుః-

(దీనివలన జ్ఞానమును, మతిని వదలుచున్నాడు గనుక మృత్యువు' అని వ్యుత్పత్తి. ''సన్తాన రూపత్వాన్మృత్యుః సంసార

ఉచ్యతే'' అని సంసారమును మృత్యువగును. కాగా ఈ మంత్రము జీవునకు అనాదిగా పరమాత్మతో ఉన్న బంధమును స్థిరపరచి ఆత్మకు పరమ కల్యాణ స్థితిని చేకూర్చవలెనన్న ప్రార్థనము చేయుటను సూచించు చున్నది.

ఈ మంత్రములో 'పుష్టివర్ధనమ్' అనుటకు బదులు 'పతి వేదనమ్' అనియు, 'మృత్యోర్ముక్షీయ' అనుచోట 'ఇతోముక్షీయ మామృతు'' అనియు పాఠముగల వేఱొక మృత్యుంజయ మంత్రము ఈ పట్టున పేర్కొనబడి యున్నది. అది వివాహము ఆలస్యమైనచో కన్యలకు తగిన వరుడు లభించుటకై జపింపతగిన మంత్ర మగును.

(అప్రాకృత) స్వయంభూమండలమున గలిగిన ఆకాశభూత గుణముగా దోచిన అక్షరములు దివ్యశక్తి సంపన్నములు. పార్థివ అణువునందును, జలబిందువునందును, అనంత శక్తి ఇమిడి ఉన్నట్లే తక్కిన భూతముల అంశములందును విశేష శక్తి అంతర్గుప్తమై యున్నది. విధ్యుక్తముగా అక్షరమును ఉచ్చరించుటవల్ల ఆ తేజము ప్రకాశవంతమై అంకుశములవలె సిద్ధపురుషుని శరీరమునుండి వెలువడి వ్యాపించి లక్ష్యమును. సాధకుని దగ్గరకు ఆకర్షించుకొని వచ్చును. మృత్యుంజయ మంత్రము సుగంధము, పుష్టి, అమరత్వమును అనుగ్రహించి వికృతి, దుర్బలత్వము, అకాలమరణము అనువానిని తొలగించును.

వసిష్ఠ మహర్షి మతమున ప్రతిమంత్రములోని ప్రతి అక్షరమునకు, పదమునకు, వాక్యమునకు, శ్లోక పాదమునకు, సగము శ్లోకమునకు, పూర్తి శ్లోకమునకునని ఆఱు విధముల అర్థములు గ్రహింపదగును. ఆ పద్ధతిననుసరించి ఈ మంత్రార్థములు వివరింపబడుచున్నవి.

## అక్షరార్థము

మృత్యుంజయ మంత్రమున ఒక సిద్ధాంతము ననుసరించి ముప్పది మూడక్షరములు, మఱొక సిద్ధాంతము ననుసరించి ముప్పది రెండక్షరములు నున్నవి.

భగవంతుని శరీరము విశ్వము. విశ్వమున గల ప్రతివస్తువు అతనికి శరీరమే. ప్రతి జీవమును అతని రూపమే. అతడు అంతర్యామిగా నెలకొని అన్నింటిని వానివాని కర్మములకు దగినట్లు ప్రవర్తింపజేయు చున్నాడు. భగవంతుని శరీరములోని ప్రతియణువు దివ్య శక్తి సంపన్నము. శబ్దమును అతని రూపమే. భగవంతుని శరీరావయవములు ప్రత్యేకముగ ఒక్కొక్కటియు దైవ స్వరూపమే. అట్లే శబ్ద బ్రహ్మము యొక్క యొక్కొక్క అంగమును ఒక్కొక్క ధ్వనిగా వెలసియున్నది. కాన ఒక్కొక్క అక్షరము ఒక్కొక్క దైవమునకు ప్రతీక. మానవ శరీరమందును విశ్వ శరీరములోని దేవతల సూక్ష్మాంశములే ఉండి శక్తినిచ్చి ఆయా అవయవములు చక్కగా క్రియాశీలములగునట్లు చేయుచున్నవి. కాన సర్వ దేవతలకు ప్రతీకలుగానున్న ముప్పది మూడక్షరముల మంత్రమును నియమప్రకారము జపించుటవలన సర్వదేవతాధ్యక్షుడగు మృత్యుంజయుని అనుగ్రహమువలన ఆయాదేవతలు మన శరీరమును శక్తి పుష్టికలిగి యుండునట్లు చేయుదురు అనుట గుర్తింపదగును.

వసువు లెనమండ్రు, రుద్రులు పదునొకండుగురు, ఆదిత్యులు పన్నిద్దరు ప్రజాపతియొక్కడు, వషట్కార మొక్కటి కలిసి ముప్పది ముగ్గురు దేవత లైరి. ఈ దేవతల గురించిన మరికొన్ని విశేషములు 'వేదవిజ్ఞానము'న తెలియనగును.

| | | |
|---|---|---|
| 1. 'త్రి' | ధ్రువవసువు (ప్రాణము) | శిరము (స్థానము) |
| 2. 'యం' | అధ్వరవసువు (ప్రాణము) | ముఖము (స్థానము) |
| 3. 'బ' | సోమవసువు (శక్తి) | కుడిచెవి (స్థానము) |
| 4. 'కమ్' | జలవసువు (దేవత) | ఎడమచెవి (స్థానము) |
| 5. 'య' | వాయువు (దేవత) | కుడిబాహువు (స్థానము) |

| | | | |
|---|---|---|---|
| 6. | 'జా' | అగ్ని | ఎడమబాహువు (స్థానము) |
| 7. | 'మ' | ప్రత్యూషవసువు | దక్షిణబాహు మధ్యము |
| 8. | 'హే' | ప్రయాస వసువు | మణిమంధము మధ్యము |
| 9. | 'సు' | వీరభద్ర రుద్రుడు (ప్రాణము) | కుడిచేతి వ్రేళ్ళమొదలు |
| 10. | 'గ' | శంభురుద్రుడు | కుడిచేతి వ్రేళ్ళకొనలు |
| 11. | 'న్ధిమ్' | గిరీశరుద్రుడు | వామబాహు మూలము |
| 12. | 'పు' | అజైకపాత్ రుద్రుడు (శక్తి) | వామహస్తమధ్యము |
| 13. | 'ష్టి' | అహిర్బుధ్న్య రుద్రుడు | వామహస్తమణిబంధము |
| 14. | 'వ' | పినాకీ రుద్రుడు | వామహస్తాంగుళమూలము |
| 15. | 'ర్ధ' | భవానీశ్వర రుద్రుడు | వామహస్తాంగుళ్యగ్రము |
| 16. | 'నమ్' | కపాలిరుద్రుడు | దక్షిణ ఊరుమూలము |
| 17. | 'ఉ' | దిక్పతిరుద్రుడు | దక్షిణ జానువు |
| 18. | 'ర్వా' | స్థాణురుద్రుడు | దక్షిణ గుల్ఫము |
| 19. | 'రు' | భర్గరుద్రుడు | దక్షిణ పాదాంగుళి మూలము |
| 20. | 'క' | ఆదిత్యుడు (ధాత) | దక్షిణపాదాంగుళ్యగ్రము |
| 21. | 'మి' | ఆదిత్యుడు (అర్యమా) | వామ ఊరుమూలము |
| 22. | 'వ' | ఆదిత్యుడు, (మిత్రుడు) | వామజానువు |
| 23. | 'బ' | ఆదిత్యుడు, (వరణుడు) | వామగుల్ఫము |

| | | | |
|---|---|---|---|
| 24. | 'ష్ఠ' | ఆదిత్యుడు (అంశువు) | వామపాదాంగుళి మూలము |
| 25. | 'నాత్' | ఆదిత్యుడు, (భర్గుడు) | వామపాదాంగుళ్యగ్రము |
| 26. | 'మృ' | ఆదిత్యుడు, (వివస్వాన్) | దక్షిణ పార్శ్వము |
| 27. | 'త్యోః' | ఆదిత్యుడు (ఇంద్రుడు) | వామపార్శ్వము |
| 28. | 'ము' | ఆదిత్యుడు (పూషా) | పృష్ఠము |
| 29. | 'క్షీ' | ఆదిత్యుడు (పర్జన్యుడు) | నాభి |
| 30. | 'య' | ఆదిత్యుడు (త్వష్టా) (శక్తి) | గుహ్యము |
| 31. | 'మా' | ఆదిత్యుడు (విష్ణువు) | శక్తి రెండు భుజములు |
| 32. | 'మృ' | ప్రజాపతి (పాణము) | హృదయము కంఠము |
| 33. | 'తాత్' | | |

వషట్కారము

తాంత్రిక గ్రంథములు కొన్నింటిలో ముప్పదిరెండు అక్షరములకు శక్తిరూప వివరణము కలదు. దాని వివరము :-

1. 'త్ర్యం' త్రినేత్రశక్తితో కూడిన త్ర్యక్షీశుడు - శిఖ (స్థానము)
2. 'బ' ప్రభేదినీ శక్తితో కూడిన బాలార్కతేజుడు - శిరము
3. 'కమ్' కల్యాణీశక్తితో కూడిన కాలానన్తేశుడు - లలాటము
4. 'య' యజ్ఞరూపశక్తితో కూడిన విఘ్నేశ్వరుడు - భ్రూ మండలము
5. 'జా' జ్వాలాముఖీ శక్తితోకూడిన మహాదేవేశుడు - నేత్రయుగళము
6. 'య' మహాశక్తితోకూడిన మహాదేవేశుడు కర్ణయుగళము

7. 'హే' హైమవతితోకూడిన హాకినీశుడు - నాసికాద్వారములు
8. 'సు' సుగంధియను శక్తితోకూడిన - సుగంధేశుడు కపాలము
9. 'గ' గంభీరాశక్తితోకూడిన గంధేశుడు - పై పెదవి
10. 'న్ధిమ్' ధీరాశక్తితో కూడిన మహేశుడు (ప్రాణము) - క్రింది పెదవి
11. 'పు' పూర్ణాశక్తితోకూడిన పుండరీకాక్షేశుడు - పైపలు వరుస
12. 'ష్టి' అధిష్ఠాన శక్తితోకూడిన అధిష్ఠేశుడు - క్రిందిపలు వరుస
13. 'వ' వరేణ్యాశక్తితో కూడిన వరిష్ఠేశుడు - హనుయుగళము
14. 'ర్ధ' ధర్మాశక్తితోకూడిన ధర్మేశుడు - చిబుకము
15. 'నమ్' నందినీశక్తితో కూడిన నందీశుడు - నోరు
16. 'ఉ' ఉమాశక్తితోకూడిన బుద్ధీశుడు - కంఠము
17. 'ర్వా' వామాశక్తితో కూడిన వరుణేశుడు - మూపులు
18. 'రు' రూపపాశక్తితో కూడిన రుద్రేశుడు - భుజయుగము
19. 'క' కాన్తి శక్తితోకూడిన కాంతీశుడు - హృదయము
20. 'మి' శివాశక్తితోకూడిన మీఢుష్టమేశుడు - హృదయము
21. 'వ' వరగర్భాశక్తితో కూడిన వదేశుడు - స్తనమండలము
22. 'బం' బంధినీ శక్తితోకూడిన బంధినీశుడు - హృదయము
23. 'ధ' ధనుష్మతీ శక్తితోకూడిన ధన్వీశుడు - నాభి
24. 'నాత్' పుష్టి శక్తితోకూడిన నాకేశ్వరుడు - నడుము
25. 'మృ' మృత్యునాశినీ శక్తితోకూడిన మృత్యుంజయేశుడు గుహ్యము
26. 'త్యో': నిత్యాశక్తితో కూడిన నిత్యేశుడు - వాయువు
27. 'ము' ముకున్దాశక్తితో కూడిన ముక్తీశుడు - పార్శ్వములు
28. 'క్షీ' క్షేమకరీశక్తితోకూడిన క్షితీశుడు - ఊరుమండలము
29. 'య' మంత్రభేదినీ శక్తితో కూడిన యోగేశుడు - గుల్ఫము
30. 'మా' మంత్రభేదినీ శక్తితోకూడిన మంత్రేశుడు - పాదతలము
31. 'మృ' క్షమాశక్తితోకూడిన అమృతేశుడు - మీగాళ్ళు
32. 'తాత్' తన్వీశాశక్తితో కూడిన తన్వీశుడు - పాదములు

## మృత్యుంజయ మంత్రములోని పదములకు అర్థములు :-

1. 'త్ర్యంబకమ్' త్రైలోక్యశక్తితో కూడిన త్రిపురానరేశుడు శిరము
2. 'యజా' సుగంధా శక్తితోకూడిన యజ్ఞవతీశుడు - లలాటము
3. 'మహే' మాయాశక్తితో కూడిన మహత్తత్త్వేశుడు - చెవులు
4. 'సుగన్ధిమ్' సుగంధిశక్తితో కూడిన సుగంధీశుడు - నాసిక
5. 'పుష్టి' పురన్దరీ శక్తితోకూడిన పురుషేశుడు - ముఖము
6. 'వర్ధనమ్' వశంకరీ శక్తితో కూడిన వరేశుడు - కంఠము
7. 'ఉర్వా' ఊర్ధ్వేశ శక్తితో కూడిన ఉమాపతీశుడు - హృదయము
8. 'రుక' 'రుక్మవతీశక్తితో కూడిన రూపవతీశుడు - నాభి
9. 'మివ' రుక్మవతీశక్తితో కూడిన రూపవతీశుడు - నడుము
10. 'బన్ధనాత్' బర్బరీ శక్తితో కూడిన బాలచంద్ర మౌళీశుడు - గుహ్యాము
11. 'మృత్యోః' మంత్రవతీ శక్తితో కూడిన మంత్రేశుడు ఊరుద్వయము
12. 'ముక్షీయ' ముక్తికరీ శక్తితో కూడిన ముక్తికరీశుడు - జానువులు
13. 'మా' మహాశక్తితో కూడిన మహాకాళేశుడు - జంఘలు
14. 'అమృతాత్' అమృతవతీ శక్తితో కూడిన అమృతేశుడు - పాదతలము

ఈ మంత్రములోని వాక్యములకు అర్థమును క్రింది విధమున తెలియనగును.

1. త్ర్యంబకమ్ - భూతశక్తితో కూడిన భవేశుడు
   అధః సహస్రార మూలాధారము (నెలవు)
2. 'యజామహే' శర్వాణీ శక్తితో కూడిన శర్వేశుడ - స్వాధిష్ఠానము
3. 'సుగన్ధిమ్' విరూపా శక్తితోకూడిన రుద్రేశుడు మణిపురము
4. 'పుష్టివర్ధనమ్' వశవర్ధినీ శక్తితోకూడిన పురుషవరదేశుడు, పశుపతీశుడు అనాహత చక్రము

5. 'ఉర్వారుకమివ' ఉగ్రాశక్తితో కూడిన ఉగ్రేశుడు - విశుద్ధ చక్రము
6. 'బన్ధనాత్' మానవతీ శక్తితో కూడిన మహాదేవేశుడు - ఆజ్ఞాచక్రము
7. 'మృత్యోరుశిక్షీయ' భద్రకాళీ శక్తితోకూడిన - భీమేశుడు - సహస్రదల చక్రము
8. 'మామృతాత్' ఈశానీ శక్తితోకూడిన ఈశానేశుడు-సహస్రదళము

మరియొక తంత్రీ శాస్త్రమునమనసరించి వాక్యగత శక్తులు :-

1. 'త్ర్యంబకమ్' సర్వజ్ఞతా శక్తిని తెలుపును
2. 'యజామహే' నిత్యతృప్తియను శక్తిని తెలుపును
3. 'సుగన్ధిమ్ పుష్టి వర్ధనమ్' అనాది బోధితా శక్తిని దెలుపును.
4. 'ఉర్వారుకమివబన్ధనాత్' స్వతంత్రతాశక్తిని తెలుపును.
5. 'మృత్యోర్ముక్షీయ' నిత్యమలుప్తా శక్తిని తెలుపును.
6. 'మామృతాత్' అచింతయానంత శక్తిని దెలుపును.

ఈ మంత్రమునకు నాలుగు పాదములున్నవి. ఒక్కొక్క పాదమునకుగల అర్థమును క్రింది విధముగ దెలియనగును.

1. 'త్ర్యంబకమ్ యజామహే' అంబికా శక్తితో కూడిన త్ర్యంబకేశుని సూచించును. తూర్పు దిక్కుగా ప్రవహించు శక్తి ఇందుండును.
2. 'సుగన్ధిమ్' పుష్టి వర్ధనమ్' వామాశక్తితో కూడిన మృత్యుంజయేశుని తెలుపును. దక్షిణదిశగా ప్రవహించు శక్తి యిందుండును.
3. ''ఉర్వారుకమివ బన్ధనాత్'' భీమా శక్తితో కూడిన మహాదేవేశుని తెలుపును. పశ్చిమదిశగా ప్రవహించు శక్తి ఇందుండును.
4. 'మృత్యోర్ముక్షీయమామృతాత్' ద్రౌపదీ శక్తితో కూడిన సంజీవనీశుని తెలుపును. ఉత్తరదిశగా ప్రవహించు శక్తి ఇందుండును.

సంస్కృత శ్లోకములలోని నాలుగు పాదములలో మొదటి రెండును పూర్వార్ధమని, మూడు నాలుగు పాదములు ఉత్తరార్ధమని

చెప్పబడును. అట్లు మృత్యుంజయ మంత్రమును రెండు భాగములుగ గ్రహించి దానికి తంత్రశాస్త్రములో అర్థము చెప్పబడి యున్నది.

1. త్ర్యంబకం యజామహే, సుగంధిం పుష్టివర్ధనమ్ - గౌరీ శక్తితో కూడిన మహేశ్వరుని తెలుపును. దక్షిణ పాదమున నుండును.

2. ఉర్వారుకివబన్ధనాన్మృత్యోర్ముక్షీయమ్మామృతాత్:-

వ్యాపినీ శక్తితో కూడిన శామ్భవేశుని తెలుపును. వామపాదమున నుండును.

సంపూర్ణ మంత్రము అనాఖ్యాత శక్తితో కూడిన సర్వాఖ్యేశుని తెలుపును. సర్వాంగముల యందును వ్యాపించి యుండును.

## మృత్యుంజయ మంత్రములు

సాధకుల అభిరుచి, పూర్వుల అనుభవములు, సాధకుల లక్ష్యము, మున్నగు విషయముల ననుసరించి వేఱు వేఱు తంత్రములలో మహా మృత్యుంజయ మంత్రము పలు రూపముల జపము చేయబడుచున్నది. దాదాపు ముప్పది విధములైన మృత్యుంజయ మంత్రములున్నవి.

(1) ఏకాక్షరీ మంత్రము 2) మూడు అక్షరముల మంత్రము 3) నాలుగక్షరముల మంత్రము 4) తొమ్మిది అక్షరముల మంత్రము 5) పది అక్షరముల మంత్రము 6) పదునైదక్షరముల మంత్రము 7) ముప్పది రెండక్షరముల మంత్రము 8) ముప్పది మూడక్షరముల మంత్రము 9) మూడు వ్యాహృతులతో నలువది ఎనిమిది అక్షరములతో కూడిన మంత్రము 10) మూడు వ్యాహృతులతో ఏబది అక్షరముల మంత్రము 11) వ్యాహృతి బీజాక్షరములతో ఏబది రెండక్షరములోగల మంత్రము 12) పదునాలుగు ప్రణవ బీజములు మూడు వ్యాహృతులు మున్నగు వానితో కూడిన అరువది రెండక్షరముల మంత్రము 13) శుక్రాచార్యులు ఉపాసించిన

మృతసంజీవనీ విద్య 14) బగళాముఖీ భైరవ మృత్యుంజయ మంత్రము 15) వేఱు మంత్రములతో గూడిన మృత్యుంజయ మంత్రము ఇదియే శతాక్షర గాయత్రియనబడును. 16) - 21)విభిన్న లక్ష్యముల సాధింప జపింపబడు మంత్రములు ఐదు విధములు, 22) మూడు అనుష్టుప్పులతో కూడి ఆయువును వృద్ధిపొందించెడి మంత్రము 23) బృహన్మృత్యుంజయ మంత్రము, ఇదే మాలా మృత్యుంజయ మంత్రమనబడును. 24) పురాణోక్త మృత్యుంజయ మంత్రము, 25) విలోమాక్షరమృత్యుంజయ మంత్రము 26) భైరవి, ప్రథమ పాదము, మూల మంత్రము, శివపంచాక్షరీ మంత్రము అనువానితో కూడిన సాంగోపాంగ మంత్రము 27) అమృతేశ్వర మంత్రము 28) దుర్గాసప్తతిలో పేర్కొనబడిన మృత్యుంజయ మంత్రము 29) మృత్యుంజయ మంత్ర సంపుటిత వ్యాస మంత్రము 30) ధర్మరాజ మంత్రము.

ఇట్లు వివిధ రూపముల హోమము, తర్పణము, మార్జనము, నీళ్ళనో భస్మమునో మంత్రించి చల్లుట, మున్నగు అనేక విధముల ఈ మహా మృత్యుంజయ మంత్రము ప్రయోజనపడుచున్నది.

ఏ మంత్రమును ఎట్లు ఉపయోగించు చున్నామని అనుటకాదు ముఖ్యము. దైవమునందు, మంత్రమునందు పరమ విశ్వాసము, శ్రద్ధ, పవిత్రశీలము, పవిత్ర సంకల్పము (ఇతరులకు కీడు కలిగింపవలెనని దుష్ప్రయోగార్థముగాకాక ''సర్వ భూతహితేరతః'' అనునట్లు అందరిమేలు కోరుట) ఫలాపేక్ష లేక భగవదనుగ్రహమే పరమ ప్రయోజనమను తలపు అనువానితో ఏ మంత్రమును జపించినను జన్మ తరించును.

''స్వామీ! నాకు కావలసినది నీదయ, నీదయామృతములో నన్ను మునుగనిమ్ము. నాగుండెనిండుగా నీ దయామృతమే తొణికిసలాడవలెను. నా శరీరములోని డెబ్బది రెండువేలనాడులలోను నీ దయామృతమే నిరంతరము ప్రవహింపవలెను''. అన్న ప్రార్థనతో

జపింతము. మేలు పొందుదము ''అనన్యాశ్చిన్త యన్తోమాం యేజనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ అన్న సూక్తియే మనకు ధ్యేయము.

## మృత్యుంజయ మహిమ

మృత్యుంజయస్య మన్త్రంవై, జపతేయదిమానుషః ।
కోటివర్షశతం స్థిత్వాలీనోభవతిబ్రహ్మణి ॥

''నియమము తప్పక మృత్యుంజయ మంత్రమును జపము చేసినవాడు కోటి నూర్ల సంవత్సరములు స్థిరముగా ఉండి తర్వాత బ్రహ్మమునందు లీనమగును'' అని ఈ శ్లోక తాత్పర్యము. 'ఏమీ? ఎంత అతిశయోక్తి! కోటి వర్షశతములు ఉండగలడా? ఇంతకన్నా వచ్చి అబద్ధము వేఱులే'దని కొందరు అందురు. ఆస్తికులైన వారికి గూడ సందేహము ఏర్పడవచ్చును. అందువల్ల మంత్రమహిమలో సంశయము కలుగవచ్చును. కాన అందులకు సమాధానము చెప్పుట ఆవశ్యకము.

అశ్వత్థామ, బలి మున్నగు వారు చిరంజీవు లని పురాణ కథలు పేర్కొనుచున్నవి. ''చిరంజీవి' అన్న చాలాకాలము జీవించిన వాడు, శతాధిక వర్షజీవులని కొందరు సమాధానము చెప్పుదురు. అట్లయినచో రానున్న ఇంద్రపదవి బలికిని, బ్రహ్మపదవి హనుమంతునకు ఇచ్చెదనని పలికిన భగవద్వాక్యము అనత్య మగును.

శరీరము మూడు విధములు. కంటికి కనబడునది భౌతిక శరీరము. పంచభూతముల కలయికవలన ఏర్పడినది. ఇదే అన్నమయ కోశ మనబడును. జీవులు చేసికొన్న పుణ్య పాపరూప ఫలములను అనుభవించుటకై ఏర్పడినది. ప్రారబ్ధము తీరిన తర్వాత ఇది క్షణకాలము కూడ నిలువదు. ఎవరును నిలుపలేరు. దీనికి ఆధారముగ చేతనునకు ప్రాణమయ, మనోమయ శరీరములు కలవు. అవి

సూక్ష్మశరీరమనబడును. కంటికి కానరాదు. ప్రాణ (వాయు) రూపమున నుండును. ఇదే పలుజన్మములందు అనుసృతముగా వచ్చుచుండును. బ్రహ్మ పదవినందు కోగలుగువరకు ఇది నశింపదు. కాన సిద్ధ పురుషులు నిరపాయమైన ఈ శరీరములో (తమలక్ష్యము అనగా యోగసిద్ధి లభించుటతో అన్నమయ శరీరమును వదలి) ఎంతకాలమైనను జీవింపగలరు. ధ్రువుడు, ఆంజనేయుడు మున్నగు వారు ఇట్టి సూక్ష్మ శరీరముతోనే వెలయుచున్నారు. యోగశాస్త్రనిరతులకు ఈ సిద్ధపురుషులు అపుడపుడు దర్శన మిచ్చుటయు కలదు. ఆదిశంకరులకు బదరికాశ్రమమున వ్యాసదర్శనమగుట, శ్రీమద్వేదాంతదేశికులకు శ్రీమద్రామానుజా చార్యులు దర్శనమగుట, తులసీదాసు హనుమంతుని దర్శనము పొందుట మున్నగునవి పొల్లులుకావు, భ్రమలు కావు. ఇటివలి కాలమున ఇట్టి సిద్ధుల దర్శింపగల మహనీయుని ఈ గ్రంథకర్త ఎరుగును. (కాని వారిని గురించిన వివరము లిందు అనవసరమగుట చేతను, నమ్మనివా రెట్లును సమాధానపడరు గనుకను, మహనీయులకు అవహానము కలిగించులే ఫలమగునున్న సంశయము బాధించుట చేతను ఆవివరములు ఇక్కడ పేర్కొనబడలేదు. శార్వరిగారు మాస్టరు C.V.V. గారిని గురించి వ్రాసిన పుస్తకము కొంతవఱకు ఇందలి సందేహమును తీర్పగలదు.)

మృత సంజీవనీ విద్యను నేర్చి మహిమాన్వితుడైన శుక్రాచార్యుల గుఱించి, దేవతలు బృహస్పతి కుమారుడైన క చుని ఆ విద్యను, నేర్చుకొని వచ్చునట్లుచేసిన వృత్తాంతము మున్నగునవి మహాభారత ప్రసిద్ధము.

శుక్రాచార్యులు పేర్కొన్న మహామృత్యుంజయమహిమ శివమహాపురాణమున క్రింది విధమున పేర్కొనబడి యున్నది:-

*త్ర్యంబకం యజామహేచ, త్రైలోక్యపితరంప్రభుమ్ ।*
*త్రిమణ్డలస్య పితరం, త్రిగుణస్యమహేశ్వరమ్ ॥*

త్రితత్త్వస్య త్రివహ్నేశ్చ, త్రిధాభూతస్య సర్వతః ।
త్రిదివశ్చ త్రిబాహోశ్చ త్రిధాభూతస్య సర్వతః ॥

త్రిదేవస్యమహాదేవః సుగన్ధిమ్ పుష్టివర్ధనమ్ ।
సర్వభూతేషుసర్వత్ర, త్రిగుణేషు కృతోయథా ॥

ఇన్ద్రియేషు తథాన్యత్ర, దేవేషుచ గణేషు చ ।
పుష్పేసుగన్ధివత్సూరః, సుగన్ధిరమరేశ్వరః ॥

పుష్టిశ్చప్రకృతేర్యస్మాత్ పురుషాద్వై ద్విజోత్తమ ।
మహదాది విశేషాణాం వికల్పశ్చాపి సువ్రత ॥

విష్ణోః పితామహస్యాపి, మునీనాంచ మహామునే ।
ఇన్ద్రియశ్చైవ దేవానాం, తస్మాద్వై పుష్టి వర్ధనః ॥

తందేవ మమృతం రూరుం, కర్మణా తపస్యాపివా ।
స్వాధ్యాయేన చ యోగేన, ధ్యానేన చ ప్రజాయతే ॥

సత్యేనాన్యేన సూక్ష్మయాన్ మృత్యుపాశాద్ భవస్వయమ్ ।
బన్ధమోక్షకరో యస్మాదుర్వారుకమివ ప్రభుః ॥

మృతసంజీవనీమన్త్రో మమ సర్వోత్తమః స్మృతః ।
ఏవం జపపరః ప్రీత్యా నియమేన శివం స్మరన్ ।
జప్త్వా హుత్వాఽమన్త్రైవం జలంపిబ దివానిశమ్ ।
శివస్యసన్నిధౌ ధ్యాత్వానాస్తిమృత్యు భయంక్వచిత్ ॥

దధీచి మహర్షికి శుక్రాచార్యుడు మృత్యుంజయ మంత్రమును బోధించుచు ఇట్లు పేర్కొనెను. "మూడు లోకములకు ప్రభువు త్రియంకుడు. మూడు లోకములకును తండ్రి, మూడు గుణములు, మూడు తత్త్వములు, అగ్ని, భూతము, స్వర్గము సకలము అతనివే. సుగంధివలన అతడు సర్వత్ర వ్యాపించియున్నాడు. ప్రకృతి పురుషులచే తమ హదాదితత్త్వములు పెంపొందునట్లు సమస్తమును

పుష్టి పొందించువా డతడు. బ్రహ్మ, విష్ణు, మునిమున్నగు వారలపుష్టి పొందించువాడు అతడే. స్వాధ్యాయము, యోగము, ధ్యానము, సత్యము ఉపాసన అను పద్ధతులచేత అతనిని ఉపాసించిన ప్రసన్నుడై మృత్యుపాశముల నుండి విడిపించును. బంధనము నుండి విడిపించుటకు సమర్థుడు అతడే కాన నియమముతో మృతసంజీవనిని జపింపుము.

శుక్రుని ఉపదేశము వలన దధీచి వజ్రకాయు డయ్యెను. ఇంద్రుని వేడికోలు ననుసరించి అతనికి తగు ఆయుధముగా వెన్నెముకనే సమర్పించినవాడు దధీచి.

## మంత్రము ఫలించు విధము

'మంత్రమునకు మామిడికాయలు రాలునా' అను సామెతకలదు. ఇది ఎందుకు ఎవరివలన ప్రచారమునకు వచ్చెనో గుర్తింపరాదు గాని నిజమునకు మంత్రము వలననే మామిడికాయలను రాల్చవలెను. వృక్షమునందలి కాయను రాల్చవలెనన్న రాయి విసరవలెను. ఊరక రాతిని విసరివేసిన ఫలము కలుగదు. సూటిగ కాయను జూచి గురిపెట్టి విసరవలెను. రాయి కాయకు తగులునట్లు విసరుటకు లక్ష్యశుద్ధి, సామర్థ్యము, భుజబలము కావలెను కదా. ఇవే మంత్ర మనబడును. మంత్ర మనగా ఉపాయము. రాచకార్యములలో ప్రభువునకు తగు ఉపాయము చెప్పువాడు మంత్రి. ఏదైన నొక లక్ష్యమును సాధింపగోరి గావింపబడు మంత్రజపము ఆలక్ష్యసిద్ధికి ఉపాయ మగును.

'మంతారం త్రాయత ఇతి మంత్రః' మాటి మాటికి నియమముతో మననము చేయువానిని రక్షించునది మంత్రము.

భగవంతుని సృష్టిలో సమష్టిలోగల తత్త్వమే మనలో నున్నది.

భగవంతునిలో అవయవరూపమున వెలసిన దేవతల అంశము
మన శరీరమునకును వలసిన బలము నిచ్చుచున్నవి. మన
నత్యంతసూక్ష్మముగ మూలాధారమున నెలకొనియున్న పరతత్త్వ
పరాశక్తియే మనకు అన్ని శక్తులను అనుగ్రహించుచున్న
మాటలాడునపుడు వాగ్రూపమున వెలువడు శబ్దములకు ఉత్ప
స్థానము అదియే. వాక్కు అగ్ని రూపమని వేదము
పేర్కొనుచున్నవి. అగ్నియే రుద్రుడు. సూర్యునడును రుద్రుడ
సూర్యుని శక్తియే ప్రాణరూపమున మనకు జీవనము నిచ్చుచున్నద

సాధారణముగ శ్వాసము పీల్చునపుడు ప్రాణశక్తి మనల
ఎనిమిదంగుళముల దూరము అనగా హృదయస్థానము వఱక
వ్యాపించును. మరల ఉచ్ఛ్వాసముగ గొన్న ప్రాణవాయువున
నిశ్వాసరూపమున విడుచునపుడు వెలువల పండ్రెండంగుళము
దూరము అది వ్యాపించును. అట్లుగాక వెలుపలికి ఎనిమిదంగుళము
దూరము వదలుచు లోపల పండ్రెండంగుళముల వఱక
ప్రాణావాయువును ప్రసరించునట్లు ప్రాణయామసిద్ధివల్ల సాధించినచొ
మనలోని పరాశక్తికి ఉద్దీపనము ఏర్పడును. అట్లు ఉద్దీప్తమైన అగ్నిశక్తిని
మంత్రాక్షరముల ద్వారా హృదయాస్థానమునకు చేర్చినపుడు
హృదయమున దహరాకాశముననున్న పరంజ్యోతి
ప్రకాశవంతమగును. మూలాధార శక్తిని హృదయగత పరంజ్యోతితో
సమన్వయ మొనర్చి సహస్రారమునగల సదాశివతత్త్వముతో నైక్యము
చేసినపుడు మూలాధారమునకును, సహస్రారమునకును ఎడతెగని
సంబంధము ఏర్పడును. ఈ గ్రంథప్రారంభమున అగ్ని సౌమ్య
శక్తుల సమన్వయము సమిష్టి ప్రపంచమున ఏర్పడు విధము
వివరింపబడినదిగదా. అట్టి సమన్వయమును వ్యష్టిగా మనలో
ఏర్పఱచకొనుటయే మృత్యుంజయోపాసన మగును. ఇంకను
విపులముగా తెలియగోరువారు యోగశాస్త్రమును పరిశీలింపదగును.

భగవద్గీతలో శ్రీకృష్ణుడు ''అహం వైశ్వానరోభూత్వా-ప చామ్యన్నం చతుర్విధమ్'' అనుచు మనలో జఠరాగ్ని వైశ్వానరుడగుటను, మనము భుజించు అన్నము జీర్ణమై శక్తి నచ్చిటకు ఈ క్రియయే కారణమగుటను స్పష్టపఱచెను. అంతేగాక ప్రాణులకు కాలము మూడినపుడు వైశ్వానరాగ్నిని ఉపసంహరించుకొని జీర్ణక్రియను విషమము చేయుటయే రోగములు కలుగుటకు కారణమనియు పేర్కొనెను.

ఆహారము విషమయమైన వాత, పిత్త, కఫములు తమ క్రమము తప్పి విషమించి రసరక్తాది ధాతువులను చెఱచును. అందువలన రోగములు ఉత్పత్తి యగును. వాతము ప్రాణశక్తి, పిత్తము ఆగ్నేయశక్తి అనగా రుద్రశక్తి కఫము సౌమ్యశక్తి. మృత్యుంజయోపాసన జఠరాగ్ని విషమింపకుండ కాపాడుటకును, వాత, పిత్త, కఫముల క్రమము తప్పక ప్రవర్తించునట్లు చేయుటకును తోడ్పడుచున్నది. ఆగంతుకములైన వ్యాధులకును ఈ శక్తులే కారణములు . దెబ్బతగులుట, రోగ క్రిములు మన శరీరములో ప్రవేశించుట మున్నగు ఆగంతుక బాధలవల్లను త్రిదోషవికృతి ఏర్పడును. (వైద్య శాస్త్రమున రుద్రుడే జ్వరమును ఉత్పత్తి చేసెనని పేర్కొనుటలోని ఆంతర్యము గమనింపతగ్గది).

కాగా రోగనివారణ, అమృతత్త్వసిద్ధి మున్నగువానికి 'మృత్యుంజయోపాసన' ఆవశ్యక మగును.

ఇక్కడ నొక సంశయము కలుగవచ్చును. ''మంత్రము వల్లనే రోగనివారణమగునేని ఇక మందులెందుకు?'' అని.

విజ్ఞానశాస్త్రము శక్తికి సూర్యుడే ఆధారమనియు, మనము భుజించు ఆహార పదార్థములందును, సూర్య శక్తియుండుటవలననే మన కవి శక్తినిచ్చు చున్నవనియు పేర్కొనుచున్నది. అట్లుండగా సూర్యశక్తినే ఏల మనము గ్రహింపలెకున్నాము? ఆహార పదార్థములేల భుజింపవలెను? అని యోజింపుడు. స్థావరములు జలమును సూర్యకిరణములను గ్రహించి సమన్వయపరచి మనకు ఉపయోగపడుచున్నవి. ఆ విధముగ అగ్ని, సోమమును మనలో సమన్వయపరచుకొను సామర్థ్యము లేనందుననే మనము స్థావరములను ఆశ్రయించుచున్నాము. పూర్వ కాలమున తపస్సంపన్నులు ఈ పద్ధతిని గుర్తించియున్నందువలననే సంవత్సరములకొలది కాలము ఆహారము లేకయే జీవించియుండగలిగిరి.

ఈ సందర్భమున నొక విషయమిక్కడ పేర్కొనుట ఆవశ్యకము.

వివేకానందస్వామి ఒకప్పుడు హిమాలయ ప్రాంతమున విహరించుచు ఒక గుహలో ఒక యోగిని చూచెను. 'యోగులు దివ్య శక్తి సంపన్నులు గదా, ఈయన కట్టి శక్తి ఏదైన నుండునేమో?' అన్న సందేహము అతనికి కలిగెను. యోగి, స్వామి హృదయమును దెలిసికొని నవ్వుచు "అపూర్వ వ్యక్తివి, రాక రాక నేనున్నచోటకి వచ్చితివి. తగిన ఆతిథ్యమిచ్చి సత్కరించుటనా కర్తవ్యము. ఏదైన నొక పండును మనస్సులో తలచుకొనుము" అనెను. అ ఋతువులో ఆ ప్రాంతమున లభింపని పండును వివేకానందస్వామి మనస్సున తలచుకొనెను. ఒకటి రెండు నిమిషములలో యోగి హస్తమున ఆ పండు ఉన్నది. అతడు దానిని ప్రీతితో స్వామి కిచ్చెను. రూపములోగాని, రుచిలోగాని ఎట్టి మార్పును లేదు. వివేకానందుడు ఆ పండు వచ్చిన రహస్యమును అడిగెను. యోగశక్తివలన పంచభూతముల వశపఱచుకోగలిగినచో అవి ఏయే పాళ్ళలో ఏయే వస్తువులుగా ఏర్పడునో సంకల్ప మాత్రముననట్టివి సృజించుట యోగికి అసాధ్యముకాదు' అనిసిద్ధుడు అనెను. యోగి మాటలకు

స్వామి విస్మయానందములతో తబ్బిబ్బులై ''మహాత్మా! తమవంటివారు ఇట్లు దాగియుండక లోకమున సంచరించుచు దీనులను, అనాథులను, దుఃఖితులను కాపాడవచ్చునుగదా!'' అనెను. అందులకు ఆ యోగి ''విశ్వ మను రాజ్యమునకు సర్వాధికారి భగవంతుడు. ఎవరిని ఏ స్థితిలో ఉంచవలెనో, ఎందుకు ఉంచవలెనో ఆసర్వజ్ఞునకే ఎఱుక. ఆతని అధికారములో ప్రవేశించుటకు ఎవరికి అధికార మున్నది? అతని సంకల్పము వలన నొకరు బాధపడుచున్నచో అడ్డుకొని నివారించుటకు మనకు శక్తి లేదు. కాకున్న 'దేవా! ఈ దీనుని రక్షింపవా! ఎందుకు బాధపెట్టెదవు? కరుణలేదా?'' అని ప్రార్థించుటయే మనము చేయ తగిన పని. ఆపనినినేను ఇక్కడ నుండియే చేయుచున్నాను గదా'' అనెను.

విశ్వామిత్రుడు యోగశక్తితో ''ఇంద్రమన్యం కరిష్యామి'' అని త్రిశంకునికై స్వర్గలోకమునే సృజింపబూని దేవతలు ప్రార్థింపగా శాంతించి విరమించిన విధము రామాయణ ప్రసిద్ధము.

కాగా కేవలము యోగసిద్ధివలననే జీవించుట సిద్ధులకే సాధ్యము. మనము మందులు పుచ్చుకొనక తప్పదు. అట్టిచో మంత్రములవలన ప్రయోజన మేమి? అన్నచో, ఆహారము భుజించిన మాత్రము చాలదు. అది సరిగా జీర్ణమై శక్తి యగుటకు వైశ్వానరుని అనుగ్రహమును కావలెను. వైశ్వానరాగ్నిని ఉపసంహరించుకొని తిన్న అన్నము ప్రయోజనపడకుండ చేయుదునని భగవంతుడే చెప్పెను కదా! అట్లు అతని అనుగ్రహము తప్పకుండుటకును, మందును సరిగా ప్రయోజనపడునట్లు అవయవములకు తగిన శక్తినిచ్చునట్లు దైవాంశములకు తగు శక్తి కలుగుటకును మంత్రోపాసన ఆవశ్యకము.

మందు రోగమును మాన్పగలదు గాని, కర్మ ఫలమును మార్చలేదు. కాన కర్మఫలము నివారణమగుటకు దైవోపాసనయు, రోగనివారణకు మందును అని రెండింటిని సరిగా ప్రయోగించిననే

విడుచుగాలి 'హ' అనబడును ఇదే సోహం అను మంత్రము దీని విశేషమును యోగశాస్త్రమువలన తేలియనగును.

4) మన శరీరములోని మూలాధార స్థానము నుండి నిరంతరము అనాహతశబ్దము (ప్రణవము) వేలువడు చునేయుండును. ఈనాదమును యోగసిద్ధులు గుర్తింపగలరు.

## మృత్యుంజయ జప విధానము

ధ్యానము, జపము, వేదపఠనము, దైవపూజ మున్నగువానికి ఉదయకాలము ఉషఃకాలము ఎంతో ఉపయుక్త మైనది. ఆసమయమున ఆగ్నేయ-సౌమ్య శక్తులు ప్రకృతిలో సమముగా ఉండును. కనుకనే ఉషఃకాలమున ప్రకృతితోపాటు మన మనస్సుకూడ సత్త్వమయమై యుండును. కాన నాలుగునుంచి ఆఱు గంటలలోపల ధ్యాన జపాదులు నిర్వర్తించుట మంచిది.

శరీరమును స్నానమువలనను, మనస్సును సత్యంకల్పమువల్లను పరిశుద్ధము చేసికోవలెను. ప్రతిదినము ఒకే నియమితస్థలమున కూర్చుండియే ధ్యానము, జపము చేయవలెను. అందులకని ప్రత్యేకమగు గదియో, లేకున్న ప్రత్యేక స్థలమో నిర్ణయించుకొని వీలయినంతవరకు తన యింటివారు తప్ప ఇతరులు ఆచోట ప్రవేశింపకుండ చూచుకొనుట ముఖ్యము.

ఆసనము వేసికొనియే కూర్చుండవలెను. భూమి మనశక్తిని ఆకర్షించుచుండును గాన సాధారణముగ వట్టి నేలపై కూర్చుండ రాదని శాస్త్రము చెప్పుచున్నది. ముఖ్యముగా భోజనము, జపము, పూజ, మున్నగునవి చేయునపుడు ఒక వస్త్రము, అజినము, (జింక చర్మము) ఏవియు లేకున్న పీటయైన యుండ దగును. ప్రాణాయామము, మంత్రజపము మున్నగునవి చేయునపుడు ఊర్ధ్వగతిలో ఉన్న ప్రాణశక్తిని భూమి తనవైపునకు ఈడ్చి ఆటంకము కలిగింపకుండుటకు ఇది తోడ్పడును. దర్భలు ఆకాశ తత్త్వమునకు

చెందినవని ఆయుర్వేద శాస్త్రము చెప్పుచున్నది. కావనే లోనగొట్టమువలె ఉండును. ఆకాశతత్త్వము మంత్ర సిద్ధికి సహకారి. కావుననే వైదిక కార్యములలో దర్భలతో పవిత్రముచేసి ఉపయోగింతుము. మనచేతిలోని వ్రేళ్ళు పంచభూతములకు ప్రతీక. అంగుష్ఠము ఆకాశతత్త్వమునకు, 'చూపుడువేలు వాయుతత్త్వమునకు, నడిమివ్రేలు అగ్నితత్త్వమునకు' ఉంగరపువేలు జలతత్త్వమునకు, చిటికెనవేలు పృథివీ తత్త్వమునకు చెందినవి. హస్త సాముద్రిక శాస్త్రమునందును వ్రేళ్ళ మొదళ్ళు ఆయా గ్రహములకు ప్రత్యేకించుటలోని ఆంతర్య మిదియే. ఉంగరమును ఉంగరపు వ్రేలికే తొడుగుకొనుట ఎందుకు? బంగారు తేజఃపదార్థ మని శాస్త్రము. అది సూర్యకిరణములను తనలోనికి ఆకర్షించుకొనును. ఆశక్తి జలశక్తితో (సౌమ్య శక్తితో) కలిసి మన శరీరములో ప్రవేశించిననే ఆ ప్రాణశక్తి మనకు హితము చేయును. ప్రాణాయామమున సూర్యశక్తిని మనలోనికి ఆకర్షించుకొందుము. ఆ శక్తి మనకు హితముగా ఉండవలె ననుటకే ప్రతి ప్రాణాయామమునకు ముందును ఆచమనము చేయవలెను. ఆచమనమువల్ల మన శ్వాసనాళమున సౌమ్యశక్తి ప్రాణశక్తితో సమన్వయమై హితము చేయును. ఇట్లు చెప్పుచు పోయిన గ్రంథము విస్తరించును. మన పూర్వులు ప్రతిచిన్న విషయమును ఎంతో యోచనతో పరిశీలించియే నిర్ణయించిరనుటను తెలుపుటకే అసందర్భమైనను ఈ ప్రస్తావన ఇట చేయబడినది.

ఇష్టదైవ చిత్రము, లేదా విగ్రహము ముందుంచుకొని, ధ్యానము లేదా జపము చేయుటకు మునుపు సాష్టాంగ నమస్కారము చేయవలెను. (ఇది చాల ముఖ్యము. దీని ఆంతర్యమునిట వివరించుటకు గ్రంథము పెరుగునన్న భయము బాధించుచున్నది. మరొకప్పుడు దీనిని గురించి ప్రస్తావింతును). భగవంతుని స్వరూపమున దృష్టి నిలిపి ఆస్వరూపమును మనస్సునకు

తెచ్చుకోవలెను. లేదా జపమంత్రమునకు చెందిన ధ్యాన స్వరూపమును, అనగా మంత్రమూర్తిని మనస్సున నిలిపికొని జపము సాగింపవలెను.

అన్నింటికన్న దైవమునెడ, మంత్రమునందు, తనయందు విశ్వాసము ఉండవలెను. మనస్సు చంచలము కారాదు. జపధ్యాన సమయములలో భగవచ్చింతన తప్ప వేఱుయోచన ఉంచరాదు. ఈ నిశ్చల భావమును గూడ భగవంతుడే అనుగ్రహింపవలెను. అందుకే తులసీదాసు

*భవానీశఙ్కరౌవన్దే శ్రద్ధావిశ్వాసరూపిణౌ ।*
*యాభ్యాంవినా న పశ్యన్తి సిద్ధాః స్వాన్తస్థ మీశ్వరమ్ ॥*

'శ్రద్ధ', విశ్వాసము, రూపుగొన్న భవానీ శంకరులకు నమస్కారము. వారియనుగ్రహములేక సిద్ధులు తమలోని ఈశ్వరుని సాక్షాత్కరింపజేసికో లేరు. అని ప్రార్థించెను. తైత్తరీయమునందలి అమృతసూక్తము, యజుర్వేదములోని శివసంకల్ప సూక్తము అనునవి మనోబలమును, స్థైర్యమును కలిగించును.

## అమృతసూక్తము

దైవము మనలో సూక్ష్మరూపమున దైవాంశములను నెలకొల్పియున్నది. దైవశక్తి లేక అణువైనను కదలదు. గాలి, నీరు, నిప్పు వంటి భౌతిక పదార్థములకు అపార శక్తి నిచ్చునది--వానిలో అంతర్గుప్తమై యున్న దివ్య శక్తియేయని వివేకవంతులు విచక్షణా జ్ఞానముచేత గ్రహింపగలరు. కాన సమష్టిగా ఉన్న దివ్యశక్తి ప్రభావానికి అభిముఖులమై మనలోని సూక్ష్మశక్తులను సమష్టి శక్తితో సమన్వయ పరచుకొన్నప్పుడు మనలో వివేకము, జ్ఞానము, క్రియాకరణ సామర్థ్యము మున్నగునవి పెంపొంది జన్మము చరితార్థము కాగలదు. ఆ ప్రయత్నమే ఉపాసన. అందులకు వలసిన మానసిక స్థైర్యము కూడ ఆ భగవదనుగ్రహమువలననే పొందగల మనుటను ''అమృతసూక్తులు'' తెలుపుచున్నం. ఆ సూక్తులివి.

అగ్నిర్మే వాచి(శితః వాగ్ఘృదయే । హృదయంమయి ।
అహమమృతే । అమృతంబ్రహ్మణి ॥ 1
వాయుర్మే ప్రాణే శ్రితః । ప్రాణోహృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతంబ్రహ్మణి ॥ 2

సూర్యోమేచక్షుషిశ్రితః । చక్షుర్హృదయే ।
హృదయంమయి । అహమమృతే అమృతంబ్రహ్మణి ॥ 3

చన్ద్రమా మే మనసిశ్రితః । మనోహృదయే ।
హృదయంమయి । అహమమృత్ర । అమృతంబ్రహ్మణి ॥ 4

దిశోమే శ్రోత్రేశ్రితాః । శ్రోత్ర హృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ॥5

ఆపో మే రేతసి శ్రితాః । రేతః హృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతంబ్రహ్మణి ॥ 6

పృథివీ మే శరీరే శ్రితా । శరీరం హృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతంబ్రహ్మణి ॥ 7

ఓషధిర్వనస్పతయో మే లోమసు శ్రితాః । లోమాని హృదయే
హృదయం మయి । అహమమృతే । అమృతంబ్రహ్మణి ॥8

ఇన్ద్రో మే బలే శ్రితః । బలం హృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ॥9

పర్జన్యోమే మూర్ధ్ని శ్రితః । మూర్ధాహృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతంబ్రహ్మణి ॥ 10

ఈశానో మే మన్యౌశ్రితః । మన్యుర్హృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ॥11

ఆత్మామే ఆత్మని శ్రితః । ఆత్మాహృదయే ।
హృదయంమయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ॥౨

*పునర్మే ఆత్మా పునరాయు రాగాత్, పునః ప్రాణః పునరాకృత మాగాత్*
*వైశ్వానరో రశ్మిమినవృధానః అన్తస్తిష్ఠన్నమృతస్యగోపాః 13*
*(తైత్తిరీయ బ్రాహ్మణము 3.10.8)*

నా వాక్కులో అగ్ని ప్రకాశించుచున్నది. వాక్కు హృదయమందున్నది. హృదయము నాలో ఉన్నది. నేను అమృతమందు ఉన్నాను. అమృతము బ్రహ్మమందున్నది. (ఇక్కడ నేను అనునది విజ్ఞానమయుడైన వ్యష్టిగా ఉన్న ఆత్మను దెలుపును. అమృతము అక్షరరూప బ్రహ్మము. బ్రహ్మమనగా అవ్యయమైన పరతత్త్వమని గుర్తింపదగును). ఇదే విధముగ వాయువు సూర్యుడు, చంద్రుడు, దిక్కులు, జలము, పృథివి, ఓషధి, ఇంద్రుడు, పర్జన్యుడు, ఈశానుడు, ఆత్మ అనునవి క్రమముగా నాలోని ప్రాణము, కన్నులు, మనస్సు, చెవులు, వీర్యము, శ్రీ, శరీరము, కేశము, బలము, శిరము, క్రోధము, ఆత్మ అనువానిశ్రనా యించిచున్నవి. అవి అన్నియు హృదయమందును, హృదయము విజ్ఞానమయుడగు తనయందును, తాను అమృతమునందును, అమృతము బ్రహ్మతత్త్వమునందును ఉన్నవి. ఈ సూక్తమును ప్రతిదినము జ్ఞాపకముచేసి కొనుటవలన మనస్సు స్థిరపడ గలదు.

శరీరము మరో బలముమీద ఆధారపడి యున్నది. ఆధునిక చికిత్సా క్రమమందును చికిత్సలో రోగికి మనోధైర్యమును గలిగించుట ముఖ్యమని యాచించబడియున్నది. మనస్సు జడపదార్థము. ఆత్మను అంటిపెట్టుకొని యుండుటవలన తెలివితో కూడియున్నట్లు మనకు తోచుచున్నది. కాగా, ఆత్మ బలమువల్ల మనోబలము, మనోబలమువల్ల శరీరబలము పెంపొందుననుటను గుర్తింపవలెను. కాననే శ్రుతులు 'నాయమాత్మా బలహీనేన లభ్యః'' అని బోధించు చున్నవి. ఆధ్యాత్మిక విషయములకే కాదు, లౌకిక సంబంధమైన సర్వ కార్యములందును విజయము పొందుటకు మనో బలము ఆవశ్యకము.

యజుర్వేదమందు ''అప్రతిరథ సూక్తము'' అను మంత్రము లున్నవి. రాత్రి పరుండటకుమున్ను ఈ సూక్తమంత్రముల పఠించుచు భస్మమును అభిమంత్రించి శరీరమున దానిని ధరించుట, లేదా ఒక పాత్రలో మంచి నీరుంచుకొని కుడిచేతితో ఆ పాత్రను మూసికొని మంత్రములను పఠించుటచే అభిమంత్రించి ఆ నీటిని త్రాగి పరుండుటవలనగాని శరీరము వజ్రసన్నిభమగును. అనగా ఏ రోగము లేనిదై భాగా పుష్టి పొంది బలవంతమై యుండునని భావము.

అప్రతిరథ సూక్తము

ఓం ఆశుఃశిశానో వృషభోన భీమోఘనాఘనః క్షోభణశ్చర్షణీనామ్
సఙ్క్రన్దనోనిమిష ఏకవీరః శతంసేనా అజయత సాకమిన్ద్రః॥

సఙ్క్రన్దనేనానిమిషేణ జిష్ణునా యుత్కారేణ దుశ్చ్యవనేన ధృష్ణునా
తదిన్ద్రేణ జయత తత్సహధ్వం యుధోనర ఇషుహస్తేన వృష్ణా।

స ఇషుహస్తైః సనిషఙ్గిభిర్వశీ స స్రష్టా సయుధ ఇన్ద్రో గణేన
సం సృష్టజిత్ సోమపాంబాహుశర్ధ్యుగ్రధన్వా ప్రతిహితాభిరస్తా।

బృహస్పతే పరిదీయా రథేన రక్షోహా మిత్రాగ్ం అవబాధమానః
ప్రభఞ్జన్త్సేనా ప్రమృణోయుధా జయన్నస్మాక మేధ్యవితారథానామ్॥

బలవిజ్ఞాయ స్థవిరః ప్రవీరః సహస్వాన్ వాజీ సహమాన ఉగ్రః।
అభివీరో అభిసత్త్వా సహోజా జైత్రరథమాతిష్ఠ గోవిత్ ॥

గోత్రభిదం గోవిదం వజ్రబాహుం జయన్తమజ్మ ప్రమృణన్తమోజసా।
ఇమం సజాతా అనువీరయధ్వ మిన్ద్రం సఖాయో అనుసంరంభధ్వమ్॥

అభిగోత్రాణి సహసా గాహమానోదయో వీరః శతమన్యురిన్ద్రః।
దుశ్చ్యవనః పృతనాషాడ యుధ్యోస్మాకం సేనా అవతు ప్రయుత్సు॥

ఇన్ద్ర ఆసాం నేతా బృహస్పతిర్దక్షిణా యజ్ఞః పుర ఏతు సోమః।
దేవసేనానా మభిభఞ్జతీనాం జయన్తీనాం మరుతోయన్త్వగ్రమ్ ॥
ఇన్ద్రస్య వృష్ణో వరుణస్యరాజ్ఞ ఆదిత్యానాం మరుతాం శర్ధ ఉగ్రమ్।
మహామనసాం భువనచ్యవానాం ఘోషో దేవానాం
జయతాముదస్థాత్ ॥
ఉద్ధర్షయ మఘవన్నాయుధాన్యుత్సత్వనాం మామకానాం మనాంసి।
ఉద్వృత్రహన్ వాజినాం వాజినాన్యుద్రథానాం జయతాం యన్తు
ఘోషాః।
అస్మాకమిన్ద్రః సమృతేషు ధ్వజేష్వస్మాకం యా ఇషవస్తా జయన్తు।
అస్మాకంవీరా ఉత్తరే భవన్త్వస్మాం ఉ దేవా అవతా హవేషు ॥
అమీషాం చిత్తం ప్రతిలోభయన్తీ గృహాణాఙ్గన్యప్వే పరేహి।
అభిప్రేహి నిర్దహ హృత్సుశోకైరన్ధేన మిత్రాస్తమ సచన్తాసామ్
(యజుర్వే 17/3)

ఈ మంత్రములను గమనికతో అక్షర లోపము గలుగకుండ పారాయణ చేయుచున్న శరీర మన ఆత్మబలములు వృద్ధి పొందుటయేకాదు, కార్యములందు విజయము తప్పక చేకూరును.

## మంత్రజప విధానము

యోగ శాస్త్రమున పతంజలి 'జన్మౌషధి మన్త్ర తపః సమాధి జాః సిద్ధయః' అని పేర్కొనెను. పూర్వ జన్మ సంస్కారమున్న మహనీయులు కొందరు ఎట్టి విశేష సాధనలు చేయకున్నను పుట్టుకతోనే సిద్ధులై యుందురు. కొన్ని దివ్యౌషధులను ఉపయోగించుటవలన కొన్ని సిద్ధులను సాధింపవచ్చును. (ఆకాశయానము, తిరస్కరిణి మున్నగున. కాని ఆమూలికల పేర్లు గూఢముగ నుండుట వలన ఎవరికిని అవి అసాధ్యము లైనవి. (ఈ గ్రంథకర్త బహుకాలము వాని తత్త్వము తెలుసుకొనుటకు ''బోగర్ సప్తకాణ్డమ్'' మున్నగు

గ్రంథములను పరిశీలించియు, పలువురు సిద్ధ వైద్యులను సంప్రదించియు విఫలమనోరథుడై ఆవ్యవహారము మానుకొనెను. వేమన పద్యములలోను 'హేమ తారక విద్య'ను గుఱించి కొన్ని పద్యములు గలవు. వేదమంత్రములలోను ఇట్టి దివ్యౌషధులను గుఱించిన ప్రస్తావనలు ఉన్నవి. కాని వాని యాథార్థ్యమును గుర్తించిన వారు లేరు). మంత్ర సాధనలవలనను ఆత్మహితము, పరహితము సాధింపవచ్చును. విషహరములు, ఆరోగ్యప్రదములు, రోగవినాశకములు అగు మంత్రములెన్నో అథర్వ వేదమున పేర్కొనబడియున్నవి. తపస్సు చేయుటవలన విశ్వామిత్రాదులు బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేయు మహిమ సాధించిరి. సమాధిస్థితిలో భగవాన్ శ్రీరామకృష్ణపరమహంసవలె బ్రహ్మ సాక్షాత్కారము పొందవచ్చును.

మంత్రసిద్ధి పొందగోరువారు యమ నియమ ఆసన ప్రాణాయామములను అవలంబించుట ఆవశ్యకము. సూత్ర ప్రాయముగ అవి ఇట పేర్కొనబడుచున్నవి.

**యమము** :- అహింస, సత్యము, ఇతరుల సొమ్ము అపహరింపకుండుట, అని గీతాచార్యులు పేర్కొన్నట్లు సుఖదుఃఖములు, శీతోష్ణములు, ఆకలి దప్పులు, లాభనష్టములు, మానావ మానములు మున్నగు ద్వంద్వములు లేకుండుట తపస్సునకు లక్షణము. అనగా స్వాధ్యాయము. మంత్రజపము చేయు కాలము పోగా తక్కిన సమయములందు వ్యర్థాలాపములాడక, సద్గ్రంథ పఠనము, భగవంతుని గుఱించిన స్తోత్రాదికములు చదువుట, ప్రణవజపము, వేదమంత్రములు చదువుట మున్నగునవి స్వాధ్యాయమగును. తాను చేయు ప్రతి పనిని ఈశ్వరునకు సమర్పించుట ఈశ్వర ప్రణిధాన మగును.

*యత్కరోషియదశ్నాసి యజ్జుహోసిదదాసియత్ ।*
*యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వమదర్పణమ్ ॥ గీత*

ఏ పని చేసినను ఏది భుజింప బూనినను, ఏది హోమష చేసినను, ఏది ఇతరులకు దానము చేయుచున్నను, ఏ తపష చేసినను దానిని నాకు సమర్పింపుము అని శ్రీ కృష్ణ దివ్యవాణి.

**ఆసనము** :- చక్కగా వీపును వంచక వెన్నెముక సూటి నిట్టనిలువున' నుండునట్లు ముఖము నేరుగా చూచుచుండ పద్మాసనమునగాని, సిద్ధాసనమునగాని తనకు అనుకూలమగుట కూర్చుండట ఆసనము.

సర్వసిద్ధులును ప్రాణాయామముపై ఆధారమై యున్నందు దానిని గుఱించి కొంత వివరించుట ఆవశ్యకము.

యంత్రములను నడపుటకు విద్యుచ్ఛక్తి ఎట్లు ఆవశ్యకమె మన శరీర మను యంత్రమునకు ప్రాణయామము అట్టిది ప్రాణశక్తిని పెంపొందించి ఆయుస్సు, తేజము, బలము మున్నగు వాని ననుగ్రహించునది ప్రాణాయామము. ప్రాణాయామము లేక వైదిక కార్య క్రమము లేదు. ప్రాణాయామ సిద్ధియే సకల యోగసిద్ధులకు ఆధారమైనయట్లు మంత్రసిద్ధికిని ముఖ్యాధారమై యున్నది.

శ్వాస విధానమును క్రమపద్ధతికి తెచ్చుకొనుటవల్ల ఆయుర్వృద్ధి యగుననుటను నవీన ఆరోగ్య శాస్త్రమును నంగీకరించును. కాన ఇహపర సాధనలకెల్ల ముఖ్యమగు దీనిని గుర్తించి అభ్యాసమునకు తెచ్చుకొనుట సుఖహిత జీవనము గోరువారికి తప్పనిసరి యైనది.

హెచ్చు తగ్గులు లేక నిదానముగ, ఒకే క్రమమున ప్రాణవాయువును లోనికిగాని వెలుపలికి వదలుటయే ప్రాణాయామము యొక్క ప్రారంభ దశ.

ఒక్కొక్క ప్రాణియు నిమిషమునకు ఎన్ని మారులు శ్వాసము గొనుచున్నవి? వాని పరమాయు నిర్ణయమెంత? అను విషయమును పరిశోధకులు గణించి యున్నారు.

| ప్రాణి | ఒక నిమిషమునకు గొను శ్వాస | పరమాయుర్దాయము |
|---|---|---|
| కుందేలు | 38-39 | 8 ఏండ్లు |
| పావురము | 36-37 | 8—9 ఏండ్లు |
| కోతి | 31-32 | 20-21 ఏండ్లు |
| కుక్క | 28-29 | 13-14 ఏండ్లు |
| మేక | 23-24 | 11-13 ఏండ్లు |
| పిల్లి | 24-25 | 12-13 ఏండ్లు |
| గుఱ్ఱము | 18-19 | 48-50 ఏండ్లు |
| మనుష్యుడు | 12-13 | 100 ఏండ్లు |
| ఏనుగు | 11-12 | 100 ఏండ్లు |
| సర్పము | 7-8 | 120 ఏండ్లు |
| తాబేలు | 4-5 | 150 |

ఇందువలన తక్కువ సంఖ్యలో శ్వాస పీల్చుకొను అలవాటున్నచో ఆయుర్దాయమును పెంచుకొన వచ్చునని తెలియుచున్నది.

లోనికి పీల్చు శ్వాసము పూరకమని, శరీరములోపలనే ప్రాణవాయువును నిలుపుకొనుట కుంభకమని, వెలుపలికి శ్వాసము వదలుట రేచకమని పేర్కొనబడును.

సాధారణముగ ఆరోగ్యముతో నున్నవారు దినమునకు గొను శ్వాస సంఖ్య 21600. సాధారణముగ లోనికి పీల్చుగాలి ఎనిమిది అంగుళములులోనికి పోవును. వదలునపుడు పండ్రెండు అంగుళ దూరము వ్యాపించును. ఈ పద్ధతిని ప్రాణాయామ పద్ధతి వలన మార్చి లోనగొను గాలి 12 అంగుళములు, వదలుగాలి ఎనిమిది అంగుళముల దూరము వ్యాపించునట్లు చేసిన లోనికికొను ప్రాణశక్తి

ఎక్కువగును. అందువలన శరీరములోని నాడులు చక్కని రక్త ప్రసారణము పొంది శక్తివంతములగును. పండ్రెండంగుళము లనగా నాభీ ప్రదేశము వఱకు వ్యాపించిన వాయువు కుండలినీ శక్తిని ఉద్దీప్తపఱచును. ఇది యోగ సిద్ధులకు దారి చూపును.

ప్రాణాయామమునందు ఆకాశ తత్త్వమునకు చెందిన బొటన వ్రేలు, జలతత్త్వమునకు చెందిన ఉంగరపు వ్రేలు ముఖ్యత్వము వహించును. చూపుడు వ్రేలిని, నడిమి వ్రేలిని (వాయ్వగ్ని తత్త్వములను ఆకాశతత్త్వమునకు చెందిన బొటన వ్రేల మూలమునకు తాకించి, ఉంగరపు వ్రేలితో ఎడమవైపు ముక్కురంధ్రమును అదిమిపట్టి కుడిప్రక్కనున్న ద్వారముతో మెల్లిగా ఒకే వేగముతో శ్వాసమును లోపలికి పీల్చ వలెను. ఈ దశలో పూర్తిగా శ్వాసమును గొనక కొంతమాత్రమేగొని బొటన వ్రేలితో కుడి నాసికారంధ్రమును గూడ అదిమిపట్టి రెండు ద్వారములను బంధించి కొంతసేపు ప్రాణవాయువును లోపలనే ఉంచి తర్వాత ఉంగరపు వ్రేలిని వదలించి ఎడమ నాసిక ద్వారా ఒక క్రమ (నిదాన)ముగా వదలవలెను. పీల్చు సమయమునకన్న ఎక్కువ నిదానముతో క్రమమైన నడకలో ఉండునట్లు విడువవలెను. పూర్తిగా శ్వాసమును విడిచి ఒక నిమిషము సాధారణముగా శ్వాసగొనివదలి తర్వాత కుడి రంధ్రమును మూసికొని ఎడమ రంధ్రముతో శ్వాసముగొని లోన బంధించి యుంచి కుడినాసికా రంధ్రముతో వదలవలెను. ఇట్లు కొంతకాలము ప్రతిదినము శ్వాసక్రియను అభ్యాసము చేసిన పిదప నాలుగు మాత్రల కాలమున శ్వాసము పీల్చి పదహారు మాత్రల కాలము లోన బంధించి దానిని ఎనిమిది మాత్రా కాలమునకు వదలవలెను. శ్వాస వదలునపుడు 'గుప్పు'మని వదలక మిక్కిలి నిదానముగ పీల్చు సమయమునకు రెండింతల కాలమునకు విడువవలెను. ఇట్లు, అభ్యాసము చేయుచు కాలమును పెంచి పదునాఱు మాత్రల కాలములోనికి పీల్చి అరవైనాలుగు మాత్రల కాలము బంధించి ముప్పది రెండు మాత్రల కాలమునకు విడువవలెను. ఈ క్రమము ప్రాణాయామము సిద్ధించుటలో

ఒకదశ ముగిసినట్లు. ప్రాణాయామమునందు అనేక దశ లున్నవి. వానిని యోగ నిపుణులవలన తెలిసికొని సాధింపవచ్చును. జపసిద్ధికి మొదట చెప్పిన దశ వఱకు సాధింపగలిగిన చాలును.

ప్రాణాయామము అభ్యసించు కాలమున కడుపున ఆహారము ఉండరాదు. భోజనము చేసిన తర్వాత నాలుగు గంటలు గడచిన పిదపనే ప్రాణాయామము అభ్యసింపదగును. లేదా అభ్యాసము ముగిసిన తర్వాత గంటసేపు ఉండి తర్వాతనే ఆహారము భుజించవలెను. నీళ్ళు త్రాగే టట్లయిన పదునైదు నిమిషములతోలి తర్వాత త్రాగవలెను. మితమైన గాలి ప్రసరము గలచోటనే దీని నభ్యసింపవలెను.

ప్రాణాయామము అభ్యసించువారు తైలాభ్యంగము చేసికొనరాదు. అందుకు మాఱుగ కల్పమును (ప్రైపూతను) పూసికొని కొన్ని నిమిషములుండి తర్వాత స్నానము చేయవలెను

కల్పవిధానము : తెల్ల మిరియాలు 10 పలములు, బాదము పప్పు $2^1/_2$ పలములు, కస్తూరి పసుపు $2^1/_2$ పలములు, కరక్కాయ తొక్క $2^1/_2$ పలములు, ఉసిరిక వరుగు $2^1/_2$ పలములు, కచోరములు $2^1/_2$ పలములు వేపవిత్తులలోని పప్పు $2^1/_2$ పలములు బాగుగ ఎండించి దంచి మూడు పలముల పొడిని పావుసేరు ఆవుపాలలో కలిపి శరీరమునకు పూసికొని అరగంటసేపైన తర్వాత సూర్యోదదయమునకుమునుపు చన్నీళ్ళలో స్నానము చేయుచు వచ్చిన ప్రాణాయామాభ్యాసము వలన శరీరమున వికృతి కలుగక ఆరోగ్యము పెంపొందును.

**జపమాల** :- జపమునందు సంఖ్యానియమము [illegible] ఔషధమునకు మోతాదు ఎట్లు అవశ్యకమో జపమునకు సంఖ్యానియమము ముఖ్యము. ఏదైన కారణవశమున ఎక్కువ చేసిన తర్వాత దినములలోను, ఆ సంఖ్యకు తగ్గనట్లు జపము చేయవలెను [illegible]

మన ఇష్టము వచ్చిన సంఖ్యలో చేయరాదు. సంఖ్యాహీనముగశ చేసిన పుణ్యము కలుగునుగాని జపసిద్ధి కలుగదు. ఏదైన అసందర్భమువలన ఒకనాడు మానుకొన్నప్పుడు తర్వాతి దినమున ఇష్టదైవమును ప్రార్థించి ఆ సంఖ్యను గూడ పూర్తిచేసికోవచ్చును. జపసంఖ్య లెక్కించుకొనుటకు జపమాల ఆవశ్యకము.

*అరిష్ట పత్రం బీజంచ శంఖ పద్మౌమణిస్తథా ।*
*కుశగ్రన్థిశ్చ రుద్రాక్ష ఉత్తమంచోత్తరోత్తరమ్ ॥*

కుంకుడు చెట్టు ఆకులు, కుంకుడు విత్తులు, శంఖము, తామర పూసలు, మణి, దర్భ ముళ్ళు, రుద్రాక్ష అనువానితో నూటెనిమిది సంఖ్యగలవి మాలగా గ్రుచ్చి జపమునకు ఉపయోగింప వచ్చును. వీనిలో వరుసగా ఉత్తరోత్తరము శ్రేష్ఠమైనది.

*ప్రవాళముక్తాస్ఫటికైః జపః కోటిఫలప్రదః ।*
*తులసీమణిభిర్యేన గణితం చాక్షయం ఫలమ్ ॥*

పవడము, ముత్తెము, స్ఫటికమణి, తులసి పూసలు అనునవి జపమాలకు ఉపయుక్తములు. ఇవి కోటి మడంగులు ఫలము నిచ్చును. తులసిమాల అక్షయమైన ఫలము నిచ్చును.

అథర్వవేదము ఈ మణులను ధరించుటవలన గలుగు ఫలితములను ఎంతో ప్రశంసించుచున్నది. 'మణి మంత్రౌషధ సిద్ధుల'ని పూర్వులు అందురు. ఇక్కడ మణి శబ్దమునకు రత్నములే కాక పలువిధములైన ఓషధుల కట్టెలవలన తయారుచేసిన మణులను గూడ పరిగణింపవలెను. పట్టునూలు, రాగి, వెండి, బంగారు, తీగలలోనొకటి మణులను బంధించుటకు సూత్రముగా నుపయోగింపవలెను. జపమాలలో 108 పూసలుండుట మంచిది.

*వస్త్రేణాచ్ఛాద్యతుకరం దక్షిణం యః సదా జపేత్ ।*
*తస్య స్యాత్ సఫలం జాప్యం తద్హీనమఫలం స్మృతమ్ ॥*
*అత ఏవ జపార్థం సా గోముఖీ ధ్రియతే జనైః*
*యక్షరక్షః పిశాచాశ్చ సిద్ధ విద్యాధరాగణాః ।*
*యస్మాత్ ప్రభావం గృహ్ణంతి తస్మాత్ గుహ్యంతు కారయేత్ ॥*

కుడిచేతిని వస్త్రముతో మూసికొని నడిమి వ్రేలిమధ్య జపమాలను ధరించి బొటన వ్రేలితో నిదానముగ పూసలను త్రిప్పుచు జపము చేయవలెను. పూసలు, పట్టు దారము, లేదా లోహపు కమ్మీలు, నడిమి వ్రేలైన అగ్ని తత్త్వముగల వ్రేలు, ఆకాశ తత్త్వముగల బొటకవ్రేలు వీని సంబంధము ఆకాశ అగ్ని తత్త్వాత్మక అక్షర రూపమంత్ర సిద్ధికి ఉపకరించుననుట గమనార్హము. వాయుతత్త్వ ప్రధానము గల చూపుడువ్రేలు జపమాలను తగులరా దనుటయు గమనింపతగ్గది. వాయువు అగ్నియొక్క క్రమగతిని చెదరి పోవునట్లు చేయును. ఇక, వస్త్రముతో మూసికొనవలెననియు, లేదా గోముఖాకృతిగల సంచిలో చేతిని ఉంచుకొని జపము చేయవలెనన్న విధి గుర్తింప తగ్గది. ఇట్లు మూసికొనకున్న యక్ష, రాక్షస, పిశాచ బాధలు కలుగు ననుట గమనార్హము.

ఈ యక్ష రాక్షస పిశాచములేవి?

*యే కృమయః పర్వతేషు వనేషు ఓషధీషు పశుషు అప్స్వన్తః*
*యే అస్మాకం తన్వమావివేశుః సర్వం తద్ధన్మి జనిమ ॥*

(అథర్వవేద 2,31,3)

పర్వతములందు, వనములందు, స్థావరములందు పశువులందు నీళ్ళయందు నివసించుచు శరీరములో ప్రవేశించి రోగముల పుట్టించు క్రిమములను చంపి వేయుదము.

*యేగన్ధర్వా అప్సరసో యేచారాయాః కిమీదినః ।*
*పిశాచాన్ సర్వాన్ రక్షాంసి తానస్మద్భూమే యావయ ॥*

(అథర్వ 12.1.5)

భూమిమీద గంధర్వ - అప్సరస - అరాది, కిమీదిన, రాక్షస, పిశాచములను పేర్లుకల జీవాణువులు ఏవి కలవో వానిని దూరముగా ఉంచెదము. అనగా వానిని నాశము చేయుదము.

ఇట్లు అనేక మంత్రములలో పలు విధ రోగములను కలిగించు జీవాణువులను గుఱించిన వివరములు అథర్వణ వేదములో స్పష్టముగా

చెప్పబడియున్నవి. వాసన వలన ఆకర్షింపబడునవి గంధర్వముల నీళ్ళలో ఉండునవి అప్సరసములు, బాధను కలిగించనని రాక్షసముల రక్తమును త్రావుటలో ఆసక్తికలవి అసురములు. ఇత్యాదిగా మహీధరు వేద వ్యాఖ్యలో వివరణ లున్నవి. (రోగములు క్రిములవల్లనే కలుగుని ఇప్పటి పాశ్చాత్యులే కనుగొన్నారని పుస్తకములలో వ్రాయబ యుండుట ఎంత అసంబద్ధమో పాఠకులు గ్రహింపగలరు. వైద శాస్త్రములో పిశాచ రాక్షసాది శబ్దములు వచ్చినచోట రోగక్రిముల స్పష్టముగా చరక సుశ్రుతాదులు పేర్కొని యున్నారు. రోగవిముక్తి ఆరోగ్య వర్ధకము, ముఖ్యోద్దేశ్యములైన జప విధానమునకు అ విఘ్నములు కలిగింపకుండ చేసికొనవలెనని తాత్పర్యమ గ్రహించుచునది.)

(మన పూర్వులు ఏర్పఱచిన సంప్రదాయములు, ఆచా వ్యవహారములు విజ్ఞానాత్మక పరిశీలనవలన ఎంత ఉన్నతములోగుర్తింపక ఛాందసులు మూఢాచారపరాయణులని పూర్వులను మనవారే పరిహసించుట తన వ్రేలితో తన కంటిని తానే పొడుచుకొనుట వంటి అజ్ఞాన కృత్యమని పాఠకులు గుర్తింప ప్రార్థన).

## మంత్రాంగములు

ఇక మంత్ర జపమున ఏయే అంశములు ముఖ్యములో గమనింతము.

సంకల్పము మంత్రద్రష్టయగు ఋషి ప్రార్థన, ఛందస్సు, మంత్రారాధ్య దైవ ప్రశంస , అంగన్యాస కరన్యాసములు, హృదయాది న్యాసములు, ఆవాహన, ధ్యానము, మంత్ర జపము, ఫలత్యాగము, ఉద్వాసన అనునవి మంత్ర జపమున ముఖ్యాంశములు.

**సంకల్పము :** ఏ పనికైనను మనస్సును క్రియలో కేంద్రీకరింపజేయుట ముఖ్యము. అందుకై సంకల్పము అను విధానము ఏర్పఱుపబడి యున్నది. ఋషి: చందస్సు: ప్రతి మంత్రమునకు మొట్టమొదట ఆ మంత్రమును కనుగొని లోకమున ప్రవర్తింపచేసిన

ఋషి, ఆ మంత్రమునకు చెందిన ఛందస్సు (మంత్ర లక్షణము) మంత్రము వలన ఆరాధ్యమగు దేవత ఉండును. వారిని స్మరించుట ముఖ్య కర్తవ్యము.

ప్రతి మంత్రమునకును అంగన్యాస కరన్యాస హృదయాది న్యాసములు నిర్ణయింపబడియున్నవి. ''దేవోభూత్వా దేవం జపేత్'' అని సూక్తి. మంత్ర జపమువలన కలుగు దైవిక శక్తిని ధరించుటకు అనగా శరీరమున్న నిలుపుకొనుటకు వలసిన శక్తి ఆవశ్యకము. కాన మంత్రాక్షరములతో శరీరమును శక్తివంతము చేసికొనుట ముఖ్యము. అందుకై అంగన్యాస కరన్యాస హృదయాదిన్యాసములను అనుసరించి మంత్రాక్షరముల శరీరావయవములందు హృదయాది అంగములందు నిక్షేపించుకోవలెను.

తర్వాత దేవతను ఆహ్వానించి, మంత్రధ్యాన శ్లోకమును పఠించుచు ఆ మూర్తిని హృదయ కమలమున ప్రతిష్ఠించుకొనవలెను.

ఫలత్యాగము, తర్వాత విధి ప్రకారము మంత్రజపము చేసి కడపట ఆ జపమువలన ఫలితమును భగవదర్పణము గావింపవలెను. ఇది సాత్త్విక త్యాగము అనబడును. 'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన' అని గీతా వాక్యము. కర్మఫలమును భగవదర్పణము గావించినచో మనము చేసిన జప విధానమునగల లోపములన్నియు తొలగి పోవుటయేగాక ఆ ఫలము ఎన్నో రెట్లు అధికమై మనకు మఱల ఫలము నిచ్చును. మంత్రజపముచేత భగవంతుని సంతుష్టి పరచుటయే మనకర్తవ్యము. ఎట్టి ఫలితము నీయవలెనో ఆ ప్రభువునకే వదలివేసినచో అపార కరుణామయుడు అనంత ఫలముల నీయగలడు.

క్షమాపణ - ఉద్వాసన, జపము ముగిసిన తర్వాత చేసిన క్రియలోగల లోపములను క్షమింపలసినదని ప్రార్థించుచు సాష్టాంగ నమస్కారము గావించి పిదప ఆహ్వానించిన స్వామిని యథా స్థానమునకు వెళ్ళవలసినదని ప్రార్థింపవలెను. లౌకికములైన, అశుద్ధములైన పనులు చేయవలసి వచ్చును గనుక హృదయ

క్షేత్రమునందే స్వామిని ప్రార్థించి ఉంచుకొనుట భావ్యము కాదు. మనలో భగవంతుడు తానై నెలకొనియుండట వేఱు జపధ్యాన సమయమున మనము చేయునది ఆహ్వానము, మన ఇచ్ఛ. మనమై ఆహ్వానించి అగౌరవకరములగు కృత్యములు చేయరాదనుటకే ఉద్వాసన చేయు విధానము ఏర్పడి యున్నది. ఎల్లప్పుడు భగవంతుడు మనలో తానై నెలకొని యున్నాడను నిశ్చయాత్మక జ్ఞానము కలిగెనా! అంతకు మించిన అదృష్టము లేదు. అట్టివాడు తెలిసి తెలిసి ఏ అకృత్యమును చేయడు గదా!

## మంత్ర బీజాక్షరములు

పృథ్వికి చెందిన ఒక సూక్ష్మ అణువులో ఎంత మహత్తర శక్తి యున్నదో మనకు నేడు తెలియును. జలాణువులో ఉన్న శక్తియు అనుభవగత మైనది. ఈ శక్తులు ఏ మానవుని చేతను నిక్షేపింపబడలేదనీ, ప్రకృతి సిద్ధమైన వనియు తెలియును. అట్లే తక్కిన భూతాణువులలోను ప్రకృతిసిద్ధమైన శక్తి అణగి యున్నది. అక్షరములు ఆకాశ తత్త్వమునకు చెందినవి, గనుక వానిలోను గొప్ప శక్తి అంతర్గతమై యుండుటను పూర్వ ఋషులు తమ యోగసిద్ధి వలన గుర్తించుటయేగాక, ఒక క్రమమున వానిని ఉచ్చరించినచో మనలోని శక్తి యుద్దీప్తమగుననుటను అనుభవము వలన గుర్తించి యున్నారు. సృష్ట్యాదిలో అప్రాకృత పరమేష్ఠి మండలమున పరతత్త్వ సంకల్పము వలన తోచినవి అక్షరములు. ఒక్కొక్కటియు ఒక్కొక్క శక్తికి నిధి ఆయా శక్తికి అధిష్ఠాన దేవతల పేర్లనియు చెప్పవచ్చును.

విత్తనమున చెట్టు యొక్క భాగములన్నియు నిక్షిప్తములై యుండుటయు, కృషీవలుడు వానికి నీరు పారించిన మొలచి ఫలితము నిచ్చుటయు మనకు తెలిసినదే. ఒక వృక్షమునకు చెందిన విత్తనములను నలుగురి కిచ్చి పెంచగోరినపుడు అట్లు పెంచినవారి కందరికి సమానమగు ఫలము ఏర్పడుట లేదు. కాయ లేదా

పండు పరిమాణము, రుచి, ఫలముల సంఖ్యమున్నగువానిలో భేదము లుండుటయు చూచుచున్నాము. వారికి కృషి చేయుటలోగల లోపము సామర్థ్యము తగినంత నీరు, ఎరువు మున్నగు వానిని చేర్చుటలో గలుగు మార్పు మున్నగునవి ఫలితములోని తారతమ్యములకు కారణములగును. అట్లే సాధన చేయువారిలోను గల చిత్తశుద్ధి, క్రమ విధానమును పాటించుటలో గల నేర్పు మున్నగువానినిబట్టి ఫలమున వ్యత్యాసము లేర్పడుచున్నవి.

మంత్ర శాస్త్రమునందు బీజాక్షరముల తత్త్వము క్రింది విధమున పేర్కొనబడియున్నది.

'అ' మృత్యునాశకము (వాసుదేవ స్వరూపము, స్వరము, కంఠస్థానీయము, హ్రస్వాక్షరము..

'ఆ' ఆకర్షణము చేయునది, స్త్రీలింగము, దీర్ఘస్వరము.

'ఇ' పుష్టిని కలిగించునది, నపుంసకలింగము హ్రస్వస్వరము.

'ఈ' ఆకర్షణము చేయునది..

'ఉ' బలమొసంగునది..

'ఊ' ఉచ్చాటనము చేయనది (ఒక వస్తువునుగాని వ్యక్తినిగాని యథాస్థానము నుండి తొలగించుట ఉచ్చాటన మగును)..

'ఋ' క్షోభను లేదా స్తంభనము కలిగించును. అనగా కదలకుండ జేయును..

'ౠ' మోహమును కలిగించును..

' ' పరస్పరము ద్వేషమును కలిగించును..

' ' ఉచ్చాటనమును గలిగించును..

'ఏ' వశ్యము చేయును. (ఇతరులను తనకు లోబఱచుకొనుట వశ్యము చేయుట.).

'ఐ' పురుష వశ్యము చేయును..

'ఓ' లోకవశ్యము చేయును..

'ఔ' రాజవశ్యము చేయును..

'అం' ఏనుగు మున్నగు జంతువుల వశపఱచుకొన నుపయోగించును..

'అః' మృత్యునాశకము..

'క' విషబీజ మగును.

'ఖ' స్తంభన బీజము.

'గ' గణపతి బీజము.

'ఘ' స్తంభన బీజము, తంత్ర శాస్త్రములో ఇది మారణ గ్రహణములకు ఉపయోగించు బీజముగా చెప్పబడి యున్నది..

'ఙ' అసుర బీజము.

'చ' చంద్ర బీజము.

'ఛ' లాభ బీజము, మృత్యునాశకము.

'జ' బ్రహ్మరాక్షస బీజము.

'ఝ' చంద్రబీజము, ధర్మార్థ కామమోక్షముల నిచ్చునది.

'ఞ' మోహన బీజము.

'ట' క్షోభమును కలిగించును. చిత్తచాంచల్యము కలిగించును..

'ఠ' చంద్ర బీజము, విషమును, అపమృత్యువును పోగొట్టును.

'డ' గురుడ బీజము

'ఢ' కుబేర బీజమంత్రము ఉత్తరదశ ముఖముంచి నాలుగు లక్షల జపముచేసిన ధనధాన్యములు వృద్ధి పొందును..

'ణ' అసురబీజ మంత్రము.

'త' ఎనిమిది వస్తువుల బీజ మంత్రము.

'థ' యమ బీజము, మృత్యుభయమును పోగొట్టును..

'ద' దుర్గాబీజ మంత్రము వశ్యము, పుష్టి కలిగించును..

'ధ' సూర్యబీజ మంత్రము, యశము, సుఖము, బుద్ధినిచ్చును.

'న' జ్వరనాశిని ఏకాహ, త్ర్యాహిక జ్వరములను, విషజ్వరము వరుస జ్వరముల మాన్పును..

'ప' వీరభద్ర, వరుణ బీజ మంత్రములు.

'ఫ' విష్ణు బీజమంత్రము - ధనధాన్య వృద్ధి చేయును.

'బ' బ్రహ్మ బీజమంత్రము - వాత, పిత్త, కఫములు తగ్గును.

'భ' భద్రకాళీ బీజము - భూత, ప్రేత, పిశాచములవలని కష్టముల తీర్చును.

'మ' మాల, అగ్ని, రుద్రబీజము స్తంభనము, మోహన కర్మ మున్నగువానికి ఉపయోగించును. అష్టసిద్ధులకు కారణమగును..

'య' వాయు బీజము - ఉచ్చాటన కారకము.

'ర' అగ్ని బీజము - అగ్నికార్య సిద్ధిని కలిగించును.

'ల' ఇంద్ర బీజము - ధన, ధాన్య సంపత్తులను వృద్ధి చేయును.

'వ' వరుణ బీజము - విష మృత్యుభయముల తీర్చును.

'శ' లక్ష్మి బీజము - లక్ష సార్లు మంత్ర పఠనము చేసిన లక్ష్మి అనుగ్రహము కలుగును.

'ష' సూర్య బీజము - జ్ఞానసిద్ధి, వాక్సిద్ధి కలిగించును.

'స' వాణీ బీజము - జ్ఞానసిద్ధి, వాక్సిద్ధి కలిగించును.

'హ' ఆకార బీజము - శివబీజము.

'క్ష' పృథ్వీ బీజము - నృసింహ భైరవ బీజమంత్రములు.

ఈ అక్షరములు జపము చేయునపుడు బిందువుతో కూడి 'అం' 'కం' అను విధమున జపము చేయవలెను. ప్రారంభమునగాని అంతమునగాని 'హ్రీం' అను బీజాక్షరమును చేర్చుకోవలెను. అక్షరబీజ మంత్రములను వేఱుమంత్రము చేర్చక జపసిద్ధి పొందవచ్చునుగాని చాల ఆలస్య మగును. మంత్రముతో చేర్చి జపించుట శీఘ్రఫల మిచ్చును.

రెండు, మూడు వర్ణములు సంయుక్తములై బీజాక్షరములగుటయు కలదు.

మంత్రశాస్త్రములలో వీనిని గురించిన విపులమైన వర్ణనలు, వ్యాఖ్యలు ఉన్నవి. నిదర్శనమునకు కొన్ని మాత్రమిట సూచింపబడుచున్నవి.

'హ్రీం' తంత్రశాస్త్రమున నిది ముఖ్యమైనది. దీని వివరణ :-

'హ'-శివుడు, 'ర' ప్రకృతి, 'ఈ' మహామాయ, నాదము విశ్వమాత, బిందువు. దుఃఖనాశము దీని అర్థమేమన, శివసహిత విశ్వమాత మహామాయాశక్తి నా దుఃఖములను పోగొట్టునుగాక (ఇది శక్తి లేదా మాయా బీజమనియు చెప్పబడును).

'శ్రీం' శ-మహాలక్ష్మి, ర-ధనము, ఈ-పుష్టి నాదము విశ్వమాత, బిందువు దుఃఖనాశము. ధనమునకు, తుష్టికి, పుష్టికి అధిష్ఠాన యగుదేవి నాదుఃఖమును పోగొట్టును గాక.

'క్రీం' 'క' కాళి, ర-బ్రహ్మ, ఈ - మహామాయ, నాదము - విశ్వమాత, బిందువు దుఃఖనాశము. బ్రహ్మ శక్తిరూపిణీ మహామాయ కాళిదేవినాదుఃఖమును పోగొట్టగాక.

'స్త్రీం' 'స్' దుర్గోత్తారణము, 'త' తారణ ముక్తి 'ఈ' మహామాయ, నాదము-విశ్వమాత, బిందువు దుఃఖనాశము, ముక్తిరూప, విశ్వమాత, తారిణి, దుర్గాతారిణి భగవతి మహామాయ దుఃఖములనుండి మమ్ము రక్షించుటగాక 'గం' గణేశుడు, బిందువు, దుఃఖ నాశము గణేశుడు నాదుఃఖమును పొగొట్టుగాక.

'హూం' ఇది కూర్చబీజము. 'హ' శివుడు. ఊ-భైరవుడు, నాదము సర్వోత్కృష్టము బిందువు-దుఃఖనాశము, సర్వోత్కృష్టుడు అసురభయంకరుడు శివుడు దుఃఖములను పొగొట్టును గాక.

'ప్రౌం' 'హ' శివుడు, ఓ సదాశివడు, బిందు దుఃఖనాశము సదాశివుని కృపవలన నాదుఃఖములు తొలగునుగాక. ఇది ప్రసాద బీజమనబడెను.

'క్లీం' ఇది కృష్ణ బీజము, కామబీజము. 'క' కృష్ణుడు లేదా కాముడు. 'ల' ఇంద్రుడు 'ఈ' - తుష్టి బిందువు సుఖశాంతులు ఇచ్చునది. భగవాన్ శ్రీ కృష్ణుడు నాకు సుఖశాంతు లిచ్చును గాక,

'క్ష్రౌం' క్ష-నృసింహుడు, ర-బ్రహ్మ, 'ఔ'-ఊర్ధ్వ హస్తము బిందు దుఃఖనాశము. బ్రహ్మరూపి, ఊర్ధ్వ దన్తములోగల నృసింహస్వామి దుఃఖముల పోగొట్టునుగాక.

## జపవైవిధ్యము

జపములు. అనేక విధములు వానిలో కొన్ని ఇట వివరింపబడుచున్నవి.

1. **నిత్యజపము :** – స్థూల శరీరము పరిశుద్ధముగా నుండుటకు స్నానాది శౌచ క్రియలు విధింపబడియున్నవి. వ్యాయామము, భోజనము మున్నగువాని వలన స్థూల శరీరమును ఆరోగ్యవంతముగ బలముతో కూడినదిగ చేసికొనుచున్నాము. అదే విధముగ సూక్ష్మ శరీరమును బలము కలదిగా, పరిశుద్ధముగా, మనస్సులో దుష్ట శక్తివల్ల, చెడు తలంపులవల్ల మలినములు చేరుకుండగా రక్షించుకొనుటకు నిత్యము సంధ్యోపాసన చేయవలెను, గాయత్రీమంత్రజపము బుద్ధి వికాసమును, సూక్ష్మశరీరమునకు పవిత్రత, బలము మున్నగువానిని ఇచ్చును. కాన ఇట్టి నిత్యజపము అవశ్యాచరణీయము. గాయత్రితోపాటు, నారాయణ అష్టాక్షరి శివమంత్రాదులు, ఇష్ట దేవతా మంత్రజపము ఆవశ్యకము.

2. **నైమిత్తిక జపము :**– అమావాస్య, మహాలయపక్షము, పితృ తిథి మున్నగు దినములలో పితరులను గుఱించి శ్రాద్ధము, తర్పణము,

వారికొరకైన మంత్రోచ్చారణ మున్నగునవి చేయుచున్నాము. మనము వారిని ఉద్దేశించి అర్పించు పిండము, జలము మున్నగునవి వారికి పోయి చేరుచున్నవా? అనికొందరు ప్రశ్నింతురు. పితరులకు భౌతిక శరీరము లేదు. కాని సూక్ష్మ శరీరము కలదు. కాన వారిని ఉద్దేశించి సమర్పించడిన వానిలోని మానసిక - సూక్ష్మాంశము వారిని తప్పక చేరుకొనును. వారు మానసికముగ ఒసగు ఆశీర్వాచనములు మన మనస్సును చేరుకొనును. (ఈ విషయమును గురించిన మరికొన్ని విశేషములు 'వేద విజ్ఞానము'ను గ్రంథమున వివరింపబడును.)

3. **కామ్యజపము :-** ఏదైన లౌకిక కార్యజయములు, ధన, ధాన్యాది వస్తువుల ప్రాప్తి మున్నగువానికై ఆయా ఫలము అనుగ్రహించు దేవతల మంత్రజపము కావించుట కామ్యజప మగును.

4. **ప్రాయశ్చిత్త జపము :-** ప్రారబ్ధ కర్మములవలన కలిగిన కష్టములను రోగములను నివర్తి చేసికొనుటకు చేయు జపము ప్రాయశ్చిత్త జప మగును.

5. **అచలజపము :-** కార్యసిద్ధికై సాధకుడు నిత్యము నియమిత సంఖ్యవరకు జపము చేయవలె ననియు, జపము పూర్తియగు వఱకు ఆసనము నుండి కదలరాదనియు దృఢ నిశ్చయము చేసికొని కదలకుండ స్థిరముగ కూర్చుండి చేయు జపము అచల జపము.

6. **చలజపము :-** పనిపాటలు చేసికొనుచున్నప్పుడు, ఏ పనియు చేయకుండునపుడు ఏ పరిస్థితిలోనైనను భగవన్నామమును ఉచ్చరించుచుండుట చలజప మగును. పరుండి గూడ భగవన్నామమును ఉచ్చరింపవచ్చును. ఈ అభ్యాసమువలన మనస్సున చెడు తలంపులు, పనికిమాలిన ఆలోచనలు కలుగకుండ నివారించుకొనవచ్చును.

7. **వాచిక జపము :-** మంత్రములను గట్టిగా ఉచ్చరించుచు చేయు జపము. ఇది ఉత్తమ పద్ధతికాదని శాస్త్రకారుల మతము. ఏలన మనము ఉచ్చరించు శబ్దమును మన శ్రవణేంద్రియము గ్రహించుచుండును. మనస్సు అచంచలముగా దైవమును, ధ్యానించుటకు విఘ్న మేర్పడును. అయితే హోమాదులు చేయునపుడు, భగవంతుని పూజాది సందర్భములందు దేవునికి వినిపించు రూపముననను, జపఫలము పరులకు చెందవలసినదిగా నున్నప్పుడును, ఆత్మార్థముగగాక, లోక క్షేమాదులకై చేయునపుడు మంత్రపాఠాదికములు ఉచ్చైస్స్వరమున గావింపబడును. అట్టి సందర్భములలో ఇది ఆవశ్యకము.

8. **ఉపాంశు జపము :-** మంత్ర జపము ఇందు పెదవి కదలింపుతో జరుగును. సమీపముననున్న వారికి కూడ వినరాదు. ఇట్టి జపము సూక్ష్మ స్థూల శరీరము దగ్గరకు దుష్ట శక్తులు రాకుండ ఆపు ననియు, బాహ్యావృత్తులు అంతర్ముఖము లగు ననియు శాస్త్రము చెప్పును.

9. **భ్రమర జపము :-** తుమ్మెదఝంకారము చేయుచున్నట్లు, ఝుంకారము చేయు చున్నట్లు ప్రణవాదులను జపము చేయుట భ్రమరజపము అనబడును. ఇందు పెదవి కదలికగాని, నాలుక కదలికగాని ఉండదు. పిల్లనగ్రోవి ఊదుచున్నట్లు ప్రాణవాయువునకు మంత్రాక్షరములతో సంయోగము ఉండును. ఇంచుక శ్రమపడి అభ్యసింపవలసిన విధాన మిది. ఇందువలన అనాహతనాదమును సాధింపవచ్చును. మూలాధారాది షట్చక్రముల వికాసమునకు ఈ జపవిధానము సహకారి యగును. ఆంతరంగిక తేజము ఈ విధానమువల్ల ప్రకాశవంత మగును.

10. **మానసిక జపము :-** జపవిధానములలో ఇది అత్యుత్తమ మైనదిగా శాస్త్రములు పేర్కొనుచున్నవి. మంత్రాక్షరము, పదము, అర్థములందు మనస్సులగ్నమై యుండును.

మంత్రమును నోటితో ఉచ్చరించుట యనునది స్థూల రూపమున నుండును. దాని ఫలితమును పరిమిత మైన దగును. మనస్సు ద్వారా జపము చేయుట వలన నది అత్యంత సూక్ష్మమగుటవలన, సూక్ష్మ శరీరములోని సూక్ష్మమనోవికాసమునకు ఎంతగానో ఉపయోగపడును. అత్యంత సూక్ష్మమై నాడులలో చక్కగా వ్యాపించి హృదయములో దహరాకాశమందలి శ్రీ కృష్ణజ్యోతిని మూలాధార శక్తి చేరుకోగలదు. అందువలన ఆత్మజ్యోతిప్రకాశము ఏర్పడును.

ఇంతవఱకు జపయోగమును గుఱించిన వివిధవిషయములు వివరింపబడినవి. ఇక మృత్యుంజయ మంత్ర జపవిధానము, ప్రక్రియ వివరింపబడును.

## మృత్యుంజయ మంత్ర జపము

స్నాతుడై, విశుద్ధ మనస్సుతో ధ్యానప్రదేశమును, చేరుకొని ముందు ఇష్టదైవమునకు సాష్టాంగముగ నమస్కరించవలెను. మనస్సును ప్రసన్నముగా భగవంతుని స్మరణకు అవకాశము లభించినందులకు సంతోషము, జప విధానాచరణమున ఉత్సాహము వెల్లివిరియుచుండ ఆసనమున కూర్చుండి ''స్వామీ! జపము ప్రారంభించుటకు అనుమతి ఇమ్ము. జపము ముగియువఱకు నా మనస్సున నెలకొని మనస్సు చంచలముగాకుండ కాపాడుము'' అని ప్రార్థించి, క్షణముసేపు ఆతని దయారసపూర్ణమైన వీక్షణము తనమీద ప్రసరించుచున్నదన్న అనుభవమును మనస్సునకు తెచ్చుకొనవలెను. ఆచమన ప్రాణాయామములుచేసి సంకల్పము ప్రారంభింపవలెను.

## దేశకాలముల పేర్కొని,

మమ శరీరే జ్వరాదిరోగ నిరాసనద్వారా సద్యః ఆరోగ్యాభివృద్ధ్యర్థం, గ్రహదోష మారకేశదోష సకలఆధివ్యాధి వినాశనార్థం జన్మజన్మాంతర విహిత దురిత క్షయార్థం శ్రీ మహామృత్యుంజయ ప్రీత్యర్థం ( ఇక్కడ

తాను ఉద్దేశించిన జపసంఖ్య పేర్కొనవలెను) సంఖ్యాపరిమిత శ్రీ మహామృత్యుంజయ మంత్ర జప మహం కరిష్యే.

ఓం గురవేనమః, ఓం గణపతయేనమః, ఓం స్వేష్ట దేవతాయై నమః

ఓం అస్య శ్రీ మహామృత్యుంజయ మంత్రస్య వామదేవ కహోల వసిష్ఠాది ఋషయః, పంక్తిగాయత్ర్యనుష్టుప్ఛన్దాగ్ంసి, సదాశివ మహామృత్యుంజయ రుద్రా దేవతాః, శ్రీ బీజమ్ హ్రీం శక్తిః, మహా మృత్యుంజయ ప్రీతయే జపే వినియోగః

అంగన్యాసః -

*వామదేవ కహోల వసిష్ఠ ఋషిభ్యోనమః శిరసి,*
*పంక్తిగాయత్ర్యనుష్టుప్ ఛన్దేభ్యోనమః ముఖే,*
*సదాశివ మహామృత్యుఞ్జయరుద్రదేవతాభ్యోనమః హృదయే*
*శ్రీ బీజాయనమః గుహ్యే, హ్రీం శక్తయే నమః పాదయోః*

కరన్యాసః - ఓం హౌం ఓం జూం సః భూర్భువ స్వః త్ర్య మ్బకమ్ ఓం నమోభగవతే రుద్రాయ శూలపాణయే నమః - అంగుష్ఠాభ్యామ్ నమః
ఓం హ్రీం ఓం జూం సః ఓం భూర్భువ స్వః, యజామహేభగవతే ఓం రుద్రాయ అమృతమూర్తయే మాం జీవయ - తర్జనీభ్యాంనమః
ఓం హౌం ఆం జూం సః భూర్భువస్సువః సుగంధింపుష్టివర్ధనం ఆం నమో భగవతే రుద్రాయ చంద్రశిరసే జటినే మధ్యమాభ్యాం నమః
ఓం హౌం ఓం జూం సః భూర్భువస్సువః ఉర్వారుకమివబన్ధనాత్ ఓం నమోభగవతే రుద్రాయ త్రిపురాన్తకాయ హ్రాం హ్రీం అనామికాభ్యాం నమః
ఓం హౌం ఓం జూంసః భూర్భువస్సువః మృత్యోర్ముక్షీయ ఓం నమో భగవతే రుద్రాయ త్రిలోచనాయ ఋగ్యజుస్సామ మంత్రాయ కనిష్ఠికాభ్యాం నమః

ఓం హ్రోం ఆం జూం సః భూర్భువస్సువః మామృతాత్ ఓం నమో భగవతే రుద్రాయ అగ్నిత్రయాయ జ్వలజ్వల, మాం రక్ష రక్ష, కరతల కరపృష్ఠాభ్యాం నమః

**షడఙ్గన్యాసః** - ఓం హ్రోం ఆం జూం సః భూర్భువస్సువః త్ర్యమ్బకం ఓం నమో భగవతే రుద్రాయ శూలపాణయే హృదయాయ నమః।

ఓం హ్రోం ఓం జూంసః భూర్భువస్సువః యజామహే ఓం నమో భగవతే రుద్రాయ అమృతమూర్తయే మాముజ్జీవయ శిరసే స్వాహా।

ఓం హ్రోం ఓం జూం సః భూర్భువస్సువః ఉర్వారుకమివ బన్ధనాత్ ఓం నమో భగవతే రుద్రాయ త్రిపురాన్తకాయ హాం హాం కవచాయహుం ఓం హ్రోం ఓం జూంసః భూర్భువస్సువః ఋగ్యజుస్సామమన్త్రాయ నేత్ర త్రయాయ వౌషట్-

ఓం హ్రోం ఓం జూం సః భూర్భువస్సువః, మామృతాత్ ఓం నమోభగవతే రుద్రాయ అగ్నిత్రయాయ జ్వలజ్వల, మాం రక్ష రక్ష, అఘోరాస్త్రాయ ఫట్

**మంత్రాక్షరన్యాసః**

ఓం హ్రోం జూం సః భూర్భుస్సువః త్ర్యం నమః (పూర్వదిశలో)

ఓం హ్రోం ఓం జూం సః భూర్భువస్సువః బం నమః (పశ్చిమదిశలో)

ఓం హ్రోం ఓం జూం సః భూర్భువస్సువః కం నమః (దక్షిణ దిశలో)

ఓం హ్రోం ఓం జూం సః భూర్భువస్సువః యం నమః (ఉత్తరదిశలో)

ఓం హ్రోం ఓం జూం సః భూర్భువస్సువః జాం నమః (వక్షఃస్థలమున)

ఓం హ్రోం జూం సః భూర్భువస్సువః మం నమః (కంఠములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః హేం నమః (ముఖములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః సుం నమః (నాభిలో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః గం నమః (హృదయములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః ధిం నమః (వీపులో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః పుం నమః (కడుపులో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః ష్టిం నమః (గుహ్యములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః వం నమః (పృష్ఠములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'ర్ధం' నమః (దక్షిణ ఊరు మూలములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః నం నమః (వామ ఊరుమూలములో)

ఓం హ్రౌం ఓం' జూం సః భూర్భువస్సువః ఉం నమః (దక్షిణ ఊరు మధ్యలో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః ర్వాం నమః (వామోరుమధ్యములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'రుం' నమః (కుడి మోకాలులో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'కం' నమః (ఎడమ (మోకాలులో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'మిం' నమః (దక్షిణ జానువృత్తములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః వం నమః (వామజాను వృత్తములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'బం' నమః (దక్షిణస్తన భాగములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'ధం' నమః (వామస్తనభాగములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'నాం' నమః (దక్షిణ పార్శ్వములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'మృం' నమః (వామ పార్శ్వములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'త్యోం' నమః (దక్షిణ పాదములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'ముం' నమః (వామ పాదములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'క్షీం' నమః (దక్షిణ కరములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'యం' నమః (వామ కరములో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'మాం' నమః (దక్షిణ నాసికలో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'మృం' నమః (వామనాసికలో)

ఓం హ్రౌం ఓం జూం సః భూర్భువస్సువః 'తాత్' నమః (భ్రూమధ్యంలో)

(ఆయా మంత్రములను ఉచ్చరించుచు కుడి వ్రేళ్ళ కొనలతో ఆయా ప్రదేశములను తాకుచు ఆయా మంత్రాక్షరముల శక్తి ఆయా శరీర భాగములందు నెలకొని జపమువలని దైవిక శక్తిని ధరించుటకు తగినవగుటను మనస్సులో భావించుకొనవలెను.

| | | |
|---|---|---|
| పదన్యాస:- | ఓం త్ర్యంబకం నమః | (శిరస్సులో) |
| | ఓం యజామహే నమః | (భ్రూ మధ్యలో) |
| | ఓం సుగన్ధిం నమః | (కన్నులలో) |
| | ఓం పుష్టి వర్ధనం నమః | (నోటిలో) |
| | ఓం ఉర్వారుకం నమః | (చెక్కిళ్ళలో) |
| | ఓం ఇవ నమః | (హృదయములో) |
| | ఓం బన్ధనాత్ నమః | (కడుపులో) |
| | ఓం మృత్యోః నమః | (గుహ్యములో) |
| | ఓం ముక్షీయ నమః | (గుదములో) |
| | ఓం మాం నమః | (మోకాళ్ళలో) |
| | ఓం అమృతాత్ నమః | (పాదములో) |

ఉన్నట్లు భావించుకొనవలెను.

## మృత్యుంజయ ధ్యానము

*హస్తాభ్యాం కలశద్వయామృత రసై రాప్లావయన్తం శిరో*
*ద్వాభ్యాం తౌ దధతం మృగాక్షవలయే ద్వాభ్యాంవహన్తంవరమ్*
*అఙ్కన్యస్త కరద్వయామృతఘటం కైలాసకాన్తం శివం*
*స్వచ్ఛాంభోజ గతం నవేన్దుముకుటం దేవం త్రినేత్రం భజే ॥*

అను శ్లోకమును మనస్సులోనే చెప్పుకొనుచు దాని ప్రకారము భగవంతుని దివ్య స్వరూపమును మనస్సున భావించుకొని మృత్యుంజయ మహా మంత్రమును సంకల్పమున మొదట చెప్పుకొన్న

విధమున సంఖ్యల ననుసరించి (108, 10, 100
జపము చేయవలెను.

జపము ముగిసిన తర్వాత మృత్యుంజయుని ఫ
(కొన్ని పుస్తకములలో ముందు పూజ, తర్వాత
విధింపబడియున్నది. కాని ధ్రువునకు నారదుడు,
తపోవిధానముననుసరించి ధ్యానము వలన స్థూలప
జపమువలన సూక్ష్మశరీరగత సూక్ష్మమనస్సును
గావించుకొని పూజచేయు విధము ఇక్కడ పేర్కొన
పాఠకులు మంత్రసిద్ధులు సదాచార స
మహనీయులనాశ్రయించి వారు బోధించిన విధమును
మంచిది.)

### మృత్యుంనయ పూజావిధానము

మృత్యుంజయ స్వామి పటమునో శివలింగమునో
ఉంచుకొని చేతులు జోడించి అంజలించుచు ఆ
పుష్పాక్షతలుంచుకొని సూర్యమండల మధ్యమున
హృదయముననో స్వామిని ధ్యానించవలెను.

*ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।*
*ఉర్వారుక మివబన్ధనాన్మృత్యో ర్ముక్షీయ మామృతాత్*

సద్యోజాతం ఆవాహయామి, భగవన్తం మృత్యు
ఆవాహయామి అని పేర్కొనుచు ఒక దీపము ను
దీపమును వెలిగించుచున్నట్లు, సూర్యమండలము ను
సూక్ష్మ తేజోరూపమున తన కుడినాసిక నుండి
ప్రాణవాయువులో లీనమై హృదయస్థానమును చే
భావించుచు పుష్పమును అక్షతలను (విసరివేయక
వినయముతో స్వామి పాదముల మీద ఉంచవలెను.

సమయమున సాన్నిధ్యము కల్పించి తన పూజకై స్వామి అరుదెంచి విరాజిల్లు చుండుటను భావించినపుడు భక్తి పూరితమైన మహానందము మనస్సులో ఉప్పొంగవలెను, ముఖము ప్రసన్నము కావలెను. ('ఏదో లాంఛనముగ జేయుచున్నట్లు భావింపవలదు. స్వయముగా భగవంతుడు ఎదుట విరాజిల్లుచున్న మహావిశ్వాసము దృఢపడినచో పాఠకులు ధన్యులగుదురు. పూజయు మహాఫలప్రద మగును.)

ఓం త్ర్యమ్బకమ్ యజామహే సద్యోజాతాయవైనమో నమః ఆసనం సమర్పయామి, పుష్పాక్షతలను ఆసనము మీద ఉంచునది.

ఓం త్ర్యంబకం యజామహే భవే భవే నాతి భవే

భవస్యమామ్ పాద్యంసమర్పయామి ఉద్ధరిణిలో నీళ్ళు తీసికొని స్వామి పాద సమీపమున చూపి ఆ నీళ్ళు భగవంతుని చరణారవిందములను సోకి పవిత్రము అగుచున్నట్లు ఒక్క నిమిషము మనస్సున భావనను తెచ్చుకొని పిదప ఆ తీర్థమును వేఱొక పాత్రలో పోయవలెను.

ఓం త్ర్యంబకం యజామహే భవోద్భవాయనమః అర్ఘ్యం సమర్పయామి.

(ఇక్కడ పాఠకులు ఒక విషయమున శ్రద్ధచూపవలెను. గుళ్ళలో దేవునిముందు ఐదు లేదా మూడు పాత్రలలో తీర్థము ఉంచుకొని పూజచేయుట చూచుచున్నాము. అట్లే ఇంటిలోను పూజకును మూడు పాత్రలలో తీర్థము, వేఱువేఱుగా ఉద్ధరిణి మరొక పాత్రలో తీర్థము మరొక పాత్ర ఉంచుకోవలెను. ఏలన, మనము కాళ్ళు కడుగుకొను నీళ్ళను పుక్కిలించుటకు, త్రాగుటకు ఉపయోగింపరాదు. కాళ్ళు కడుగు నీళ్ళు వేఱు, స్నానజలము వేఱు, త్రాగు తీర్థము వేఱు. ఒక దానితోనొకటి కలియరాదు. అయితే స్వామికి సమర్పించినవి మాత్రము పాద్యము అర్ఘ్యము ఆచమనీయము, స్నానీయము, పానీయములగు తీర్థములన్నియు

కలిసిన తీర్థము మనకు మహా ప్రసాదముగ గ్రహింపతగినది. కా
ముందు పాద్యము సమర్పించి, వేరుగా ఉంచుకొన్న నీటితో త
చేయికడిగికొని, ఒకే ఉద్ధరిణియైన దానిని గూడ కడిగి తర్వా
అర్ఘ్యమునకు ఉంచుకొన్న తీర్థమును స్వామికి సమర్పింపవలెను
పాద్యమునకు, స్నానమునకు ఉపయోగించు తీర్థమున
సమర్పించునపుడు మాత్రము ఇట్లు తనచేయికడుగులోన వలెను
అర్ఘ్యము ఇచ్చి తర్వాత కడుగనవసరము లేదు. (స్వామి చేతులలో
తీర్థమును సమర్పించునట్లు భావించుచు పటమున చేతులవద్ద
లింగమధ్య భాగమున తీర్థము చూపునది.

తిరుపతి మున్నగు క్షేత్రములలో అర్చకులు పూజ చేయుటన
గమనించిన ఈ ఆచార విధానము తెలియగలదు. ప్రారంభమున
కొంత తికమకలుగ నున్నను అలవాటుపడిన పిదప సులభము
మెలకువతో చేయవలెను. భగవద్విషయమున అలసత్వము, అజాగ్రత్త
పనికిరాదు). (లౌకికముగ ఘరానా మనుష్యులు ఇచ్చు టీ పార్టీలు
మున్నగువానినిలో ఎన్నో ఫార్మాలిటీస్ అనుసరించుట. ఆవశ్యక
మట. అట్లుండగా మన జీవితము, ప్రాణమునైయున్న
భగవద్విషయమున మాత్రము ఎట్లున్నను సరే అన్న భావము
కూడదు. లౌకిక విషయమున తెలియని తనము అజాగ్రత్త
నవ్వుపాలగునట్లు చేయునుగాని కొంపమునుగదు. భగవద్విషయమున
అపచారము ఎన్నో కీళ్ళకు కారణ మగును. పాఠకులు గమనించ
ప్రార్థన. అయితే పొరబడినచో భగవంతుడు మన్నించును.
తెలియకచేసిన నవ్వి యూరకుండును. అహంకారముతో, మదముతో,
ప్రవర్తించిన యెడల ఎంత మాత్రమును ఓర్వడు 'ఎలా పూజచేయాలి'
అను పుస్తకమున మరికొన్ని విషయములు పేర్కొనబడును.
శ్రద్ధావంతులగు పాఠకులు గుర్తింప ప్రార్థన.

ఓం త్ర్యంబకం యజామహే, వామదేవాయనమః స్నానం
సమర్పయామి భగవంతుని దివ్య శరీరముమీద తీర్థము ప్రవహించి

తన్ను శుద్ధపరచుకొన్నట్లును, ఆ తీర్థము స్వామి పాదములమీదుగా తన శిరమునుండి జాఱుచు తన్ను ధన్యునొనర్చుచున్నట్లును భావించవలెను.

*ఓం భవందేవం తర్పయామి, ఓం శర్వం దేవం తర్పయామి,*
*ఓం ఈశానందేవం తర్పయామి, పశుపతిందేవం తర్పయామి,*
*ఓం రుద్రందేవం తర్పయామి, ఓం మహాన్తం దేవం తర్పయామి*

*ఓం మృత్యుఞ్జయ మహారుద్ర త్రాహిమాం శరణాగతమ్ ।*
*జన్మమృత్యుజరావ్యాధి పీడితం కర్మబన్ధనైః ॥*

*శ్రీమహామృత్యుఞ్జయ స్వరూపిణం సామ్బశివం తర్పయామి*
*తర్పణాత్మకం విశిష్ట స్నానం సమర్పయామి*

(ఈ ఒక్కొక్క మంత్రమును నివేదించుచు ఉద్ధరిణితో తీర్థమును భగవంతునకు చూపవలెను. ఇక్కడ పాలు, పెరుగు, నేయి, తేనె, కలకండ పొడి కలిపిన పంచామృత స్నానమును సమర్పించుట విశేషము. స్నానానంతరము పట్టు వస్త్రముతో తాను స్వామి శరీరమును తుడుచుచున్నట్లు తడినియార్చుచున్నట్లు భావించవలెను. స్వామికి పట్టువస్త్రములు ధరింపనిచ్చినట్లు, పుష్పహారాదులు సమర్పించినట్లు భావించవలెను).

ఓం త్ర్యమ్బకం యజామహే శ్రేష్ఠాయనమో రుద్రాయనమః మధుపర్కం సమర్పయామి
ఓం త్ర్యమ్బకం యజామహే కాలాయనమః గన్ధం సమర్పయామి (చందనమును స్వామి శరీర హృదయ భాగమున నుంచవలెను).
ఓం త్ర్యమ్బకం యజామహే కలవికరణాయ నమో బల వికరణాయ నమో బలాయనమో బలప్రమథనాయ నమః అక్షతాన్ పుష్పాణి సమర్పయామి

ఓం త్ర్యమ్బకం యజామహే, సర్వభూత దమనాయ నమః

ధూపం సమర్పయామిః సాంబ్రాణి ధూపము చూపవలెను. లేదా ఊదుకడ్డీలు వెలిగించి చూపవలెను. మనోన్మనాయ నమః

ఓం త్ర్యంబకం యజామహే

దీపం దర్శయామి (పుష్పాక్షతలు చేతనుంచుకొని వాటితో దీపమును స్వామికి చూపి పుష్పాక్షతలు పాదములో సమర్పింపవలెను.)

ఓం త్ర్యమ్బకం యజామహే భవోద్భవాయనమః

నైవేద్యమ్ ఆచమనీయమ్ సమర్పయామి పుష్పాక్షతలుగల కుడిచేతితో నైవేద్య వస్తువులను స్వామి నోటి కందించుచున్నట్లు దివ్యముఖారవిందము తేజోమయముగ అరుణకాంతులీను పెదవుల సమీపమున చేతినుంచి ఆ తేజః కిరణములు నైవేద్యమును తాకుటను భావించి క్షణము ఉండి పుష్పములను పాదములందుంచి ఉద్ధరిణిలో తీర్థము పెదవుల దగ్గర స్వామి ఆచమించుచున్నట్లు భావించి సమర్పణము చేయవలెను.

తర్వాత మృత్యుంజయ స్వామినేనమః ఫలాన్‌సమర్పయామి తాంబూలం సమర్పయామి, అని వానిని చూపి నివేదించవలెను.

కర్పూర హారతి చూపవలెను. మృత్యుంజయ స్వామి మంత్రమును ఉచ్చరించుచు కర్పూర నీరాజనమును సమర్పించునది.

పుష్పాంజలిం సమర్పయామి, దోసిళ్ళలో పూవులుంచుకొని స్వామి పాదముమీద చల్లవలెను. నమస్కారం సమర్పయామి సాష్టాంగ నమస్కారము చేయవలెను.

పుష్పాంజలిం సమర్పయామి పుష్టాంజలి సమర్పింపవలెను.

అనేన మృత్యుఞ్జయ శివపూజనేన భగవాన్ సామ్బ సదాశివః

ప్రీయతామ్ అని ఉద్ధరిణి తీర్థము సమర్పించి నమశ్శివాయ మంత్రము జపించుచు క్షమాపణ వేడుకొనుచు క్రింది శ్లోకములు ఉచ్చరించుచు సాష్టాంగ నమస్కృతులు సమర్పించవలెను.

*మృత్యుఞ్జయ మహారుద్ర త్రాహిమాం శరణాగతమ్ ।*
*జన్మమృత్యుజరావ్యాధి పీడితం భవబన్ధనైః ॥*

*యదక్షరపదభ్రష్టం మాత్రాహీనంచ యద్భవేత్ ।*
*తత్సర్వం క్షమ్యతాం దేవ ప్రసీద పరమేశ్వర ॥*

*అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణం మమ ।*
*తస్మాత్ కారుణ్య భావేన రక్ష రక్ష మహేశ్వర ॥*

ఇది నిత్య పూజా విధానము. విశేష జపము, విశేష దినములలో ఇంకను విస్తృతముగా రుద్రాష్టాధ్యాయి పఠింపుచు అభిషేకాదులు చేయుట విశేష ఫలితము నిచ్చును.

వివిధ మృత్యుంజయ మంత్రోపాసనా విధులు

మునుపు మృత్యుంజయ మంత్రములు ముప్పది విధములవఱకు సంప్రదాయజ్ఞుల అనుష్ఠానముననున్నట్లు పేర్కొనబడినది. ఆ వైవిధ్యములు ఇప్పుడు వివరింపబడుచున్నవి.

(1) త్ర్యక్షరీ మృత్యుంజయ మంత్రము :- ఆచమన, ప్రాణాయామ, సంకల్పములుచేసి ముగిసిన తర్వాత, వినియోగః - కుడి చేతిలో తీర్థము పుచ్చుకొని,

''అస్య శ్రీ త్ర్యక్షరాత్మక మృత్యుంజయ మంత్రస్య, కహోలఋషిః
గాయత్రీ ఛన్దః, మృత్యుఞ్జయమహాదేవోదేవతా । జూం
బీజం, సం శక్తిః సర్వరోగ నివృత్తయే జపే వినియోగః ॥ (అని చెప్పి తీర్థమును విడిచి న్యాసము చేయవలెను).

ఋష్యాదిన్యాసః - ఓం కహోలఋషయే నమః (శిరస్సులో) ఓం గాయత్ర్యై ఛందసే నమః (నోటిలో) మృత్యుఞ్జయ మహాదేవాయ నమః (హృదయములో) ఓం జూం బీజాయ నమః - (గుహ్యములో) ఓం సః నమః (పాదములో) ఓం కీలకాయ నమః (నాభిలో) వినియోగాయ నమః (సర్వాంగములలో)

కరన్యాసః, హృదయాదిన్యాసః -

ఓం సాం అంగుష్ఠాభ్యాం నమః, ఓం సీం తర్జనీభ్యాం నమః,
ఓం సూం మధ్యమాభ్యాం నమః, ఓం సైం అనామికాభ్యాం నమః,
ఓం సీం కనిష్ఠికాభ్యాం నమః, ఓం సః కరతలకరపృష్ఠాభ్యాం నమః
ఓం సాం హృదయాయనమః, ఓం సీం శిరసే స్వాహా,
ఓం సూం శిఖాయై వషట్, ఓం సైం కవచాయహుం
ఓం సౌం నేత్రత్రయాయ వౌషట్, ఓం సః అస్త్రాయ ఫట్

(ఓం - సమస్త మంత్రములకు, దివ్య శక్తులకు, సృష్టి స్థితిలయములకు ఆధారమైన బీజాక్షరము. 'జూం' దుష్ట శక్తులను ఉచ్చాటన (తరిమివేయు శక్తికల) బీజాక్షరము. సః రుద్రుని అష్టవిధ అగ్న్యాత్మక స్వరూపముల శక్తిని తనలో గలిగిన బీజాక్షరము దీని. వివరణ వేద విజ్ఞానము న వివరింపబడును).

**ధ్యానము:-**

*చన్ద్రార్కాగ్ని విలోచనం స్మితముఖం పద్మద్వయాన్తః స్థితం*
*ముద్రాపాశ మృగాక్షసూత్ర విలసత్ - పాణిం హిమాంశుప్రభమ్।*
*కోటీరేన్దుగళత్సుధాప్లుతతనుం హారాదిభూషోజ్జ్వలం*
*కాన్త్యా విశ్వవిమోహనం పశుపతిం మృత్యుఞ్జయం భావయే ॥*

(దీని భావము - చంద్రుడు, సూర్యుడు, అగ్ని అను మూటిని మూడు కన్నులుగ గలవాడు, ప్రసన్నముఖుడు, రెండు తామరల మధ్య విరాజిల్లుచున్నవాడు, నాలుగు హస్తములలోను వరుసగా ముద్ర,

పాశము, జింక అక్షలమా లను వానిని ధరించివనాడును, చంద్రునివలె తెల్లగా వెలుగు శరీరము కలవాడు, మస్తకమందలి చంద్రమండలము నుండి జాఱుచున్న అమృతధారలలో మునిగి యున్నవాడును, హారాదులగు సొమ్ములు ధరించినవాడును, తన శరీర కాంతివలన లోకములన్నింటిని మోహింప జేయుచున్న వాడునగు మృత్యుంజయ స్వామిని ధ్యానించుచున్నాను).

అని ధ్యానించి మానసికముగ క్రింది మంత్రములు పఠించుచు పూజ చేయవలెను.

ఓం లం మృత్యుఞ్జయ స్వామినే నమః, పృథివ్యాత్మకం గన్ధం పరికల్పయామి
ఓం హం మృత్యుఞ్జయ స్వామినే నమః, ఆకాశాత్మకం పుష్పం పరికల్పయామి
ఓం యం మృత్యుఞ్జయ స్వామినే నమః ధూప మాఘ్రాపయామి
ఓం రం మృత్యుఞ్జయస్వామినే నమః, దీపం ప్రదర్శయామి
ఓం 'వం' మృత్యుఞ్జయ స్వామినే నమః, నైవేద్యం పరికల్పయామి
ఓం 'సం' మృత్యుఞ్జయ స్వామినే నమః, తాంబూలాద్యుపచారాన్ సర్వాత్మికాన్ సమర్పయామి

అని మానసికముగ పంచభూతాత్మిక పూజచేసిన పిదప ''ఓం జూం సః'' అను మూడక్షరముల మంత్రమును సంకల్పమునకు తగిన సంఖ్యలో జపము చేయవలెను. కడవట - భగవదర్పణము, క్షమాపణ వేడుకొనుట మున్నగువానిని ముందు మంత్రమున చెప్పినట్లే గ్రహించునది.

(2) మృత్యుఞ్జయ మన్త్ర సంపుటితవ్యాస మంత్రము

మంత్రమహోదధిలో'' మృత్యుఞ్జయేన పుటితం యోవ్యాస మంత్రం జపేత్, సర్వోపద్రవ సన్త్యక్తో లభతే వాంఛితం ఫలమ్ - అని మృత్యుంజయ మంత్ర సంపుటిత వ్యాసమంత్ర జపము

సర్వరోగములను తీర్చి కోరిక లన్నింటిని తీర్చగలదని పేర్కొనబడియున్నది. మరియు ఆ గ్రంథమునందే,

తారశ్శూలీ వామకర్ణ బిన్దుయుక్తస్సనర్గకః ।
మృత్యుంజయస్య మన్త్రోఽయం త్రివర్ణోమృత్యునాశనః ॥

జప్తోయం కేవలం నృణాం ఇష్టసిద్ధిం ప్రయచ్ఛతి ।
కిం పునస్తేన పుటితో వేదవ్యాసమనూత్తమః ॥

తారం అనబడు ఓంకారము వామకర్ణము బిందు యుక్తము 'జూ' అనుశూలి, విసర్గతో కూడిన 'న' అను ఈ మూడు అక్షరములు అనగా ''ఓం' జూం సః'' అనబడు మంత్రము మృత్యువును పోగొట్టును. ఈ మంత్రమును మాత్రము జపము చేసినను మనుష్యునకు ఇష్టార్థసిద్ధులు కలుగును. ఇక సంపుటిత వ్యాస మంత్ర మైనపుడు ఎంతగొప్ప ఫలితము నిచ్చునో వేఱుగా చెప్పవలెనా అని ఈ మంత్రము యొక్క విశిష్టత పేర్కొనబడియున్నది.

తీవ్రమైన జబ్బునకు గుఱియై ఎన్ని చికిత్సలకును లొంగక, ఏ వ్యాధియో గుర్తింపనలను గాక రోగి బాధపడుచున్నయెడల అతని క్షేమమును సంకల్పించుకొని ఆ రోగి యొక్క బంధు మిత్రాదులు నియ మముతో పరమ విశ్వాసముతో ఈ మంత్రమును జపించినచో మృత్యుంజయ స్వామి అనుగ్రహమున మేలు కలుగునని అభిజ్ఞుల నమ్మకము.

వినియోగః - అస్య శ్రీ వ్యాసమంత్రస్య బ్రహ్మఋషిః అనుష్టుప్ ఛన్దః సత్యవతీసుతో దేవతా వ్యాం బీజం నమః, శక్తిః మమ రోగజ్ఞానపూర్వకం తన్నివృత్తయే మృత్యుఞ్జయసంపుటిత వ్యాసమంత్రజపే వినియోగః

కరన్యాసః- వ్యాం అంగుష్ఠాభ్యాం నమః, వ్యీం తర్జనీభ్యాం నమః, వ్యూం మధ్యమాభ్యాం నమః, వ్యైం అనామికాభ్యాం నమః,

వ్యోం కనిష్ఠికాభ్యాం నమః వ్యః కరతల కరపృష్ఠాభ్యాం నమః ।

హృదయాదిన్యాసః -

వ్యాం హృదయాయనమః, వ్యీం శిరసే స్వాహా, వ్యూం శిఖాయైవషట్ ।
వ్యైం కవచాయహుం వ్యౌం నేత్రత్రయాయ వౌషట్ వ్యం అస్త్రాయఫట్

ధ్యానము

*వ్యాఖ్యాముద్రికయా లసత్కరతలం సద్యోగపీఠస్థితం*
*వామేజానుతలే దధానమవరం హస్తం సువిద్యానిధిమ్ ।*
*విప్రవ్రాతవృతం ప్రసన్నమనసం పాథోరుహాంగద్యుతిమ్*
*పారాశర్య మతీవ పుణ్యచరితం వ్యాసం భజే సిద్ధయే ॥*

(వ్యాఖ్యా ముద్రతో గూడిన కరతలము కలవాడు, యోగాసనమున నెలకొన్నవాడు, మరొక చేతిని ఎడమ మోకాలిమీద ఉంచుకొన్నవాడు, విద్యానిధి, మిక్కిలి పుణ్యాత్మకుడు పరాశర మహర్షి కుమారుడు అయిన వ్యాసభగవానుని సిద్ధి ప్రాప్తికై స్మరించుచున్నాను.)

ఇట్లు ధ్యానించి మానసికముగ పాద్యము, అర్ఘ్యము ఆచమనీయము మున్నగువానిని అర్పించి పూజించవలెను. పిదప

''ఓం జూంసః వ్యాం వేదవ్యాసాయ నమః, సః జూం ఓం''

అను మంత్రమును ఎనిమిదివేల మార్లు జపము చేసిన రోగనిర్ణయము ఏర్పడి చికిత్స అనుకూల మగును.

(3) అనుష్టుప్ త్ర్యమ్బక మంత్రజపము

'శారదాతిలకము'ను మంత్ర శాస్త్రమున అనుష్టుప్ త్ర్యంబక మంత్రము పేర్కొనబడి యున్నది.

జపమును మొదలు పెట్టదలచిన దినమునకు పూర్వదినమున శివాలయమునకు బోయి ప్రాయశ్చిత్తాదులు చేసికొని మరునాడు ఉదయమున సుస్నాతుడై శివాలయమున కూర్చుండి జపము చేసిన విశేష ఫలితము నిచ్చును.

సంకల్పము :

శ్రీ మృత్యుఞ్జయ ప్రీత్యై త్ర్యంబక మంత్రజప పురశ్చరణమహం కరిష్యే, తదఙ్గ తయాచ భూత శుద్ధి, ప్రాణప్రతిష్ఠా మాతృకాన్యాసం మూలమంత్రన్యాస పూర్వక మన్త్రరాజస్య ఆవరణ పూజాంచ కరిష్యే

వినియోగః - అస్య శ్రీకణ్ఠాదికలాన్యాసస్య, దక్షిణా మూర్తిఋషిః, గాయత్రీ ఛన్దః, అర్ధనారీశ్వరో దేవతా హలోబీజాని స్వరాః శక్త్యశ్చ తుర్విధ పురుషార్థసిద్ధ్యర్థేన్యాసే వినియోగః-

ఋష్యాంన్యాసః-

ఓం దక్షిణామూర్తయే నమః (శిరస్సులో) ఓం గాయత్రీ ఛన్దసేనమః (ముఖములో) ఓం అర్ధనారీశ్వర దేవతాయై నమః (హృదయములో) ఓం హలబీజాయ నమః (గుహ్యములో) ఓం స్వరశక్తయే నమః (పాదములలో) ఓం వినియోగాయ నమః (సర్వాంగములలో)

కరన్యాసః, హృదయన్యాసః,

ఓం 'హ్సౌం' అంగుష్ఠాభ్యాం నమః, ఓం హ్సీం తర్జనీభ్యాం నమః, ఓం హ్సూం మధ్యమాభ్యాం నమః, ఓంహ్సైం అనామికాభ్యాం నమః ఓం హ్సౌం' కనిష్ఠికాభ్యాన నమః ఓం హ్సః - కరతల కరపృష్ఠాభ్యాం నమః

ఓం హ్సాం హృదయాయ నమః, ఓం హ్సీం శిరసే స్వాహా, ఓం వహూ్సాం శిఖాయై వషట్, ఓం హ్సైం కవచాయహుం, ఓంహ్సౌం నేత్రత్రయాయ వౌషట్ - ఓం హ్సః - అస్త్రాయఫట్ -

ధ్యానమ్ - *పాశాఙ్కుశవరాక్షస్రక్పాణి శీతాంశుశేఖరమ్ ।*
*త్ర్యక్షం రక్తసువర్ణాభ మర్ధనారీశ్వరం భజే ॥*

*బన్ధూకకాఞ్చననిభం రుచిరాక్షమాలాం*
*పాశాఙ్కుశౌచ వరదం నిజబాహుదణ్డైః ।*
*బిభ్రాణమిన్దు శకలాభరణం త్రినేత్ర*
*మర్ధాంబికేశ మనిశం వపురాశ్రయామః ॥*

ఇట్లు ధ్యానము చేసిన తర్వాత క్రింది విధమున న్యాసము చేయవలెను.

ఓం హ్సౌం అం శ్రీకణ్ఠేశపూర్ణోదరీభ్యాం నమః - (మస్తకములో న్యాసము)

'' '' ఆ అనన్తేశ విరజాభ్యాం నమః (నోటిలో)

'' '' ఇం సూక్ష్మే శశాల్మలీ భ్యాంనమః (కుడికంటిలో)

'' '' ఈం త్రిమూర్తి లోలాక్షీభ్యాం నమః (ఎడమ కంటిలో)

'' '' ఉం అమరేశ వర్తులాక్షీభ్యాం నమః (కుడి చెవిలో)

'' '' ఊం అర్ఘీశ దీర్ఘఘోణాభ్యాం నమః (ఎడమ చెవిలో)

'' '' ఋం భారభూతేశ - దీర్ఘఘోణాభ్యాం నమః (కుడి ముక్కు రంద్రములో)

'' '' ౠం తిథీశ గోముఖీభ్యాం నమః (ఎడమ ముక్కు రంధ్రములో,

'' '' ఌం స్థాణ్వీశ దీర్ఘజిహ్వాభ్యాం నమః (కుడి చెక్కిలిలో)

'' '' ౡం హరేశ కుణ్డోదరీభ్యాం నమః (ఎడమ చెక్కిలిలో)

'' '' ఏం ఝుంటీశి ఊర్ధ్వకేశీభ్యాం నమః (పైపెదవిలో)

'' '' ఐం భౌతికేశ వికృతముఖీభ్యాం నమః (క్రింది పెదవిలో)

'' '' ఓం సద్యోజాతేశ జ్వాలాముఖీభ్యాం నమః

(పైవలువరుసలో)

'' '' ఔం అనుగ్రహేశోల్కాముఖీభ్యాం నమః (క్రింది పలువరుసలో)

'' '' అం అక్రూరేశ శ్రీముఖీభ్యాం నమః (తలలో)

'' '' అః మహాసేనేశ విద్యాముఖీభ్యాం నమః (నోటి నడుమ)

'' '' కం క్రోధీశ మహాకాళిభ్యాం నమః (కుడి మూవులో)

'' '' ఖం చణ్డేశ సరస్వతీభ్యాం నమః (కుడి మోచేయి)

'' '' 'గం' పంచాన్తకేశ సర్వసిద్ధిగౌరీభ్యాం నమః (కుడిమణికట్టులో)

'' '' 'ఘం' శివోత్తమేశ - త్రైలోక్య విద్యాభ్యాం నమః (కుడిప్రేళ్ళ మొదలు)

'' '' 'ఙం' ఏకరుద్రేశ మన్త్రశక్తిభ్యాం నమః (కుడిచేతి ప్రేళ్ళమొనలో)

'' '' చం కూర్మేశాత్మ శక్తిభ్యాం నమః (ఎడమ మూవులో)

'' '' 'ఛం' ఏకనేత్రేశ మూలమాతృకాభ్యాం నమః (ఎడమ మోచేతిలో)

'' '' 'జం' చతురాననేశ లంబోదరీభ్యాం నమః (ఎడమ మణిబంధము)

'' '' 'ఝం' అజేశ ద్రవిణీభ్యాం నమః (ఎడమచేతి ప్రేళ్ళకొనలు)

'' '' 'ఞం' సర్వేశనాగరీ భ్యాంనమః (ఎడమచేతిప్రేళ్ళకొనలలో)

'' '' 'టం' సోమేశఖేచరీభ్యాం నమః (కుడి మూవు అడుగు భాగములో)

'' '' 'ఠం' లాఙ్గలీశ మంజరీభ్యాం నమః (కుడి మోకాలులోగము)

'' '' 'డం' దారుకేశ రూపిణీభ్యాం నమః (కుడి కాలిమడమలో)

'' '' 'ఢం' అర్ధనారీశ వీరిణీభ్యాం నమః (కుడికాలి వ్రేళ్ళ మొదలు)

'' '' 'ణం' ఉమాకాంతే1శ కాకోదరీభ్యాం నమః (కుడికాలి వ్రేళ్ళ మొనలో)

'' '' 'తం' ఆషాడీశపూతనాభ్యాం నమః (వామ పాదోరుమూలములో)

'' '' 'థం' దండీశ భద్రకాళీభ్యాం నమః (ఎడమ మోకాలిలో)

'' '' 'దం' అత్రీశ యోగినీభ్యాం నమః (ఎడమకాలి మడములో)

'' '' 'ధం' మీనేశ శంఖినీభ్యాం నమః (ఎడమకాలి వ్రేళ్ళ మొదలు)

'' '' 'నం' మేషేశ తర్జనీభ్యాం నమః (ఎడమకాలి వ్రేళ్ళ మొనలో)

'' '' 'పం' లోహితేశ కాళరాత్రిభ్యాం నమః (కుడి పార్శ్వములో)

'' '' 'ఫం' శిఖీశ కుబ్జినీభ్యాం నమః (ఎడమ పార్శ్వములో)

'' '' 'బం' ఛగలాండేశ కపర్దినీభ్యాం నమః (పృష్ఠ భాగములో)

'' '' 'భం' ద్విరండేశ వజ్రాభ్యాం నమః (నాభిలో)

'' '' 'మం' మహాకాళేశ జయాభ్యాం నమః (కడుపులో)

'' '' 'యం' త్వగాత్మభ్యాం వాలీశ సుముఖేశ్వరీభ్యాం నమః (హృదయము)

'' '' 'రం' అసృగాత్మభ్యాం భుజగేశ రేవతీభ్యాం నమః (కుడి భుజము)

'' '' 'లం' మాంసాత్మభ్యాం పినాకీశ మాధవీభ్యాం నమః (మెడ వెనుక భాగములో)

'' '' 'వం' మేద ఆత్మభ్యాం ఖడ్గీశవారుణీభ్యాం నమః (హృదయమున మొదలు ఎడమ భుజము వరకు)

'' '' 'శం' అస్థ్యాత్మభ్యాం కేశవాయవీభ్యాం నమః (హృదయము మొదలు కుడిచేతి వరకు)

'' '' 'షం' మజ్జాత్మభ్యాం శ్వేతేశ రక్షోవిదారిణీభ్యాం నమః
(హృదయము మొదలు ఎడమచేయి వరకు)
'' '' 'సం' శుక్రాత్మభ్యాం భృగ్వీశ సహజాభ్యాం నమః
(హృదయ మొదలు ఎడమకాలిమొనవరకు)
'' '' 'హం' ప్రాణాత్మభ్యాం లకులీశ లక్ష్మీభ్యాం నమః
(హృదయమొదలు కుడి పాదాగ్రము వరకు)
'' '' 'లం' శక్త్యాత్మభ్యాం శివేశ వ్యాపినీభ్యాం నమః
(హృదయము '' '' నాభివఱకు 'క్షం' పరమాత్మభ్యాం సంవర్తకేశ మాయాభ్యాంనల :- హృదయము ముదలు
శిరోంతమువఱకు

ఇట్లు న్యాసమొనర్చిన తర్వాత ధ్యానము చేయవలెను.

ధ్యానమ్:- అత్ర రుద్రా స్మృతా రక్తా ధృతాశూలికపాలకాః।
శక్తయోరుద్రపీఠస్థాః సిన్దూరారుణవిగ్రహా: ॥

రక్తోత్పల కపాలాభ్యా మలంకృత కరాంబుజాః।
న్యస్తాస్తిష్ఠతు సర్వేపి శక్తి సౌఖ్యవివర్ధ నాః॥

ఇట్లు ధ్యానమొనర్చి మూలమహామృత్యుంజయమన్త్రముతో ప్రాణాయామము చేయవలెను. ''కృతోయం శ్రీకంఠాదిన్యాసః శివార్పణమస్తు అని నీళ్ళు విడువవలెను.

మూలమన్త్రన్యాసాది చేయవలెను :-

వినియోగః - అస్య శ్రీ త్ర్యమ్బకమన్త్రస్య వసిష్ఠఋషి:, అనుష్టుప్ ఛన్దః, త్ర్యంబకః పార్వతీపతిర్దేవతా త్ర్యం బీజం, బం శక్తిః, కం కీలకమ్, మమ సర్వరోగ నివృత్తయే (లేదా సర్వాభీష్టసిద్ధయే) త్ర్యంబకమన్త్ర జపే వినియోగః

ఋష్యాదిన్యాసః-

ఓం వసిష్ఠ ఋషయే నమః (తలలో) ఓం అనుష్టుప్ ఛన్దసే నమః (నోటిలో) ఓం త్ర్యంబక దేవతాయైనమః (హృదయములో) ఓం త్ర్యం బీజాయనమః (గుహ్యములో) ఓం బం శక్తయే నమః

(పాదములలో) ఓం కం కీలకాయ నమః (నాభీ ప్రదేశములో) ఓం వినియోగాయ నమః (సర్వాంగములలో)

కరన్యాసః, హృదయాదిన్యాసః,

ఓం త్ర్యంబకం :- అంగుష్ఠాభ్యాం నమః, ఓం యజామహే తర్జనీభ్యాం నమః, ఓం సుగన్ధిం పుష్టి వర్ధనం మధ్యమాభ్యాం నమః, ఓం ఉర్వారు కమివబన్ధనాత్ అనామికాభ్యాం నమః, ఓం మృత్యోర్ముక్షీయ కనిష్ఠి కాభ్యాం నమః ఓం అమృ తాత్ కరతల కరపృష్ఠాభ్యాం నమః

ఓం త్ర్యంబకం నమః - హృదయాయ నమః

ఓం యజామహే శిరసే స్వాహా, ఓం సుగన్ధిం పుష్టి వర్ధనమ్ శిఖాయైవషట్, ఉర్వారుక మివబన్ధనాత్ కవచామహుమ్ - ఓం మృత్యోర్ముక్షీయ నేత్రత్రయాయవౌషట్
ఓం అమృతాత్ - అస్త్రాయ ఫట్

అంగన్యాసః-

| | |
|---|---|
| ఓం త్ర్యం నమః (పూర్వముఖే) | ఓం హేం నమః (ముఖే) |
| ఓం బం నమః (పశ్చిమముఖే) | ఓం సుం నమః (నాభౌ) |
| ఓం కం నమః (దక్షిణముఖే) | ఓం గం నమః (హృది) |
| ఓం యం నమః(ఉత్తర ముఖే) | ఓం ధిం నమః (పృష్ఠౌ) |
| ఓం జాం నమః (ఉరసి) | ఓం ష్టిం నమః (గుహ్యే) పుం నమః (కుక్షౌ) |
| ఓం మం నమః (కంఠే) | ఓం వం నమః (గుదే) |
| ఓం 'రుం' నమః (ధక్షిణజానుని) | ఓం నాం నమః (దక్షిణ పార్శ్వే) |
| ఓం కం నమః (వామజానుని) | ఓం మృం నమః (వామపార్శ్వే) |
| ఓం మిం నమః (దక్షిణజానువృత్తే) | ఓం త్యోం నమః (దక్షిణపాదే) |

ఓం వం నమః (వానజానువృత్తే) ఓం క్షీం నమః (దక్షిణకరే)
ఓం బం నమః (దక్షిణస్తనే) ఓం యం నమః (వామకరే)
ఓం ధం నమః (వామస్తనే) ఓం మాం నమః (దక్షిణనాసాయాం)
ఓం నం నమః (వామోరుమూలే) ఓం తాత్ నమః (మూర్ధ్ని)

పదన్యాసః-

ఓం త్ర్యంబకం నమః (శిరసి) ఓం బన్ధనాత్ (జఠరే)
ఓం యజామహే (భ్రువౌ) ఓం మృత్యోః (లింగే)
ఓం సుగన్ధిం (నేత్రయోః) ఓం ముక్షీయ (గుదే)
ఓం పుష్టివర్ధనమ్ (ముఖే) ఓం మాం (జాన్వోః)
ఓం ఉర్వారుకం (గణ్డయోః) ఓం అమృతాత్ (పాదయోః)
ఓం ఇవ (హృదయే)

ధ్యానమ్

*హస్తాభ్యాం కలశద్వయామృత రసైరాప్లావయన్తంశిరో*
*ద్వాభ్యాం తౌ దధతం మృగాక్షవలయే ద్వాభ్యాం వహన్తం వరమ్।*
*అఙ్కన్యస్త కరద్వయామృతఘటం కైలాసకాన్తం శివం*
*స్వచ్ఛాంభోజగతం నవేన్దుముకుటం దేవం త్రినేత్రం భజే ॥*

ఇట్లు ధ్యానముచేసిత్ర్యంబకయంత్రములో మూలమంత్రముతో మూర్తి కల్పనచేసి త్ర్యంబకేశ్వరునకు మానసికముగ ఉపచారము సమర్పించి పూజచేసి చెప్పబడనున్న ఐదు ముద్రలుచూపునమది.

(త్ర్యంబక యంత్రమహాగ్రంథముకడపట కలదు)

ఈ యంత్ర మధ్యమున త్ర్యంబకేశ్వరుని ధ్యానముచేసి ఐదు ముద్రలను ప్రదర్శింపవలెను.

ముష్టి సారంగ శక్త్యాఖ్య లిఙ్గ పంచముఖాభిధాః ।
ముద్రాః ప్రదర్శ్య ప్రజపేల్లక్షం తస్య విధానతః ॥

ముష్టి , మృగము, శక్తి లింగము, పంచముఖము అను ముద్రలను యంత్రమునకు చూపి తర్వాత లక్షమార్లు మంత్రపురశ్చరణ చేయవలెను.

1) ముష్టి :- ముష్టి ముద్రను ప్రదర్శించువిధము: ముష్టిం దక్షిణహస్తేన విధాయోర్ధ్వం సమున్నయేత్ ।
ముద్రా ముష్ట్యభిధా ఖ్యాతా సర్వవిఘ్నవినాశిని ॥

కుడిచేతి వ్రేళ్ళను ముడిచి ముష్టి బంధించి పైకెత్తి పట్టుకొనుట ముష్టి ముద్రయగును. ఇది సమస్త విఘ్నములను పోగొట్టును.

2) మృగ ముద్ర :- దక్షస్యానామికాఙ్గుష్ఠ మధ్యమాగ్రాణి యోజయేత్ ।
శిష్టేద్వే ఉచ్ఛ్రితే కుర్యాత్ మృగముద్రేయ మీరితా ॥

కుడిచేతి అనామిక, అంగుష్ఠము, మధ్యమాంగుళుల అగ్రభాగములను కలిపి, తర్జని కనిష్ఠ కల ఊర్ధ్వముఖముగ నిలుపుట మృగముద్రయగును.

3) శక్తి ముద్ర :- ముష్టీకరౌ విధాయద్వౌ వామస్యోపరి దక్షిణమ్ ।
కృత్వాశిరసియుంజీత శక్తిముద్రేయమీరితాః ॥

ఇరు చేతులను ముష్టిగా ఉంచుకొని ఎడమ ముష్టి మీద కుడి ముష్టి నుంచి వానిని తలమీద ఉంచుకొన్న శక్తి ముద్రయగును.

4) లిఙ్గముద్ర :- ఉచ్ఛ్రితం దక్షిణాంగుష్ఠం వామాంగుష్ఠేన బన్ధయేత్ ।
లిఙ్గముద్రేయమాఖ్యాతా శివసాన్నిధ్యకారిణీ ॥

వామాంగుళీర్ద క్షిణాభిరంగు ళీభిశ్చబంధయేత్ ॥
కుడిచేతి బొటనవ్రేలిని పైకిచూపి ఎడమ చేతి అంగుష్ఠముతో చుట్టి

బంధించినట్లు పట్టి ఎడమచేతి వేళ్ళను కుడిచేతి వ్రేళ్ళతో కలిపి పట్టుకొనుట లింగముద్ర యగును.

5) పంచముఖ ముద్ర
మణిబన్ధకరౌ యుక్తావఙ్గళ్యగ్రాణి యోజయేత్ ।
ముద్రాపంచముఖాఖ్యేయం దర్శితా శివతోషిణీ ॥

మరోబంధముతో గూడిన రెండు చేతులు వ్రేళ్ళ మొనలు కలిపిన పంచముఖ ముద్రయగును. శివునకు ఇది మిక్కిలి ప్రీతికరమైనది.

అథ ఆవరణపూజా :- యంత్రమందు షట్కోణములందు హృదయాది షడంగముల పూజ చేయవలెను.

1-6 ఓం త్ర్యంబకం హృదయాయ నమః
ఓం యజామహే శిరసేస్వాహా
ఓం సుగన్ధిం పుష్టివర్ధనమ్ శిఖాయై వషట్
ఓం ఉర్వారుకమివ బన్ధనాత్ కవచాయకుహుం
ఓం మృత్యోర్ముక్షీయ నేత్రత్రయాయ వౌషట్
ఓం మామృతాత్ అస్త్రాయఫట్

2) రెండవ ఆవరణలో : అష్టదళ పద్మమున అష్టమూర్తులను పూజింపవలెను.

7-14 ఓం అర్కమూర్తయే నమః ఓం ఇన్ద్రమూర్తయే నమః
ఓం వసుధా మూర్తయే నమః ఓం తోయ మూర్తయే నమః
ఓం వహ్నిమూర్తయే నమః ఓం వాయుమూర్తయే నమః
ఓం ఆకాశమూర్తయే నమః ఓం యజమాన మూర్తయే నమః

3. తృతీయ ఆవరణము:- ఇందు కొంచెము మీది ప్రదేశమున ఎనిమిది శక్తి పూజలు చేయవలయును.

15-22 ఓం రమాయై నమః
ఓం ప్రభాయై నమః

ఓం పూర్ణాయై నమః
ఓం పూరణ్యై నమః
ఓం శకాయై నమః
ఓం జ్యోత్స్నాయై నమః
ఓం ఊషాయై నమః
ఓం సుధాయై నమః

ుగవ ఆవరణ వమున ఇంచుక మీద ప్రదేశమున మరొక ుది శక్తులను పూజించవలెను.

30 ఓం విశ్వాయై నమః
ఓం సితాయై నమః
ఓం సారాయై నమః
ఓం శివాయై నమః
ఓం విద్యాయై నమః
ఓం ప్రహ్వాయై నమః
ఓం సన్ధ్యాయై నమః
ఓం నిశాయై నమః

ఆవరణమున ఇంచుక మీది ప్రదేశమున మరొక ఎనిమిది ును పూజించవలెను.

–38 ఓం ఆర్యాయై నమః
ఓం మేధాయై నమః
ఓం ధృత్యై నమః
ఓం ప్రజ్ఞాయై నమః
ఓం శాన్త్యై నమః
ఓం సత్యై నమః
ఓం ప్రభాయై నమః
ఓం కాన్త్యై నమః

ఆవరణమున కొంచెము మీద ప్రదేశమున ఎనిమిది శక్తులను ంచవలెను.

6 ఓం ధరాయై నమః
ఓం పద్మాయై నమః
ఓం జయాయై నమః
ఓం మాయాయై నమః
ఓం శాన్తాయై నమః
ఓం అమలాయై నమః
ఓం అవిన్యై నమః
ఓం మోఘాయై నమః

ఆవరణమునందు భూపురమున ఇంద్రాది దిక్పాలకులను ుప్ప మున్నగు దిక్కులలో పూజించవలెను.

47-54 ఓం ఇన్ద్రాయ నమః ఓం అగ్నయే నమః
ఓం ఋతయే నమః ఓం వరుణాయ నమః
ఓం కుబేరాయ నమః ఓం ఈశానాయ నమః
ఓం బ్రహ్మణే నమః ఓం అనన్తాయ నమః
ఓం యమాయ నమః
ఓం వాయవే నమః

ఎనిమిదవ ఆవరణమున వజ్రాది ఆయుధములను పూజించవలెను

55-64 ఓం వజ్రాయ నమః ఓం ఖడ్గాయ నమః
ఓం దండాయ నమః ఓం అంకుశాయ నమః
ఓం పాశాయనమః ఓం త్రిశూలాయ నమః
ఓం గదాయై నమః ఓం చక్రాయ నమః
ఓం పద్మాయ నమః
ఓం శక్త్యై నమః

ఈ విధముగా 64 చోట్లలో ఆవరణ పూజచేసి, గంధాక్షతలు పువ్వులు కలిపి పూజచేయవలెను. తర్వాత ధూప, దీప, నైవేద్యము ఆరతి, మంత్ర పుష్పాంజలి మున్నగువానిని విధి ప్రకారముచేసి మూలమంత్రమును ఒక లక్ష పురశ్చరణ చేయవలెను మూలమంత్రము 32 అక్షరములు కలది.

*త్ర్యంబకం ,యజామహే, సుగంధిం పుష్టి వర్ధనమ్ ।*
*ఉర్వారుక మివబన్ధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥*

పురశ్చరణ తర్వాత అందు పదవ భాగము హోమము చేయవలెను. అందు బిల్వము, చంద్ర, మఱ్ఱి, నువ్వులు, ఆవాలు, పాయసము, పాలు, పెరుగు, పలాశము, దూర్వా అను పది ద్రవ్యములను నేతిలో ముంచి ఆహుతి చేయదవేను హోమమున ఆహుతి సంఖ్యలో పదింట ఒక భాగమున మూల మంత్రము పఠించి కడపట ఓం త్ర్యమ్బకం దేవం తర్పయామి అని తర్పణము చేయవలెను. అందు దశమాంశమునకు రోగి శరీరమును మార్జన చేయవలెను. (అభిషేకము

చేయవలెను. లేదా మంత్రజలమును దర్భలతో రోగిశిరమున ప్రోక్షింపవలేను. అందు పదింట ఒక భాగము సంఖ్యగల విప్రులకు భోజనము పెట్టవలెను. యంత్రమును వెండిలో చేయించి ప్రతిష్ఠచేసి ఈ పదార్థములతోనే ఆవరణ పూజ చేయవలెను. తర్వాత జపము చేయవలెను. జపము తర్వాత త్ర్యంబక సహస్రనామార్చన, స్తోత్రపాఠము మున్నగునవి చేయవలెను.

ప్రాణములకు సంకటము కలిగించుచు దుర్భర రోగము ఎంతకు తీఱక యుండినచో శతాక్షరా గాయత్రి మంత్రము. గాయత్రీ మన్త్రగర్భిత త్ర్యంబక మంత్రము జపము చేయించుట మంచిది.

శతాక్షరా గాయత్రీ మంత్రజప విధానము:- వినియోగః అస్య శతాక్షరా గాయత్రీ మహామంత్రస్య విశ్వామిత్ర మరీచి-కశ్యప-వసిష్ఠ-ఋషయః, గాయత్రి - త్రిష్టుప్ అనుష్టుప్ ఛన్దాగ్ంసి, సవితృ జాతవేదస్ త్ర్యమ్బకా దేవతాః, గాయత్ర్యక్షరాణి బీజాని అనుష్టు బక్షరాణి శక్తయస్త్రి ష్టుబక్షరాణి కలకాని, మమ అరిష్టశాన్తయే జపే వినియోగః-

**ఋష్యాదిన్యాసః—**

విశ్వామిత్ర మరీచి కశ్యవ వసిష్ఠ ఋషిభ్యో నమః (శిరసి)
గాయత్రీ త్రిష్టు బనుష్టుప్ ఛన్దేభ్యోనమః (ముఖే)
సవితృ జాతవేదస్త్ర్యంబక దేవేభ్యోనమః (హృదయే)
గాయత్రక్షరేభ్యో బీజేభ్యోనమః (గుహ్యే)
అనుష్టు బక్షరేభ్యో శక్తిభ్యోనమః (పాదయోః)
త్రిష్టుబక్షరేభ్యః కీల కేభ్యోనమః (నాభౌ)
వినియోగాయ నమః (సర్వాంగే)

**కరన్యాసః షడఙ్గన్యాసః—**

ఓం తత్సవితృ ర్వరేణ్యాం భర్గోదేవస్య ధీమహి అంగుష్ఠాభ్యాం నమః
ఓం ధియోయోనః ప్రచోదయాత్ - తర్జనీభ్యాంనమః

ఓం జాతవేదసే సునవామ సోమరాతీయతో నిద హాతివేదః మధ్యమాభ్యా నమః
ఓం సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సిన్ధుం దురితాత్యగ్నిః అనామికాభ్యాం నమః
ఓం త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ కనిష్ఠికాభ్యాం నమః
ఓం ఉర్వారుకమివ బన్ధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ కరతల కరపృష్ఠాభ్యాం నమః
(హృదయాదిన్యాసః)

*ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి హృదయాయ నమః*
*ఓం ధియోయోనః ప్రచోదయాత్ శిరసేస్వాహా*
*ఓం జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః -శిఖాయైవషట్*
*ఓం సనః వర్షదాతిదుర్గాణి విశ్వానావేవ సిన్ధుం దురితాత్యగ్నిః కవచాయహుం*
*ఓం త్ర్యమంబక యజామహే సుగన్ధిం పుష్టి వర్ధనమ్ నేత్రత్రయాయవౌషట్*
*ఓం ఉర్వారుక మివబన్ధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ అస్త్రాయఫట్*
ధ్యానమ్

స్మర్తృవ్యాఖిల లోక వర్తిసతతం యజ్జఙ్గమస్థావర
వ్యాప్తం యేన చ యత్ ప్రపఞ్చవిహితం ముక్తిః యతస్సిద్ధ్యతి
యద్వాస్యాత్ ప్రణవ త్రిభేదగహనం శ్రుత్వాచ యద్గీయతే
తద్వస్తు స్థితి సిద్ధయేఽస్తు వరదం జ్యోతిస్త్రయోత్థం మహః ॥

ఇట్లు వినియోగ న్యాస ధ్యానాదులు చేసి క్రింది మంత్రమును జపము చేయవలెను. సంపూర్ణ మూలమంత్రము :-

ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్

*ఓం జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః ।*
*సనః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవసిన్ధుం దురితత్యగ్నిః ।*
*ఓం త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనం, ఉర్వారుకమివ*
*బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥*

యథాశక్తి (సంఖ్యలో) జపముచేసి, 'అనేన శతాక్షరా గాయత్రీ జపాఖ్యేన కర్మణా సవితృజాతవేదస్త్ర్యంబక దేవతాః ప్రీయతామ్ - అని నీళ్ళు విడువవలెను.

షట్ ప్రణవాత్మక మహామృత్యుఞ్జయ మంత్రమువల్ల శీఘ్రముగా మంత్రము సిద్ధియగును. పురుష మంత్రమునకు మునుపు భైరవీ మంత్రమును, స్త్రీ దేవతకు చెందిన మంత్రమైన భైరవ మంత్రమును దశాంశము అంగమంత్రముగా జపము చేయుట మంచిది.

మునుపటవలె వినియోగము చెప్పుచు ''అంగోపాంగసహిత' అని చెప్పుకొనవలెను. న్యాసధ్యానములు మునుపటివలెనేచేసి క్రింది మంత్రములను జపము చేయవలెను.

అమృతేశ్వర మంత్రము :- ఓం శ్రీం హ్రీం మృత్యుఞ్జయే భగవతి చైతన్య చన్ద్రే హంససంజీవని స్వాహా. (ఈ మంత్రమును దశాంశము జపము చేయవలెను.

ప్రథమ పాద మంత్ర జపము :- ఓం హౌం జూంసః ఓం భూర్భువ స్వః, ఓం త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్. ఓం శివ

(ఈ మంత్రమును దశాంశము జపము చేయవలెను.)

మూల మంత్ర జపము :- ఓం జూంసః ఓం భూర్భువస్స్వః ఓం త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్ట వర్ధనమ్ ఓం హౌం ఉర్వారుకమివ బన్ధనాన్మృ త్యోర్ముక్షీయ మానమృతాత్. ఓం జూం త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ఓం సః ఉర్వారుక మివబన్ధనాన్మృత్యోర్మక్షీయ మామృతః శ్రీ శివ-

పంచాక్షర శివమంత్రము ఓం నమః శివాయ (దశాంశము) జపము చేయవలెను. ఈ విధమున మృత్యుంజయ మంత్ర జపము కొలది సంఖ్యలో, చేసినను గొప్ప ఫలితము నిచ్చును.

## అమృతేశ్వరీ మంత్రము

మృత్యుంజయోపాసనవలెనే భగవతి అమృతేశ్వరి మంత్ర యంత్ర పూజా విధానములు తంత్ర శాస్త్రములో ప్రసిద్ధములై యున్నవి.

శ్రీ భువనేశ్వరీ మహా స్తోత్రములో—

శ్రీ మృత్యుఞ్జయ నామధేయ భగవచ్చైతన్య చంద్రాత్మికే
హ్రీంకారి ప్రథమా తమాంసి వలయ త్వం హంససంజీవిని ।
జీవం ప్రాణవిజృమ్భమాణ హృదయగ్రన్థిస్థితం మే కురు,
త్వాం సేవే నిజబోధ లాభరభసా స్వాహాభుజామీశ్వరీమ్ ।

అని భగవతి, అమృతేశ్వరి విశిష్టత పేర్కొనబడి యున్నది.

మూల మంత్రము :- ఓం శ్రీం హ్రీం మృత్యుఞ్జయే భగవతి చైతన్యచంద్రే హంస సంజీవిని స్వాహా ॥

ఈ మంత్రమునకు ధ్యానము :-

జాగ్రద్బోధసుధామయూఖ నిచయైరాప్లావ్య సర్వాదిశో
యస్యాః కాపి కలా కలఙ్కరహితా షట్ చక్రమాక్రామతి ।
దైన్య ధ్వాన్త విదారణైకచతురా వాచం పరాంతన్వతీ
సానిత్యా భువనేశ్వరీ విహరతాం హంసీవ మన్మానసే ॥

## ధర్మరాజ మన్త్ర విధానము

సర్వరోగములను పోగొట్టునదైన ధర్మరాజమంత్రము 'మంత్ర మహోదధి'లో పేర్కొనబడియున్నది.

ఈ మంత్రమునకు వినియోగము ఋష్యాదిన్యాసములు లేవు. షడంగ న్యాసము మాత్రముకలదు.

షడంగన్యాసః -

ఓం క్రోం హ్రీం హృదయాయనమః, ఓం ఆం వైం శిరసేస్వాహా ఓం వైవస్వతాయ శిఖాయైవషట్, ఓం ధర్మరాజాయ కవచాయహుమ్, ఓం భక్తానుగ్రహకృతే నేత్రత్రయాయ వౌషట్, ఓం నమః, అస్త్రాయ ఫట్

ధ్యానమ్

పాథఃసంయుత మేఘసన్నిభతనుః ప్రద్యోతన స్యాత్మజో, ।
నృణాం పుణ్యకృతాం శుభావహవపుః పాపీయసాం దుఃఖ కృత్ ।
శ్రీమద్దక్షిణ దిక్పతిర్మహిషగోభూ షాభరాలంకృతితో
న్యేయః సంయమనీపతిః పితృగణస్వామీ యమోదణ్డభృత్ ॥

నీళ్ళు నండిన మేఘమువలె నల్లని శరీరవర్ణము కలవాడు, సూర్యుని కుమారుడు, పుణ్యాత్ములకు అధిపతి, మహిషవాహనుడు, గొప్ప భూషణములచే అనుకరించుకొన్నవాడు సంయమనీపురమును నివాసముగ కలవాడు పితృగణములకు స్వామి దండధరుడు అగు ధర్మరాజునకు నమస్కారము).

ఈ స్వరూపమును మనస్సున ధ్యానించి మానసిక పూజచేసి జపము చేయవలెను.

మూలమంత్రము—

''ఓం హ్రీం క్రోం ఆం వైవస్వతాయ ధర్మరాజాయ భక్తానుగ్రహకృతే నమః''

ప్రతి దినము ఈ మంత్రమును జపము చేయువారియెడ ధర్మరాజు ప్రసన్నుడై ఆపదల నన్నింటిని తీర్చును.

సహస్రాక్షర మృత్యుంజయ మాలామంత్రము.

మృత్యుంజయ స్వామికి లేదా లింగమునకు అభిషేకము,

పుష్పార్చనక్షా బెలో ర్చన మున్నగునవి చేయుచు ఈ సహస్రాక్షర మంత్ర జపము చేయుట విశేష ఫలితము నిచ్చును.

''ఓం నమో భగవతే సదాశివాయ సకలతత్త్వాత్మకాయ సర్వమన్త్రరూపాయ సర్వయన్త్రాధిష్ఠితాయ సర్వతన్త్రస్వరూపాయ సర్వతత్త్వ విద్వరాయ బ్రహ్మరుద్రావతారిణే నీలకణ్ఠాయ పార్వతీ ప్రియాయ సోమ సూర్యాగ్నిలోచనాయ భస్మోద్ధూళిత విగ్రహాయ మహామణిముకుట ధారణాయ మాణిక్యభూషణాయ సృష్టిస్థితి ప్రలయకాల రౌద్రావతారాయ దక్షాధ్వరధ్వంసకాయ మహాకాల భేదకాయ మూలాధారైక నిలయాయ తత్త్వాతీతాయ గంగాధరాయ సర్వదేవాధిదేవాయ షడాశ్రయాయ వేదాన్తసారాయ త్రివర్గసాధనాయానేక కోటి బ్రహ్మణ్డనాయకాయానన్త వాసుకి తక్షక కర్కోటక శఙ్ఖ కులిక పద్మమహా పద్మాద్యష్ట నాగకుల భూషణాయ ప్రణవస్వరూపాయ చిదాకాశాయాకాశాది స్వరూపాయ గ్రహనక్షత్ర మాలినే సకలాయ కళఙ్కరహితాయ సకలలోకైక సాక్షిణే సకలనిగమ గుహ్యాయ సకల వేదాన్త పారగాయ సకలలోకైక కర్త్రే సకలలోకైక హర్త్రే సకలలోకైక భర్త్రే సకలలోకైక సాక్షిణే సకలనిగమ గుహ్యాయ సకలవేదాన్త పారగాయ సకలలోకైక వరప్రదాయ సకలలోకైక శఙ్కరాయ శశాఙ్కశేఖరాయ శాశ్వతనిజావాసాయ నిరాభాసాయ నిరామయాయ నిర్మలాయ నిర్లోభాయ నిర్మోహాయ నిర్మదాయ నిశ్చిన్తాయ నిరహఙ్కారాయ నిరాకులాయ నిష్కళఙ్కాయ నిర్గుణాయ నిష్కామాయ నిరాతఙ్కాయ నిష్ప్రపఞ్చాయ నిస్సంగాయ నిర్ద్వన్ద్వాయ నిరాధారాయ నిరోగాయ నిష్క్రోధాయాయ నిర్గమాయ నిష్పాపాయ నిర్భయాయ నిర్వికల్పాయ నిర్భేదాయ నిష్క్రియాయాయ నిస్తులాయ నిస్సంశయాయ నిరఞ్జనాయ నిరుపమవిభవాయ నిత్యశుద్ధబుద్ధపరిపూర్ణపూర్ణ సచ్చిదానన్దాదృశ్యాయ పరమశాన్తస్వ రూపాయ తేజోరూపాయ తేజోమయాయ జయజయ మహారౌద్ర భద్రావతార మహాభైరవ కాలభైరవ కల్పాన్తభైరవ కపాల మాలాధర ఖట్వాఙ్గ ఖడ్గ పాశాఙ్కుశ డమరు త్రిశూల చాప బాణ గదా శక్తి బిన్దిపాల తోమర ముసల ముద్గర పట్టిశ పరశుపరిఘ భుశుణ్డి

శతఘ్నీ చక్రాద్యాయుధ భీషణ కర సహస్రముఖ దంష్ట్రాకరాళ వికాకటాట్టహాస విస్ఫారిత బ్రహ్మాణ్డ మణ్డల నాగేన్ద్రకుణ్డల నాగేన్ద్రహార నాగేన్ద్ర వలయ నాగేన్ద్ర చర్మధర మృత్యుఞ్జయ త్ర్యమ్బక త్రిపురాన్తక విరూపాక్ష విశ్వేశ్వర, విశ్వరూప వృషవాహన విశ్వతోముఖ సర్వతో మాం రక్ష రక్ష। జ్వల జ్వల మహామృత్యు భయమప మృత్యుభయం నాశయ నాశయ రోగ భయముత్సాద యోత్సాదయ విషసర్పభయం శమయ శమయ చోరాన్ మారయ మారయ మమ శత్రూనుచ్చాట యోచ్చాటయ త్రిశూలేన విదారయ విదారయ కుఠారేణ భిన్ధిభిన్ధి ఖడ్గేన ఛిన్ధిఛిన్ధి ఖట్వాఙ్గేన విపోథయ నిపోథయ ముసలేన నిష్పేషయ నిష్పేషయ బాణైః సన్తాడయ సన్తాడయ రక్షాంసి భీషయ భీషయ భూతాని విద్రావయ విద్రావయ కూష్మాణ్డ వేతాళ మారీచ బ్రహ్మరాక్షసగణాన్ సన్త్రాసయ సన్త్రాసయ మామభయం కురు కురు విత్రస్తం మామాశ్వాసయ నరకభయాద్ మాముద్ధరోద్ధర సంజీవయ సంజీవయ క్షుత్తృడాభ్యాం మామాప్యాయయాప్యాయయ దుఃఖాతురం మామానన్ద యానన్దయ శివకవచేన మామాచ్ఛాద యాచ్ఛాదయ మృత్యుఞ్జయ త్ర్యమ్బక సదాశివ నమస్తే నమస్తే నమస్తే స్వాహా॥

ఇంతవఱకు మృత్యుంజయ స్వామిని గుఱించిన వివిధ మంత్రములు పేర్కొనబడినవి. ఇక మృత్యుంజయ స్వామిని గుఱించిన యంత్రములు వివరింపబడును. మొదట మంత్రములను, వాని ప్రాముఖ్యమును గుఱించి ఇక్కడ కొంత వివరించుట ఆవశ్యకము.

## యంత్రముల ప్రాముఖ్యము

నీటిలో విద్యుచ్ఛక్తి కలదు. కాని దానిని ప్రయోజనపఱచుకొనుటకు ఎన్నో యంత్రములు ఆవశ్యకములై యున్నవికదా. అట్లే అఖండము, పరిపూర్ణము, నిత్యము, సర్వ వ్యాప్తమునైన దైవశక్తి ప్రయోజనకరమై వెలయుటకు ఈ ప్రకృతిలో సూర్యచంద్ర గ్రహతార కాదులవంటి అసంఖ్యాక యంత్రపరికరములను ఆ పరతత్త్వముతానే సృష్టించుకొన్నది. అదే

విధముగ మన శరీరముకూడ ఒక విచిత్ర, దైవ సంకల్పమువల్ల కల్పింపబడిన యంత్రమై యున్నది. కర్మేంద్రియములు, కడుపు, జీర్ణకోశము, విసర్జకావయవములు మున్నగు భాగములు భౌతిక శక్తి కేంద్రములై భౌతిక శరీర రక్షణకువలసిన కార్యముల నిర్వహించు యంత్రములు కాగా మెదడు, వెన్నెముక, అందలి నరములు, నాభీ కేంద్రము మున్నగు వానినితో కూడిన నాడీమండలము ఆధ్యాత్మిక శక్తికి కేంద్రములై మానవుని జ్ఞానసాధనకు, దైవానుగ్రహము వలన బ్రహ్మానందము పొందుట కుపకరించు ముఖ్య యంత్రమై వెలసి యున్నది. ఈ ద్వివిధ కేంద్రములకు కూడలియై రెండింటిని సక్రమముగా నడపుచు వెలసియుండునది హృదయకోశము, దానికి సంబంధించిన శ్వాస కేంద్రము మున్నగునవి. ఈ మూడు విధముల యంత్ర ప్రక్రియలు మానవజాతి మనుగడకు, అభ్యుదయమునకు హేతువులై యున్నవి.

జీవిత లక్ష్యమును, పరమార్థమును గుర్తించిన వివేకవంతుడు భౌతిక శక్తి సంపన్నమైన ఐహిక జీవితమును, పారమార్థిక ప్రయోజనసిద్ధికై వినియోగించుకొన గలుగుచున్నాడు. ఈ ప్రక్రియలో అతనికి నాడీమండలము ముఖ్య కేంద్రముమై యున్నది.

ప్రాణాయామము మన ప్రాణశక్తిని చక్కగా వినియోగించుకొని మూలాధారమందు నెలకొనియున్న పరాశక్తిని ఉద్దీప్తమొనర్చి హృదయకోశమున ఆత్మజ్యోతిని సమ్మిళితముచేసి ఆ రెండింటిని మెదడులోని సహస్రారస్థిత సదాశివ తత్త్వముతో ఐక్యపరచుటయే దివ్యసాధనము బ్రహ్మత్వసిద్ధి యగును. అందుకు గల ఉపాయము మంత్రసిద్ధిని పొందుటయే. మంత్రసిద్ధిని సాధించుటకు అన్ని శక్తులకు ఆధారమై యున్న శరీరము ఆరోగ్యవంతమై యుండవలెనుగదా! ఈ లక్ష్యసిద్ధికి కావలసిన ఆరోగ్యము, భౌతిక బలము, మానసిక బలము, జ్ఞానశక్తి మొదలైనవన్నింటిని అనుగ్రహించగల మహామృత్యుంజయ స్వామి మంత్ర జప విధానము ఇంతవఱకు

